# చిత్తూరు జిల్లా వీధినాటకాలు - ఒక పరిశీలన

## Chittooru Zilla Veedhinatakalu - Oka Pariseelana

*1998లో పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయంనుండి*
*పి. హెచ్.డి. పట్టాపొందిన గ్రంథం*

**డాక్టర్ వి. గోవిందరెడ్డి**
Dr. V. Govinda Reddy

ప్రచురణ



**రాజరాజేశ్వరి ఆర్ట్స్ అకాడమీ**
7-112 ఎ, సత్యనారాయణపురం, తిరుపతి

**CHITTOORU ZILLA VEEDHINATAKALU - OKA PARISEELANA**

By Dr V Govinda Reddy



First Published 31 12 2001

*Published by*
**Raja Rajeswari Arts Academy**
7-112 A, Satyanarayanapuram,
TIRUPATHI

Typesetting
**Mahathi Creations**
Hyd ✆ 765 1085

Printed at
**Akruti Offset Printers**
Hyd ✆ 766 4525

For Copies
**Dr. V Govinda Reddy**
7-112 A, Satyanarayanapuram,
**TIRUPATHI** Ph 80780, 80378

Price **Rs. 150/-**

ఈ గ్రంథము తిరుమల తిరుపతి దేవస్థానం మరియు
పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయంవారి ఆర్థిక సహాయంతో ముద్రించబడినది

# అంకితం



విధి వక్రించి జన్మనిచ్చిన తల్లి కాలగర్భంలో కలిసిపోగా...
ఈ లోకంలోకి వచ్చిన నాలుగు దినాల పసిగుడ్డును
అక్కున చేర్చి, లాలించి, పాలించి, పరవశించి...
గోరుముద్దలు తినిపించి.. పెంచి, పెద్దచేసి...
నా జీవన గమనానికి పూలబాటలు పరచి...
నా అభివృద్ధినే త్రికరణశుద్ధిగా కాంక్షించి...
కాలగమనంలో కలిసిపోయిన..
మా అమ్మ (మేనత్త) **శ్రీమతి ఆళ్ళనాగమ్మ** గారికి....
వినమ్రతతో ఈ గ్రంథాన్ని అంకితం చేస్తున్నా....

**- డా॥ వి. గోవిందరెడ్డి**
*రచయిత*

# ముందుమాట

మహాపురుషులు దైవభక్తి, దైవచింతన, పాపభీతి, పారమార్థిక ప్రబోధం చేయడంవల్ల సామాన్య ప్రజల్లో కూడా ఆధ్యాత్మిక చింతన చోటుచేసుకుంది భక్తి, కర్మ, జ్ఞాన, యోగ మార్గాల ద్వారా మానవున్ని ధర్మమార్గంలో నడిపించే మార్గమే ఉన్నతమైందని భారతీయుల విశ్వాసం జానపదులు భగవంతున్ని అనేక మార్గాల్లో ధ్యానించే వారు పూజల ద్వారానేకాక ఆటపాటలద్వారా కూడా భగవంతుని స్మరించే సంప్రదాయం మనది ప్రజలు స్వధర్మ నియమాలను ఆచరించక పెడమార్గంలో పడినప్పుడు వారి మనసులను భగవంతునిపై లగ్నం చేయడానికి భగవంతుని మాహాత్మ్యాలను పురాణపఠనం, నాట్యం, నాటకం, హరికథ, బుర్రకథ, బొమ్మలాట మొదలగు అనేక రూపాల్లో తెలియచేసేవారు నాటకం అనే ప్రక్రియ 'బహురూపాలు' పొంది వీధి నాటకాలుగా సామాన్య జనబాహుళ్యంలో ప్రదర్శితాలైనాయి చాలా వరకు ఈ వీధినాటకాలన్నీ పురాణ ఇతిహాసాలనుండి తీసుకొన్న ఇతివృత్తమే ప్రధానాంశాలుగా కనిపిస్తున్నాయి

వృత్తిరీత్యా ప్రభుత్వ కళాశాలల్లో ఆంధ్రోపన్యాసకులుగా ప్రవేశించినా, యువత సంక్షేమాన్ని ధ్యేయంగా పెట్టుకొని, నెహ్రూ యువకేంద్ర యువజన సమన్వయకర్తగా నా ప్రవృత్తికి తగిన వృత్తిని ఎన్నుకొన్నాను గ్రామీణ ప్రాంతాల్లో యువతీ యువకుల్లో నిద్రాణమైయున్న కళాతృష్ణను, కళానైపుణ్యాన్ని గుర్తించి వారిని ప్రోత్సహించడానికి అనేక సాంస్కృతిక కార్యక్రమాలను చేపట్టాను నేను గ్రామాలను సందర్శించి గ్రామీణ జన జీవితంలో ఉట్టిపడుతున్న జానపద కళాసంపదకు ముగ్ధుడై ఆ జానపద కళాకారులకు చంద్రునికో నూలు పోగు అన్నట్లుగా సేవచేయాలనే సంకల్పం కల్గింది నేను కళాకారుణ్ణి కాకపోయినా (కళలపట్ల) జానపద కళాకారులపట్ల, జానపద కళలపట్ల నాకున్న అభిమానమే ఈ పరిశోధనకు నన్ను ప్రేరేపించింది కడపజిల్లాలోని పులివెందుల గ్రామంలో జిల్లాస్థాయి తప్పెట పోటీలను నిర్వహించినపుడు డాక్టర్ చిగిచర్ల కృష్ణారెడ్డిగారు నాకున్న అనుభవాన్ని దృష్టిలో పెట్టుకొని చిత్తూరు జిల్లా వీధి నాటకాలపై పరిశోధనకు నన్ను ప్రేరేపించారు చిత్తూరు జిల్లా వీధినాటకాలు అనగానే ప్రతి ఒక్కరికి స్ఫురించేవి 'కంగుంది వీధి నాటకాలు' వీటికి ఎటువంటి ఆదరణ, గుర్తింపులేక మరుగున పడిపోతున్న సమయంలో వాటిని వెలుగులోకి తేవడమేగాక ఆ వీధి నాటక కళాకారులకు ఒక నూతనోత్సాహాన్ని, స్ఫూర్తిని కల్గించాలనే సంకల్పంతో ఈ పరిశోధనకు పూనుకున్నాను

బంగారు పాళ్యం మండలానికి చేరిన నల్లసిద్ధనపల్లె మా స్వగ్రామం మా గ్రామానికి చెందిన ధర్మరాజుల గుడి మా పక్క గ్రామమైన మిట్టపల్లె దగ్గర ఉంది అక్కడ ప్రతి సంవత్సరం మహాభారతాన్ని వీధినాటకంగా ప్రదర్శించేవారు నాకు ఊహ తెలిసినప్పటి నుండి వీధి నాటకాలను చూస్తున్నాను అప్పటి నుండే ఈ నాటకాల పట్ల ఆసక్తి ఉండేది అయితే పరిస్థితులు అనుకూలించనందువల్ల కళాకారుణ్ణి కాకపోయాను అయినా ఉద్యోగరీత్యా జానపద కళాకారులకు నాకు సన్నిహిత సంబంధాలేర్పడడం, వాటిపట్ల అభిమానం పెంచుకోవడం జరిగింది ఎందరో మరుగున పడి ఉన్న కళాకారులను వెలుగులోకి తెచ్చాను మన జానపద కళాసంపదను వివిధ రాష్ట్రాల్లో ప్రదర్శింపచేశాను

సొంత జిల్లాలో ప్రదర్శిస్తున్న ఈ మహాభారత వీధి నాటకాలను వెలుగులోకి లెచ్చి, గ్రంధస్థంచేసి, కళాకారులకు నా చేతనైనంత సేవ చేయాలని సంకల్పం కల్గింది

పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయంవారు ఈ పరిశోధన చేయడానికి నాకు అవకాశం కల్పించడంతో నా ఈ సంకల్పానికి రూపకల్పన చేయడం జరిగింది దీని ఫలితంగానే నా పరిశోధనను "చిత్తూరు జిల్లా వీధి నాటకాలు - ఒక పరిశీలన" అన్న విషయంగా నిర్ణయించుకొని పరిశోధనను ప్రారంభించాను దాని ఫలితమే ఈ సిద్ధాంత వ్యాసం ఈ సిద్ధాంత వ్యాసాన్ని ఐదు అధ్యాయాలుగా విభజించడం జరిగింది

ఒకటో అధ్యాయంలో చిత్తూరు జిల్లా నైసర్గిక స్వరూపాన్ని, పరిపాలనా విధానం, దర్శనీయస్థలాలు మొదలైన వాటిని వివరించి, మొదటి నాట్య గృహనిర్మాణం మొదలుకొని నేటి వీధినాటకాల నామౌచిత్యం, లక్షణాలు, వీధి నాటక కళాకారులు పాటించే నియమాలు వివరించడమైంది

వీధి నాటకాలు - ఇతి వృత్తాలు తీసుకొని, వాటి ఆధారంగా వర్గీకరించి రామాయణ, భారత, భాగవత, ఇతర ఇతివృత్త ప్రధాన వీధినాటకాలుగా వర్గీకరించడమైంది పురాణకథల్లో చేరని చారిత్రక సాంఘిక కల్పితాది కథలను ఇతర కథల వర్గీకరణలో చేర్చి పరిశీలించడం జరిగింది ఇతి వృత్తాలలో నాటక కర్తలు చేసిన మార్పులు చేర్పులు విశ్లేషించడం రెండో అధ్యాయం ప్రత్యేకత

మూడో అధ్యాయంలో వీధి నాటకాలు ప్రదర్శించే నటకులు వాడుకొనే అలంకరణ సామగ్రి, దుస్తులు, ఆభరణాలు, రంగులు మొదలైన వస్తువులను, ముఖవీణ, కంజరి లాంటి ప్రత్యేక వాద్య విశేషాలను, ఆయుధ విశేషాలను వివరణాత్మకంగా వివరించడమైంది

వీధి నాటకాలు నేర్చుకొనే శిష్యులకు గురువు ఇచ్చే శిక్షణతీరు, శిక్షణాకాలం ప్రదర్శన, రంగస్థలం మొదలుకొని ఆటమొదలు వరకు వివరించడమైంది ప్రదర్శనా పద్ధతి, వీధి నాటకంలోని రాగాలు, సంగీతం, భంగిమలు, అడుగులు మొదలగువాటి విశేషాలను సవివరంగా చర్చించడం జరిగింది లక్షణాలను చెప్పడానికి లక్ష్యంగా 'కీచకవధ' అన్న వీధి నాటక రచనను తీసుకొని విశ్లేషించడం నాలుగో అధ్యాయంలో చేశాను

ఐదో అధ్యాయంలో చిత్తూరు జిల్లాలో విశేషంగా ఆదరించబడ్డ 'కంగుంది వీధి నాటకాల' ప్రత్యేకశైలిని వివరించాను ఇందులో 'కంగుంది' నామౌచిత్యం, కంగుంది ఆస్థాన విశేషాలు, చిత్తూరు జిల్లాలో ప్రదర్శించే వీధి నాటకాలు, నాటక బృందాలు గురించి విపులంగా వివరించడమైంది అంతేగాక కంగుంది వీధినాటకాల ఆవిర్భావం, వికాసం, మొదలుకొని కంగుంది వీధి నాటకాల ప్రత్యేకశైలి, ఇతర భాషా ప్రభావం, భాషాశైలి మొదలైన విషయాలను సవివరంగా వివరించడమైంది

వీధి నాటకాలను ప్రదర్శించే అనుబంధంలో ధర్మరాజుల గుడులు, ప్రాంతాలు, మహాభారతవీధి నాటకాలను ప్రదర్శించే గ్రామ నామాల పట్టికను, సిద్ధాంత వ్యాసానికి సంబంధించిన కొన్ని చిత్రాలను చేర్చడమైంది

డా॥ గోవిందరెడ్డి

రచయిత



Jnanpith Awardee
**Dr C Narayana Reddy**, M P,
M A, Ph D, D Litt

Chairman
**Andhra Pradesh State Cultural Council**
**Government of Andhra Pradesh**
Kalabhavan, Hyderabad 500 004
Phone (O) 3214603 (R) 3548451
Fax (O) 3214603

జ్ఞానపీఠ అవార్డు గ్రహీత
**డాక్టర్ సి. నారాయణరెడ్డి**, ఎం పి,
ఎం ఏ పి హెచ్ డి డి లిట్

అధ్యక్షులు
**ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సాంస్కృతిక మండలి**
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, కళాభవన్, హైదరాబాద్ – 500 004
ఫోన్ (ఆ) 3214603 (ఇ) 3548451 ఫాక్స్ (ఆ) 3214603

# మూలాన్వేషణ

ఏ విషయాన్నయినా పైపైన చూస్తే 'ఇంతేలే' అనిపిస్తుంది. లోతుల్లోకి వెళ్లి పరిశీలిస్తే 'ఇంతుందా' అనిపిస్తుంది ఈ పరిశోధన గ్రంథం చదివితే నాకు కలిగిన స్పందన యిది

చిత్తూరు జిల్లాకు సంబంధించిన వీధినాటకాలను సేకరించి, విశ్లేషించి విశేషాలను గంపలకొద్ది అందిస్తున్న గ్రంథరత్నమిది ఉపరి పరిశీలన కాకుండా మూలాన్వేషణ ఈ గ్రంథంలోని గణనీయాంశం డా॥ గోవిందరెడ్డి చిత్తూరు జిల్లాలోని వీధి నాటకాల ఇతివృత్తాలను వివరించడంతోపాటు ఆ నాటకాల ప్రయోగ రీతులను సువిస్తృతంగా ఉల్లేఖించడం ఈ పుస్తకంలోని ప్రత్యేకత ఎన్నెన్నో ఆకరాలను సమీకరించి ఎందరెందరినో సంప్రదించి ఈ రంగంలో నిపుణుడైన డా॥ చిగిచర్ల కృష్ణారెడ్డి పర్యవేక్షణలో ప్రామాణిక పరిశోధన గ్రంథాన్ని రూపొందించిన డా॥ గోవిందరెడ్డికి నా హార్దికాభినందన

తేది 15 12 2001
హైదరాబాద్

G Rekha Rani
Director I/c




DEPARTMENT OF CULTURE
Government of Andhra Pradesh
Kalabhavan, Saifabad,
Hyderabad 500 004
Phone 3212832, 3242482, 3450069
(sectt )
Res 6629793
Fax 040 040 - 3212832

Hyderabad
Dt 25-12 2001

# ఆకాంక్ష

మన ఆచార వ్యవహారాలకు, సంస్కృతీ సాంప్రదాయాలకు దర్పణం పట్టేవి జానపద కళలు ఈ జానపద కళారూపాల్లో ప్రజల్ని అమితంగా ఆకట్టుకొని వారిలో ఆలోచనా పరం పరలను ఆవిష్కరింపచేసి, సమాజాన్ని చైతన్యవంతుల్ని చేసి, వారిలో నైతిక విలువలను పెంపొందించడానికి, దోహదపడగలిగేవి వీధినాటకాలు ఒకప్పుడు రాజులప్రాపున పోషింప బడి, జనసామాన్యుల నడుమ వీధుల్లో విజయకేతనాన్ని ఎగురవేసిన ఈ వీధినాటకాలు రాజ కీయ, సాంఘిక, కాల పరిస్థితులకు బలైపోయి, జనాదరణ లేక అంతరించిపోతున్నాయి

ప్రస్తుత పరిస్థితిలో వీధినాటకాలను గురించి పరిశోధన చేయడం, అందుకు సంబంధిం చిన కళాకారులను ప్రోత్సహించడం ఇంతటి గొప్ప కళారూపాల్ని డాక్యుమెంటేషన్ చేయడం ఎంతైనా అవసరం ఈ నేపథ్యంలో డా॥ వి గోవిందరెడ్డిగారు, "చిత్తూరుజిల్లా వీధినాటకాలు – ఒక పరిశీలన" అన్న అంశంమీద పరిశోధన చేసి, వీధి నాటకాల ఆవిర్భావ, వికాసాలను గురించి సోదాహరణంగా గ్రంథంలో వివరించడం అభినందనీయం చిత్తూరు జిల్లాను గూర్చి, పాఠకులకు అన్ని కోణాల నుండి పరిచయం చేయడం పరిశోధకుని ప్రజ్ఞాపాటవా లకు నిదర్శనం విషయసేకరణకు చిత్తూరు జిల్లాలో వివిధ ప్రదేశాలను దర్శించడంలో ఎదురైన అనేక ఇబ్బందులను, వ్యయప్రయాసలను అధిగమించడంలోను, అంతరించి పోతున్న ఈ కళారూపాన్ని గ్రంథస్థం చేయడంలోను పరిశోధకుని పట్టుదల, కార్యదీక్ష ఎంతో ప్రశంసనీయం

తన గ్రంథంలో డా॥ వి గోవిందరెడ్డిగారు వీధి నాటకాల గురించి పరిశోధన చేసి ముఖ్యంగా "కంగుంది కుప్పం" వీధినాటకాల ప్రాశస్త్యాన్ని చక్కగా వివరించడం ఎంతో ప్రశంసనీయం నా దృష్టిలో ఇది ఒక అద్భుతమైన సాహసోపేత ప్రయోగం ఈ అమూల్యమైన గ్రంథం ఉత్తరోత్తర భావి పరిశోధకులకు ఒక ప్రామాణిక గ్రంథం కాగలదని ఆకాంక్షిస్తూ

అభినందనలతో
జి రేఖ రాణి

Phone 08570 55754 (O)
55890 (R)
Fax 91 08570 55920

**DRAVIDIAN UNIVERSITY**

Kuppam - 517 425 Andhra Pradesh

**Prof B. Ramakrishna Reddy**
M A , Ph ,D (Edin ) ,
Registrar

Date 11 1 2002

# అభిలాష

భారతదేశ భాషలలో జానపదసాహిత్యం అనాది నుండి వివిధ రూపాలలో కానవస్తుంది లిఖిత, మౌఖిక సాహిత్యాలలో జానపదం రెండవ కోవకు చెందినదిగా పరిగణిస్తారు గ్రామీణ ప్రాంతాల్లోని మామూలు ప్రజలు తమ దైనందిన జీవితంలోని శ్రమ, సుఖదుఃఖాలు, జీవనవిధానం, సాంస్కృతిక విలువలు మున్నగునవి జానపదగేయాల, కళల రూపాల్లో ప్రదర్శిస్తారు అక్షరాస్యతలేని జానపదులు, గిరిజనులు ఆశుకవులవలె పాటలు, పద్యాలు ఎప్పటికప్పుడు సమకూర్చి పాడటం మన సాంస్కృతిక వారసత్వం ఈ జానపద కళారూపాల్లో అతిముఖ్యమైనది చిత్తూరుజిల్లాలో ప్రాచుర్యంలో ఉన్న వీధినాటకం వీధులలో ప్రదర్శించబడే నాటకం కనుక దీనికి ఈ పేరువచ్చినట్లు ఊహించవచ్చు

డా॥ గోవిందరెడ్డి చిత్తూరుజిల్లాలోని వీధినాటకాలను ఆమూలాగ్రంగా పరిశీలించి, విశ్లేషించి, తన పరిశోధనా అనుభవంతో ప్రస్తుత సైద్ధాంతిక గ్రంథానికి రూపకల్పన గావించారు ఈ గ్రంథంలో వీధినాటక పుట్టుపూర్వోత్తరాలు, ఇతివృత్తాలు, వస్తు సామగ్రి, రంగస్థలం, ప్రదర్శనా విధానం, కంగుంది నాటక ప్రత్యేకశైలి మున్నగు విషయాలపై సుదీర్ఘ చర్చ జరిగింది కేవలం ప్రచురిత గ్రంథాలు ఆధారంగా చేసుకొని గ్రంథరూపకల్పన గావించకుండ, చిత్తూరు జిల్లాలోని వీధినాటకాలపై మౌలిక క్షేత్రపరిశోధన జరిపి, వీధినాటక కళాకారులను వ్యవహర్తలుగా ఎన్నుకొని విషయసేకరణ గావించి, సరళమైన భాషలో వీధినాటక విశేషాలను వర్ణించడం ఎంతో మెచ్చుకోదగ్గ విషయం చిత్తూరు జిల్లాలో ఈ నాటికీ పలు ప్రాంతాలలో వీధినాటకాలను నేర్చుకోవడం, ప్రదర్శించడం పరిపాటి కంగుంది ప్రాంతపు కళాకారులు వివిధ గ్రామాలలో వీధినాటకం ప్రదర్శించడమేకాక, సామాన్యులకు కూడ ఈ నాటకాలను నేర్పించడం కలదు

డా॥ గోవిందరెడ్డి ఈ గ్రంథంలో చేకూర్చి, వివరించిన విషయాలు దక్షిణ భారతదేశంలో

ు ప్రాచుర్యంలో ఉన్న తెరుకూత్తు, కర్ణా ,కలోని బయలాట, యక్షగానం మున్నగు
పోల్చి తులనాత్మక అధ్యయనం చేపట్టడా నికి తోడ్పడుతాయి కుప్పంలోని ద్రావిడ
లయంలో ఇలాంటి కార్యక్రమాలు చేపట్టడం జరుగుతూ ఉంది వీధినాటకాలతో
నుండి ఒక ప్రేక్షకుడిగా అనుభవం ఉన్న నాకు గోవిందరెడ్డిగారి పుస్తకం
న్నప్పుడు నాటకం చూస్తున్నట్లనిపిస్తుంది ముఖ్యంగా నాలుగో అధ్యాయంలో వారు
సచిన కీచకవధ కండ్లకు కట్టినట్లనిపిస్తుంది డా॥ గోవిందరెడ్డిగారి ఈ గ్రంథం
క శైలిలో అందరికి అర్థమయ్యే రీతిలో ఉంది కనుక దీనికి బహుళ ప్రాచుర్యం
. జానపద సాహిత్యంలోని ఇతర శాఖలవలె వీధినాటకం కూడా ఇటు సాహిత్యం,
', సాంఘిక – సాంస్కృతిక పరిస్థితులు, విలువలు మున్నగు వాటిని తనలో
ఉన్న బహుముఖ సాహితీ ప్రక్రియ ఈ ప్రక్రియను విశదంగా ప్రచురించి జానపద
అపూర్వమైన సేవలను అందించగలరని ఆశిద్దాం

B Ramachandra Reddy

డా॥ కసిరెడ్డి వెంకటరెడ్డి
ఆచార్యులు, తెలుగుశాఖ,
ఉస్మానియా విశ్వవిద్యాలయం,
హైదరాబాదు - 7

భాగ్యనగర్
2002 జనవరి 18

# పరిశోధన పాథేయం

ఒక జిల్లా వీధినాటకాలను పరిశీలించడమంటే ఒక దేశం వీధినాటకాలను పరిశీలించినంత పెద్దపనే ఒకటిరెండుమూడు భేదాలు తప్పిస్తే దేశంలో ప్రదర్శింపబడే వీధినాటకాలన్నీ ఒకేవిధంగా ఉంటాయి పాఠాంతరాలను ప్రక్రియాభేదాలను వదలివేస్తే ప్రదర్శన ప్రయోజనం - ఉద్దేశం ఒకటే హేతు ప్రాదుర్భావాలు కూడా ఒకే విధంగా ఉంటాయి

అడవి మనిషి, వ్యవసాయదారుడై, గ్రామీణుడై, నాగరికుడై, గ్రామ నగర ప్రభావాలకు లోనైనవాడై, ఆధునిక జీవనంలో అందుబాటులో ఉన్న సాంకేతిక విజ్ఞానాన్ని - యంత్ర పరికరాలను సుఖజీవనానికై ఉపయోగించుకొంటున్న వాడై, టివి - సినిమాల ప్రభావానికి లోనైనవాడై, ఎన్ని ప్రభావాలున్నా కర్మయోగాన్ని వీడనివాడై జీవిస్తున్న తరుణంలో జానపద ప్రదర్శన కళల ఆవశ్యకత అవసరం వికాసం పరిరక్షణ అనే అంశాలపై చర్చ జరుగుతున్నది విశ్లేషణ జరుగుతున్నది టీవీలలో సినిమాలలో కూడా జానపదాంశాలు జనాన్ని రంజింపచేస్తుండడంతో ఈ చర్చ మరీ అవసరమైంది

విశ్వవిద్యాలయాలు పరిశోధకులను ప్రోత్సహిస్తున్న మంచికాలమిది తమ తమ ఉద్యోగాలలో అభివృద్ధికి ఒకరు పరిశోధన చేస్తుంటే, ఒక అర్హత పెంచుకొని ఉద్యోగమేదో దొరుకుతుందనీ ఆశించరు, కాని లోన ఓ తపన ఉంటుంది ఈ అంశాన్ని వెలికితీసి లోకం ముందుంచాలనే ఆకాంక్ష ఉంటుంది ఆ ఆకాంక్షతో తన వ్యక్తిగతమైన అభిరుచిని పరిశోధన అనే తపస్సులో లయింపజేసి ఫలితాన్ని సాధించి పదిమంది ముందుంచి ఇది నాదికాదు (ఇదం న మమ) మీదే - మనదే అంటారు ఇది పూర్తిగా ఫలాపేక్షలేని పని దీనినే గీతాచార్యులు నిష్కామకర్మ అంటారు

అటువంటి ఫలాపేక్షరహితమైన కర్మే చేశారు డా॥ వి గోవిందరెడ్డిగారు చిత్తూరుజిల్లా వీధినాటకాల గురించి ఓ వందమంది, ఓ వేయిమంది, తార్కికంగా ఆలోచించేట్టు చేశారు కోట్లాది మంది ఇప్పటికీ చూడడం వెనుక ఉన్న అంతరార్థాల్ని గ్రహించేట్లు చేశారు

అక్కడెక్కడో ధర్మరాజుల గుడి ఉంది, ఆ గుడి ముందర, ఆ పరిసరాల్లో ప్రతి సంవత్సరం వీధినాటకాలు ఆడతారు, ప్రత్యేకంగా మహాభారత వీధినాటకాలే ఆడతారు ధర్మరాజుల

వారికి గుడికట్టమేమిటి? అని ఎవరూ ప్రశ్నించు మహాబలిపురంలో పాండవుల గుళ్లు న్నాయి నిజామాబాదుజిల్లాలోని ఓ గ్రామంలో ఓ టకి గుడికట్టారు ఈ మధ్యనే పత్రికల్లో చూశాం ఓ గ్రామవాసులు పక్షికి గుడికట్టారు వేదవ్యాసులకూ, బుద్ధునికీ, ఆదిశంకరులకు, రామానుజులకు, రాఘవేంద్రులకు, రామకృష్ణ పరమహంసకు, వివేకానందునికే గుడికట్టిన జాతి ఇది ఆగుళ్ల ముందు వర్ధంతులు - జయంతులు, రథోత్సవాలు, బ్రహ్మోత్సవాలు

శక్తి - శివ - రామ - కృష్ణ మందిరాల ముందే ఉత్సవాలనుకొంటే చారిత్రక ప్రసిద్ధ పురుషుల గుళ్లముందుకూడా ఉత్సవాలు - గుళ్లముందేకాకుండా, ఆ గ్రామంలో, ఆ పరిసర గ్రామాల్లో, చివరికి ఆ ప్రాంతమంతటా ఉత్సవాలే ఈ ఉత్సవాల్లో సభలూ, ప్రదర్శనలు ఆ ప్రదర్శనల్లో భిన్న ప్రక్రియలు ఆ ప్రక్రియల్లో ప్రధానమైనవి జానపదులవే ఆహార్యాదుల వేషంలేదు, రిహార్సల్సూ లేవు, అతి సాధారణంగా ప్రదర్శన రోకలే గద, తాటి ఆకే కిరీటం, వరివెంటే (మెంటే) వడ్డాణం ఇలా ఇలా! ఆ తర్వాత కిరీటాలు, భుజకీర్తులు, అంగరఖాలు, పాకోళ్లు సమకూర్చుకోవడం, అంగరంగ వైభవాలతో ప్రదర్శనలివ్వడం ప్రారంభమైంది వీధినాటకం ఇంత మనోరంజకమా! అన్న స్థితికి ఎదిగింది

నటులది ద్వార సముద్రం కావచ్చుగాక, విటులది ఓరుగల్లు కావచ్చుగాక! కలిది వినుకొండ కావచ్చుగాక! కాని అది అందరు మెచ్చే వీధి అయ్యింది, జనతా జనార్ధనుడు మెచ్చే క్రీడాభిరామమైంది, మనోభిరామమైంది, ప్రేమాభిరామమైంది

చిత్తూరుజిల్లా కంగుంది వీధినాటకాల స్థితి కూడా ఇదే కౌరవ పాండవులందరు భారతులే ఈ దేశం జనులందరు భారతులే అందువల్ల ఇందులోని ఇతివృత్తమేదైనా అది భారతులదే (భారతీయులదే) భరతులదే (భావరాగతాళాలు తెలిసినవారిదే) అయ్యింది ఆ భరతులను సాకల్యంగా చూడడం వల్లనే భరతముని నాట్యశాస్త్రాన్ని సాకల్యంగా చూడడం వల్లనే భరతముని నాట్యశాస్త్రాన్ని రచించాడు కాని ఆ ముద్రలనూ, ఆ గతులనూ, ఆ జతులనూ కొన్నిటిని గ్రహించి, కొన్నిటిని వదలివేసి, ఎన్నో కొత్తవి చేర్చుకొని దేశం నిండా వీధినాటకం విస్తరించింది భరతముని మార్గంతో దీనికి సంబంధం లేనంతగా స్థిరపడింది

ఈ విస్తరణకు ఆధారం అది తమది అని జనం అనుకోవడం ఏది తమది అని జనం అనుకొంటారో దానిని విస్తరింపజేస్తారు అలా విస్తరించిన దానిని వివరిస్తాడు సమీక్షకుడు అందులోని మంచి చెడులను చెబుతాడు విమర్శకుడు సమగ్రపరిశీలన చేస్తాడు పరిశోధ కుడు సమగ్ర పరిశీలన పరిధి పెరిగినప్పుడు, పరిమితి విధించుకొని ఒక పరిశీలన మాత్రమే చేసే అవకాశముంది ఆవిధంగా ఆ ఒక పరిశీలనతో వచ్చిందే ఈ పరిశోధన గ్రంథం

అందువల్లనే మొదటి అధ్యాయంలో జిల్లాకు సంబంధించిన అంశాలు పరిచయాత్మకంగా ఇచ్చారు చివరలో వీధికి సంబంధించి వివరించారు రెండో అధ్యాయంలో వీధినాటకాల్లో

గ్రహించే వస్తువును విశ్లేషించారు మూడో అధ్యాయంలో వీధికి ఉపకరించే ఆహార్యాది సామగ్రిని పరిచయం చేశారు నాలుగో అధ్యాయంలో ప్రదర్శన ప్రక్రియ విశేషాలు ప్రస్తావించారు నాలుగో అధ్యాయం చివరలో "కీచకవధ" పూర్తిగా నాటకపారం (Text) ఇచ్చారు ఐదో అధ్యాయంలో చకంగుంది నాటక ప్రత్యేకశైలిని వివరించారు అంతేగాక వివిధ వీధి భారత నాటకాలను ప్రస్తావించారు అనుబంధంలో వీధినాటకాలను ప్రదర్శిస్తున్న గ్రామాల పేర్లు ఇచ్చారు

ఇదే శోధన – సాధన ఎంత త్రవ్వితే అంత ఏ వాదం స్పృశించకుండా సీదా సాదాగా చేసిన నిసర్గమైన పరిశోధన నాలుగో అధ్యాయంలోని కీచకవధ పారం ఆధారంగా వందల విషయాలు భావి పరిశోధకులు చర్చించే అవకాశముంది అయితే ప్రదర్శనలో సందర్భాన్ని (Contaxt) బట్టి వచ్చే పరిణామాలు పరిశీలించాలనుకొంటే ప్రత్యేకాధ్యయనం తప్పదు ఎందుకంటే టెక్స్ట్ ప్రదర్శనలో ఇదే విధంగా ఉండదు అప్పుడు అధ్యయన పద్ధతే మారుతుంది ప్రదర్శనలో అనేక సమకాలీన సాంఘికాంశాలు ప్రవేశిస్తాయి ఆ కథంతా తమదే అని జనం అనుకొనేట్టు చేస్తాయి రామాయణ భారత, భాగవతేతి వృత్తాలు ప్రజల్లో కలిసిపోవడానికి ఇదే కారణం

ఇది నాది, ఇందులో నేను (I) ఉన్నాను నేను దీనితో తాదాత్మ్యం పొందుతున్నాను అని ఏ సామాజికుడు, ఏ కళాకారుడు భావిస్తాడో ఆ కళ నిత్య చైతన్యశీలమై వికసిస్తుంది ఆధునిక సాంకేతిక విజ్ఞానానికి అనుగుణంగా పరివర్తన చెందుతూ సజీవంగా నిలిచి ఉంటుంది ఈసజీవ చైతన్యాన్ని దర్శించిన డా॥ వి గోవిందరెడ్డిగారు, మిత్రులు డా॥ చిగిచెర్ల కృష్ణారెడ్డిగారి పర్యవేక్షణలో ఈ ఉత్తమ పరిశోధన గ్రంథాన్ని అందించారు పదిమంది భావి జానపద పరిశోధకులకు పాథేయంగా నిలిచే గ్రంథాన్ని అందించినందుకు పరిశోధకులను ప్రశంసిస్తున్నాను భవిష్యత్తులో వారింకా ఈ మార్గంలో ఉత్తమ గ్రంథాలను అందిస్తారని ఆశిస్తున్నాను

డా॥ కసిరెడ్డి వెంకటరెడ్డి

# పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం



## జానపద కళల శాఖ

పబ్లిక్ గార్డెన్స్, హైదరాబాద్ - 500 004

**డా॥ చిగిచర్ల కృష్ణారెడ్డి**
శాఖాధిపతి

తేది 28-12-2001

# అభినందన

చిత్తూరు జిల్లా కంగుంది కుప్పం వీధినాటకానికి ఒక ప్రత్యేకత ఉంది మహాభారతం లోని పద్దెనిమిది పర్వాలను పద్దెనిమిది నాటకాలుగా మలుచుకొని పూర్తి కథను ప్రదర్శించడం, వీళ్ల ప్రత్యేకత ఇలాంటి సంప్రదాయం బహుశా భారతదేశంలో ఇంకెక్కడా లేదు శ్రీకృష్ణజననంతో కలిపి పంతొమ్మిది నాటకాలను వీరు భారతంగా పరిగణిస్తారు ఈ నాటకానికి 'ఆట' అనే పర్యాయపదం ఇక్కడ స్థిరపడింది సంప్రదాయనాటకాలు కేవలం పద్య గద్యాలతో చంపువు రూపంలో సాగడం చాలామందికి తెలుసు కంగుంది కుప్పం వీధినాట కాల్లో పద్యగద్యాలతోపాటు ప్రత్యేకశైలిలో సాగే జానపదబాణీలు ఈనాటకాలను పరిపుష్టం చేశాయి వివిధ రంగాలు, విభిన్న దరువులు, విశిష్టనృత్యాలు విశేషంగా ప్రేక్షకుల్ని ఆకట్టు కుంటాయి అలా మనోరంజకంగా సాగిపోయే ఈ నాటకాల నిడివి 8 గంటల నుండి 10 గంటల వరకు వున్నా ఎక్కడా ప్రేక్షకున్ని విసిగించవు భారతీయ సంస్కృతీ సంప్రదాయాలను జానపద గుండెతో గానంచేసే విశిష్టలక్షణం కంగుంది కుప్పం వీధినాటకాలకుంది

ఈ వీధినాటకం విలక్షణమైన కళ దీనిపై ఇంతవరకు ప్రత్యేకమైన పరిశోధన జరగకపోవడం పెద్దలోటు ఆలోటును ప్రథమంగా శ్రీకారంచుట్టిన డా॥ వి గోవిందరెడ్డి చిరస్మరణీయుడిగా జానపద విజ్ఞాన పరిశోధనారంగంలో నిలబడతారు సంప్రదాయ నాటకాలపై విస్తృతంగా పరిశోధనలు జరిగాయి సంప్రదాయ పద్యనాటకాలలోని పాఠ్యం అచ్చురూపంలో ముందుగానే ముద్రింపబడుతోంది రాగాలు మార్చినా భాష, భావాలలో పెద్దగా మార్పు కనిపించదు కానీ జానపద నాటకాలలో మౌఖిక ప్రచారం పాత్ర ఎక్కువ అందువల్ల పాఠ్యం విషయంలో మార్పులు చేర్పులు సహజంగా జరిగిపోతుంటాయి ఒకరు పాడిన విధంగా మరొకరు పాడలేరు అలాంటప్పుడు పాఠ్య నిర్ణయం విశ్లేషణలు నిర్దిష్టంగా

చేయడం కష్టం ఏర్చికూర్చి పరిశోధనకు దారులు వేసుకున్నారు డా॥ వి గోవిందరెడ్డిగారు అంతేకాగ వీరు చిత్తూరుజిల్లావారు కావడంవల్ల అక్కడి జీవన మూలాల్ని జీర్ణించుకోవడం వల్ల తన పరిశోధనకు పరిపుష్టిని చేకూర్చగలిగారు ఎంతో శ్రమకోర్చి వివిధ కళాకారుల ద్వారా స్వయంగా విషయాన్ని సేకరించి సులభసుందరశైలిలో క్రోడీకరించారు వివిధ పార్శ్వాలలోగల విషయాన్ని సమన్వయసహితంగా తెలుగు సంస్కృతిలోనే ప్రత్యేకతను కలిగిన కళపై మొట్టమొదటిగా పరిశోధన చేసి భావి పరిశోధకులకు మార్గాలు చూపారు ఈ కోవలో ఇంకా జరగాల్సిన కృషిని ఆయన యీ గ్రంథంలో చక్కగా వివరించారు

డా॥ గోవిందరెడ్డిగారు స్వతహాగా బాధ్యత గల సామాజిక సేవాతత్పరుడు ఉపాధ్యాయ వృత్తినుండి ప్రత్యక్ష సమాజసేవా నైజంగల నెహ్రూయువకేంద్రంలోకి తన వృత్తిని మార్చు కున్నారు సామాజిక సేవనే వృత్తిగా స్వీకరించి క్షణం తీరికదొరకని ఉద్యోగం చేసుకుంటూ కూడా తన పరిశోధనను నిర్ణీత కాలంలో నా పర్యవేక్షణలోనే పూర్తిచేసి కార్యదక్షతను ప్రకటించుకున్నారు పరిశోధనా మూల్యాలను కాపాడుతూనే కంగుందికుప్పం నాటకాలను చరిత్రకెక్కించే ప్రయత్నం చేసిన డా॥ వి గోవిందరెడ్డిగారిని హృదయపూర్వకంగా అభినంది స్తున్నాను ఆయనకు ఆ భక్తవత్సలుడు తిరుపతి శ్రీవేంకటేశ్వరుడు ఆయురారోగ్యఐశ్వర్యాలను ప్రసాదించాలని కోరుకుంటున్నాను

(signature)
28/12/20..

# కృతజ్ఞతలు

చిత్తూరుజిల్లా కుప్పం మండలం కొత్త ఇండ్లు గ్రామంలో వీధినాటకాలకు సంబంధించి జానపద కళాసదస్సును ఏర్పాటుచేసి, నా పరిశోధనా విషయంగా ప్రోత్సహించిన పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వైస్ చాన్సలర్ డా॥ నాయని కృష్ణకుమారిగారికి నా కృతజ్ఞతలు

ఈగ్రంథానికి అడిగిన వెంటనే తన అభిప్రాయాన్ని 'మూలాన్వేషణ'ద్వారా తెలిపిన గురు తుల్యులు, పూజ్యులు, జ్ఞానపీఠ అవార్డు గ్రహీత డా॥ సి నారాయణరెడ్డిగారికి, ఎన్నో పనుల ఒత్తిడిలో తలమునకలైయున్నను 'ఆకాంక్ష' వ్రాసి ఇచ్చిన ఆంధ్రప్రదేశ్ సాంస్కృతిక శాఖ సంచాలకులు శ్రీమతి జి రేఖారాణిగారికి, తన 'అభిలాష' ద్వారా పాఠకలోకానికి ఈ గ్రంథాన్ని పరిచయంచేసిన మిత్రులు, సహృదయులు, కుప్పం ద్రావిడ విశ్వవిద్యాలయం రిజిస్ట్రారు – ఆచార్య బి రామక్రిష్ణారెడ్డిగారికి, తన 'పరిశోధనపాథేయం' ద్వారా గ్రంథ ప్రాశస్త్యాన్నిగురించి వివరించిన హైదరాబాదు మహిళా విశ్వవిద్యాలయం తెలుగు శాఖాధిపతి ఆచార్య కసిరెడ్డి వెంకటరెడ్డిగారికి, ఇక చిత్తూరుజిల్లా వీధినాటకాలు – ఒక పరిశీలన అనే పి హెచ్ డి పరిశోధనాంశాన్ని సూచించి, ప్రోత్సహించి, పరిశోధనాంశాన్ని సామూలంగా పర్యవేక్షించి, ఎప్పటికప్పుడు నాసందేహాలకు అమూల్యమైన సలహాలనిచ్చి, దానికి రూపకల్పన చేయడంతోపాటు తన 'అభినందనలు' తెలియజేసిన పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం జానపద కళలశాఖాధిపతి డా॥ చిగిచర్ల కృష్ణారెడ్డిగారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు

సాహిత్య పీఠం ద్వారా పరిశోధన చేయడానికి నాకు అవకాశం కల్పించిన నాటి పీఠాధిపతి (రాజమండ్రి ప్రాంగణం) ఆచార్య కడప రమణయ్యగారికి నా కృతజ్ఞతలు

పరిశోధనా రచనలో, విషయ సేకరణలో ఎప్పుడూ అందుబాటులో ఉంటూ కొండంత అండగా నిలిచి నన్ను ప్రోత్సహించిన మిత్రులు, సహృదయులు చిత్తూరు పి వి కె ఎన్ ప్రభుత్వ కళాశాల తెలుగు లెక్చరర్ డా॥ వల్లేరు హరినాయుడుగారికి, తమిళ భాష వీధినాటకాలకు సంబంధించిన సందేహాలను తీర్చి సహకరించిన మిత్రులు నగరి ప్రభుత్వ డిగ్రీ కళాశాల తమిళ భాషోపన్యాసకులు శ్రీ ఎల్ ఆర్ పొన్ను స్వామిగారికి నా కృతజ్ఞతలు

నా పరిశోధనకు కావలసిన వ్యాస సేకరణలోను, సంగీత నృత్య విషయ సేకరణకు, తత్సంబంధిత సందేహాలను తీర్చడంలోనూ సహాయ సహకారాలను అందజేసి, ప్రోత్సహిం చిన ఎస్ ఉషారాణికి నా కృతజ్ఞతలు

సహృదయ మిత్రుడు, స్నేహశీలి, ఓర్పుకు ప్రతిరూపంగా నిలిచే శ్రీ బొబ్బా వెంకట

ప్రసాదరావుగారు పరిశోధనకు అన్ని విధాల సహకారాలను అందించి, విషయ సేకరణకు నాతోబాటు శ్రమించారు వారికి హృదయ పూర్వక కృతజ్ఞతలు

నేను సంకల్పించిన ప్రతి కార్యక్రమానికి పూర్తి సహాయ సహకారాలను అందిస్తూ, నా అభివృద్ధికి అహర్నిశలు శ్రమించి, నా పరిశోధనకు ప్రోత్సహించిన నా అర్ధాంగి సావిత్రికి, జిల్లాలో వివిధ ప్రాంతాలను పర్యటించి విషయాన్ని సేకరించడానికి నాతోబాటు వచ్చి సహకరించిన నా కుమారుడు హేమగిరిరెడ్డి – కోడలు నిరూపకు, రెండవ కుమారుడు దిలీప్ కుమార్‌కు, సేకరించిన విషయాన్ని సిద్ధాంత వ్యాసంగా రూపుదాల్చడానికి సహకరించిన నా కుమార్తె శైలజ కుమారి – అల్లుడు శ్రీ డి రవీంద్రనాథరెడ్డికి, మనుమడు చి॥ డి అనీల్‌కుమార్‌రెడ్డికి, మనుమరాలు చి॥ వి సాయి ప్రసన్నకు నా ఆశీస్సులు

క్షేత్ర పర్యటనలో పూర్తి సహకారాన్ని అందించిన ప్రజాశక్తి కుప్పం విలేకరి, మిత్రులు శ్రీ ఎన్ కె సత్యనారాయణ, ఆంధ్రప్రభ కుప్పం విలేకరి శ్రీ ఖాదర్ భాషా, కొత్త ఇండ్లు వాస్తవ్యులు యువనాయకుడు మిత్రుడు శ్రీ ఎస్ సోమమూర్తి, శ్రీ ఎ ఎస్ నాయుడు, శ్రీ సి నాగరత్నంగార్లకు నల్లంగాడు వాస్తవ్యురాలు శ్రీమతి రేవతికి కృతజ్ఞతలు

వీధినాటక ప్రతులను సమకూర్చుటలో, వీధి నాటక ప్రదర్శనల నేర్పాటు చేయుటలో సహకరించిన వీధి నాటక గురువు మొరుంపల్లె గ్రామవాస్తవ్యులు శ్రీ కె కృష్ణమూర్తి, కంగా నెల్లూరు వీధినాటక కళాకారుడు శ్రీ చంద్రయ్య గార్లకు కృతజ్ఞతలు

కంగుంది దుర్గ పర్యటనలో నాకు సహకరించిన కంగుంది గ్రామ సర్పంచ్ శ్రీ శ్యామన్న గారికి, చిత్తూరు వాస్తవ్యులు శ్రీ జె భాస్కరరెడ్డిగారికి, శ్రీ టి కాళప్పరెడ్డిగారికి, కంగుంది సంస్థాన వివరాలిచ్చిన శ్రీ కె జె బాలాజి, శ్రీ యం వెంకటపతి నాయుడు, శ్రీ యం సాయి బాబా మూర్తి, శ్రీ యన్ యన్ వి త్రినాధ్, శ్రీమతి యం శకుంతలా దేవిగార్లకు నా కృతజ్ఞతలు

ఎప్పుడూ నాతోనే ఉంటూ జిల్లా అంతా తిరిగి కావలసిన ఫోటోలను అందంగా తీసి సకాలంలో అందించిన శ్రీ ధనలక్ష్మి స్టూడియో అధినేత శ్రీ ధనంజయరెడ్డికి, పరిశోధనా వ్యాసాన్ని ఆకర్షణీయంగా బైండింగ్ చేసి ఇచ్చిన వెట్రివేల్ ఆఫ్‌సెట్ ప్రింటింగ్ ప్రెస్ అధినేత మిత్రులు శ్రీ పి పట్టాభిరెడ్డిగారికి కృతజ్ఞతా పూర్వక అభినందనలు

గ్రంథం రూపందాల్చడానికి నాకు శాఖా పరమైన అనుమతిని ఇచ్చి ప్రోత్సహించిన నెహ్రూ యువకేంద్ర సంఘటన్ ఆంధ్రప్రదేశ్ రీజియన్ రీజనల్ కో ఆర్డినేటర్ మిత్రులు శ్రీ ఎస్ బాల్విన్‌రాజు, సౌత్ జోన్ డైరెక్టర్ శ్రీ ఎం బాలసుబ్రమణ్యం, నెహ్రూయువకేంద్ర సంఘటన్, న్యూఢిల్లీ డైరెక్టర్ జనరల్‌గార్లకు కృతజ్ఞతలు ఇంకా ఈ గ్రంథ ముద్రణకు క్షేత్రపర్యటనలో విషయ సేకరణలో యువజన సంఘాలు, గ్రామప్రజలు, వీధినాటక

కళాకారులు, మరెందరో మహానుభావులు వారి వారి సహాయ సహకారాల్ని అందించారు వారందరికీ పేరుపేరునా హృదయపూర్వక కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను

ఈ గ్రంథముద్రణకు ఆర్థికసహాయాన్ని అందించిన తిరుమల తిరుపతి దేవస్థానం యాజమాన్యానికి, హైదరాబాద్ పొట్టి శ్రీరాములు తెలుగువిశ్వవిద్యాలయంవారికి నా కృతజ్ఞతలు

ఈ గ్రంథ ముఖచిత్రాన్ని ఆకర్షణీయంగా, సందర్భోచితంగా చిత్రించి సకాలంలో అందించిన శ్రీ గంగాధర్, శ్రీ క్రాంతినాద్‌లకు నా కృతజ్ఞతలు ప్రత్యేక శ్రద్ధవహించి, ఈ గ్రంథంలోని పేజీలను సర్వాంగ సుందరంగా అలంకరించిన మహతిక్రియేషన్స్, హైదరాబాద్ అధినేత్రి శ్రీమతి సంధ్యారాంమూర్తి గారికి, ముద్రించి ఇచ్చిన ఆకృతి ఆఫ్‌సెట్ ప్రింటర్స్‌కు నా కృతజ్ఞతలు

అసలు ఈ గ్రంథం ఇలా మీముందు అక్షరూపం దాల్చడానికి ముఖ్యకారకులు చిత్తూరు జిల్లా వీధినాటక కళాకారులు ప్రత్యక్షంగా, పరోక్షంగా నాకు తోడ్పడిన కళాకారులకు, కళాభిమానులకు, కళాపోషకులకు అందరికీ నమస్సుమాంజలులు

**- డాక్టర్ వి. గోవిందరెడ్డి**

రచయిత



రాష్ట్ర గవర్నర్ శ్రీ సి రంగరాజన్ నుండి డాక్టరేట్ పట్టా అందుకుంటున్న రచయిత డాక్టర్ వి గోవిందరెడ్డి

# విషయసూచిక

ఒకటో అధ్యాయం

వీధినాటకాలు - పుట్టుపూర్వోత్తరాలు

| | |
|---|---|
| 3 6 | భూషణాలు |
| 3 6 1 | కిరీటం |
| 3 6 1 1 | మానికిరీటం |
| 3 6 1 2 | నాగకిరీటం |
| 3 6 1 3 | అరకిరీటం |
| 3 6 1 4 | సాధారణ కిరీటం |
| 3 6 1 5 | ముకుటం |
| 3 6 1 6 | తురాయి కిరీటం |
| 3 7 | గిరదాటోపను |
| 3 8 | నొష్టపట్టం |
| 3 9 | ముత్యాలహారం |
| 3 10 | కర్ణభూషణాలు |
| 3 11 | పతకం |
| 3 12 | భుజకీర్తులు |
| 3 13 | కంకణం / మణిబంధాలు |
| 3 14 | ఉంగరాలు |
| 3 15 | చంద్రహారం |
| 3 16 | పాట్లాపులు |
| 3 17 | ముక్కెర / ముక్కుపుల్లలు |
| 3 18 | రెట్టపట్టీలు / రెట్టవంకీలు |
| 3 19 | జడపట్టీ |
| 3 20 | కిర్రుమెట్లు / కిరుకుమెట్లు |
| 3 21 | వడ్డాణం |
| 3 22 | ఆయుధాలు |
| 3 23 | వస్త్రాలు |
| 3 23 1 | కాలిచెడ్డి (ప్యాంట్) |
| 3 23 2 | పావడ |
| 3 23 3 | అంగవస్త్రం |
| 3 23 4 | అంచుగుడ్డ |
| 2 23 5 | కుచ్చుట గొంగడి |
| 3 23 6 | కీపాను |
| 3 23 7 | శుర్వాల్ |

**అయిదో అధ్యాయం**

**వీధినాటకాలు - కంగుంది ప్రత్యేకశైలి**

# ఒకటో అధ్యాయం

# వీధినాటకాలు - పుట్టుపూర్వోత్తరాలు

## 1.1 ప్రవేశిక

చిత్తూరు జిల్లాలో వీధినాటకాలకు ఒక విశిష్ట స్థానం ఉంది జిల్లాలో వివిధ ప్రాంతాల్లో వీధినాటకాలు ఎక్కువగా ప్రదర్శింపబడుతున్నాయి జిల్లాలో తూర్పు ప్రాంతాల్లో ఒక రకమైన వీధినాటకాలు ప్రదర్శిస్తే పశ్చిమ ప్రాంతాల్లో మరొక రకమైన వీధినాటకాలు ప్రదర్శింపబడు తున్నాయి పశ్చిమ ప్రాంతాల్లో ప్రదర్శించే నాటకాలను ఎక్కువగా 'కంగుంది నాటకాలు' అని పిలవడం పరిపాటి, తూర్పు ప్రాంత నాటకాలను ఈవిధంగా ప్రత్యేకమైన పేరుతో పిలవక 'వీధినాటకాలు' అనే పిలుస్తున్నారు ఈకంగుంది నాటకాలు కూడ వీధి నాటకాలే కాబట్టి వీటి పుట్టుపూర్వోత్తరాలను తెలుసుకోవడం అవసరం

వీధి నాటకాలకు ఎంతో చరిత్ర ఉంది ఆదిమానవుని మాట, పాట, ఆటల సముదాయమే తరువాతి కాలంలో నాటకంగా పరిణతి చెంది జానపదుల కళగా రూపుదిద్దు కొంది వీధినాటకం అనగానే మనకు 'వీధి'లో ప్రదర్శించే నాటకమని వెంటనే స్ఫురిస్తుంది ఈ వీధినాటకాల ఆవిర్భావ వికాసాలను గురించి పరిశోధించ వలసిన అవసరం ఎంతైనా ఉంది ఎందుకంటె మన సంస్కృతీ సాంప్రదాయాలను ఎప్పటికప్పుడు ప్రతిబింబింప చేసేవి, సమాజాన్ని ఆకట్టుకొని సామాజిక స్పృహను, చైతన్యాన్ని తెచ్చేవి, నైతిక విలువలను పోషించేవి జానపద కళలు ఈ జానపద కళారూపాల్లో 'వీధినాటకాలు' ఉత్కృష్ట స్థానాన్ని కలిగి ఉన్నాయి వీటిని గురించి ఈ పరిశోధనా గ్రంథంలో ఐదు అధ్యాయాల్లో వివరించడం జరిగింది.

## 1.2. చిత్తూరు జిల్లా నైసర్గిక స్వరూపం

చిత్తూరు పట్టణం కేంద్రంగా చిత్తూరు జిల్లా 1 4 1911లో ఏర్పడింది అప్పటి మద్రాసు రాష్ట్రంలోని (ప్రస్తుత తమిళనాడు) చిత్తూరు, పలమనేరు మరియు చంద్రగిరి తాలూకాలను, ఉత్తర ఆర్కాడు జిల్లానుండి, కడపజిల్లా నుండి మదనపల్లె మరియు వాయల్పాడు తాలూకాలను కలిపి ఏర్పాటు చేయడం జరిగింది తరువాత మాజీ జమీందార్ల పాలనలోని పుంగనూరు, శ్రీకాళహస్తి, పుత్తూరు మరియు పూర్వపు కార్వేటినగర ఎస్టేటును 1 12 1926లో

చేర్చడం జరిగింది మరియు 22 గ్రామాల మినహాతో ఉత్తర ఆర్కాడు జిల్లాలోని కంగుంది తాలూకాను పలమనేరు తాలూకాలో చేర్చబడింది అటుపిమ్మట 1950 సంవత్సరంలో మైసూరు రాష్ట్రంలోని 8 గ్రామాలను ప్రావిన్స్ అండ్ స్టేట్సు ఉత్తర్వుతో పలమనేరు తాలూకాకు బదిలీ చేయడం జరిగింది 1 4 1960 సంవత్సరంలో పటాస్కార్ అవార్డు ఫలితంగా జిల్లాలో పెద్దమార్పు జరిగింది 'భాషా ప్రయుక్త రాష్ట్ర విభజన ఫలితంగా గణనీయమైన విస్తీర్ణం తిరుత్తణి తాలూకానుండి విడదీసి తమిళనాడులోని చెంగల్‌పట్టు జిల్లాలో చేర్చడం జరిగింది తిరువళ్ళూరు తాలూకాలోని 76 గ్రామాలు, పొన్నేరు తాలూకాలోని 72 గ్రామాలు, తమిళనాడులోని చెంగల్‌పట్టు జిల్లానుండి, పుత్తూరు తాలూకాలోని 17 గ్రామాలు, తిరుత్తణి తాలూకాలోని 19 గ్రామాలు చేర్చి సత్యవేడు తాలూకా పేరుతో చిత్తూరు జిల్లాలో కలపడం జరిగింది పలమనేరు తాలూకాలోని 220 గ్రామాలు, తమిళనాడులోని క్రిష్ణగిరి జిల్లానుండి 3 గ్రామాలు చేర్చి కుప్పం సబ్ తాలూకాగాను, చిత్తూరు తాలూకానుండి 145 గ్రామాలు విడదీసి బంగారు పాళెం – సబ్ తాలూకాగాను ఏర్పాటు చేయడం జరిగింది తరువాత కుప్పం మరియు బంగారు పాళెంలను తాలూకాలుగా ఏర్పరచారు [1]

పైన తెలిపిన 11 తాలూకాలను 15 తాలూకాలుగాను, వాటిని 20 పంచాయితీ సమితులుగాను ఏర్పాటు చేయడం జరిగింది ప్రభుత్వ ఉత్తర్వు యం ఎస్ నం 569 రెవిన్యూ (మండల్–2) తేది 22 5 1985 ప్రకారం 15 తాలూకాలను 66 రెవిన్యూ మండలాలుగా విభజించడం జరిగింది అదే విధంగా 65 మండల ప్రజాపరిషత్తులు ఏర్పడ్డాయి

## 1.2.1. ఎల్లలు

చిత్తూరు జిల్లాకు ఎల్లలుగా ఉత్తర దిశన అనంతపురం మరియు కడప జిల్లాలున్నాయి తూర్పు దిశన నెల్లూరు మరియు తమిళనాడులోని చెంగల్‌పట్టు జిల్లాలున్నాయి దక్షిణ దిశన తమిళనాడులోని ఉత్తర ఆర్కాడు జిల్లా ఉంది పశ్చిమ దిశన తమిళనాడు మరియు కర్ణాటక రాష్ట్రాలున్నాయి 'ఈ జిల్లా యొక్క విస్తీర్ణము 15,152 చ కి మీ ఈ జిల్లా $12^0$ 37 నుండి $14^0$ 8 ఉత్తర అక్షాంశము $78^0$ 33 నుండి $9^0$ 55 తూర్పురేఖాంశముల మధ్య ఉంది [2]

## 1.2.2. పరిపాలనా విధానము

జిల్లాను 3 రెవిన్యూ డివిజన్లుగా విభజించారు అవి

1 చిత్తూరు 2 తిరుపతి 3 మదనపల్లె

1 గణాంక దర్శిని – 1992 –93 చిత్తూరు జిల్లా (సంకలనము మరియు ప్రచురణ, ముఖ్య ప్రణాళికాధికారి చిత్తూరు)

2 గణాంక దర్శిని – 1992 –93 చిత్తూరు జిల్లా (సంకలనము మరియు ప్రచురణ, ముఖ్య ప్రణాళికాధికారి చిత్తూరు)

చిత్తూరు డివిజను 20 మండలాలుగాను, తిరుపతి డివిజను 15 మండలాలుగాను మరియు మదనపల్లె డివిజను 31 మండలాలుగాను 22 5 1985 నుండి ఏర్పాటు చేయబడి పరిపాలన సాగింపబడుతున్నది జిల్లాలో తిరుపతి, చిత్తూరు, శ్రీకాళహస్తి, పుంగనూరు, మదనపల్లె పట్టణాలు పురపాలక సంఘాల అధీనంలో ఉన్నాయి

## 1.2 3. దర్శనీయ స్థలాలు

1 తిరుమల
2 తిరుపతి
3 తిరుచానూరు
4 చంద్రగిరి
5 శ్రీకాళహస్తి
6 నాగలాపురం
7 కైలాస కోన
8 తలకోన
9 కాణిపాకం
10 ఆరోగ్యవరం
11 హార్సిలీ హిల్స్

### 1.2 3 1. తిరుమల

ఏడుకొండలపైనున్న తిరుమల క్షేత్రమందు ప్రపంచఖ్యాతి గాంచిన శ్రీ వెంకటేశ్వర స్వామి వారు వెలసియున్నారు ఇది అతిపెద్ద హిందూ పుణ్యక్షేత్రం వేలాది భక్తులు ప్రతిరోజూ స్వామివారి దర్శనార్థం ఈ క్షేత్రమునకు దేశ విదేశాలనుండి విచ్చేయు చుందురు తిరుమల తిరుపతి దేవస్థానం భారత దేశంలో కెల్ల ఎక్కువ ఆదాయం కల్గిన దేవస్థానం పాపవినాశం, ఆకాశగంగ, గోగర్భం, పాండవతీర్థం తిరుమలకు అతి సమీపంలోనున్న చూడవలసిన పుణ్యస్థలాలు

### 1.2 3 2. తిరుపతి

భారత దేశంలో ప్రసిద్ధిగాంచిన పుణ్యక్షేత్రం ఈ పట్టణమందు అనేకమైన ప్రసిద్ధి గాంచిన దేవాలయాలు గలవు అందులో శ్రీ గోవిందరాజస్వామివారి దేవాలయం, శ్రీ కోదండ రామస్వామివారి దేవాలయం, మరియు కపిలేశ్వరస్వామి వారి దేవాలయాలు చూడదగి నవి ప్రపంచ ప్రసిద్ధిగాంచిన తిరుమల పుణ్యక్షేత్రానికి ఈ పట్టణం ముఖ్యద్వారంగా ఉంది

తిరుపతి పుణ్యస్థలమే కాక ముఖ్య విద్యా కేంద్రంగా ఉంది ఇచ్చట శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, దేశములోని మొట్టమొదటి మహిళా విశ్వవిద్యాలయమైన శ్రీ పద్మావతి

మహిళా విశ్వవిద్యాలయం 1984లో స్థాపించబడింది ఇచ్చట వైద్య, ఇంజనీరింగ్, వ్యవసాయ, పశుసంవర్ధక, పాలిటెక్నిక్, ఆయుర్వేదం మొదలగు సాంకేతిక వృత్తి విద్యా కళాశాలలున్నాయి అల్లే సంగీత నాటక కళాశాల, కేంద్రప్రభుత్వ సంస్కృత కళాశాలకూడా ఇచ్చటనే ఉన్నాయి డిగ్రీ మరియు జూనియర్ కళాశాలలూ గలవు వికలాంగుల పాఠశాల మరియు గ్రుడ్డి, మూగ, చెవిటి వారికి ఒక పాఠశాలను తిరుమల తిరుపతి దేవస్థానంవారు నిర్వహిస్తున్నారు

### 1.2 3 3. తిరుచానూరు

ఇది ప్రసిద్ధి గాంచిన పుణ్యక్షేత్రం ఇచ్చట శ్రీ పద్మావతి అమ్మవారు వెలసియున్నారు తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామివారి సహధర్మచారిణిగా చెప్పబడు శ్రీ పద్మావతి అమ్మవారి దర్శనం కొరకు ప్రతిరోజు వేలాది భక్తులు విచ్చేస్తారు వివాహాది శుభకార్యాలు ఎక్కువగా తిరుచానూరులో జరుగుతాయి అందువల్ల అనేక కళ్యాణమండపాలు నిర్మించబడ్డాయి ప్రతి సంవత్సరం నవంబరులో 'పంచమితీర్థం' అనే ఉత్సవం జరుగుతుంది ఆ రోజు వేలాది మంది భక్తులు అమ్మవారిని దర్శిస్తారు ఈ తిరుచానూరును 'చిత్తానూరు' అని కూడా వ్యవహరిస్తారు

### 1.2 3.4. చంద్రగిరి

చంద్రగిరి కోట చూడవలసిన చారిత్రక స్థలం ఈ కోట 10వ శతాబ్దంలో ఇమ్మడి నరసింహయాదవ రాయలు అనే రాజుచే కట్టబడింది తర్వాత ఇది విజయ నగర పాలనలోకి వెళ్ళింది వారి కాలంలో ఈ కోట అభివృద్ధిపరచబడింది శాలువ రాజుల కాలంలో (1446 -1449) చంద్రగిరి కోట ప్రసిద్ధిచెందింది ఈ కోటలో చూడముచ్చటైన 'రాజ మహల్', 'రాణిమహల్' ఉన్నాయి కొయ్యను ఉపయోగించకనే రాతిని ఉపయోగించి ఈ సౌధాలను నిర్మించడం వీటి ప్రత్యేకత ఈ భవంతుల్లో సున్నంతో నగిషీపని చేయబడింది ఈ కోట ప్రస్తుతం పురావస్తు పరిశోధనాశాఖ వారి ఆధ్వర్యంలో ఉంది

చంద్రగిరి సమీపాన ఉన్న శ్రీనివాసమంగాపురంలో శ్రీ కళ్యాణ వేంకటేశ్వరస్వామి ఆలయం ప్రసిద్ధి చెందింది ఈ దేవాలయం ప్రస్తుతం తిరుమల తిరుపతి దేవస్థానం అధీనంలో ఉంది

### 1.2 3 5 శ్రీకాళహస్తి

క్రీ పూ రెండవ శతాబ్దంలో వ్రాయబడిన గ్రంథాల్లో శ్రీకాళహస్తి దక్షిణ కైలాసంగా పేర్కొనబడింది శ్రీఆదిశంకరులవారు ఈ క్షేత్రాన్ని సందర్శించి అమ్మవారి ఎదుట శ్రీచక్ర ప్రతిష్ఠాపన గావించారు అల్లే కాళే స్ఫటిక లింగాన్ని ఒకదాన్ని నెలకొల్పారు పల్లవ, చోళ, విజయనగర కాలాల శిల్ప కళానైపుణ్యం ఈ క్షేత్రాన వెలసింది క్రీ శ 1516లో శ్రీ కృష్ణ

దేవరాయలు పెద్ద గాలిగోపురాన్ని, నూరు రాళ్ళ మంటపాన్ని నిర్మించారు శ్రీకాళహస్తీశ్వర స్వామి గుడిలో గల శివలింగం స్వయంభువుగా ఉందని చరిత్ర ద్వారా తెలుస్తోంది పంచలింగాల్లో ఇది వాయులింగంగా ప్రసిద్ధికెక్కింది అందుకు నిదర్శనంగా గర్భగుడిలోని దీపం ఆరు బయట దీపం గాలికి కదులుతున్నట్లుగా ఎప్పుడూ కదులుతూ ఉంటుంది

'శ్రీ' అనగా సాలెపురుగు, 'కాళ' అనగా పాము, 'హస్తి' అనగా ఏనుగు ఇవి మూడు శివభక్తిలో లీనమై మోక్షాన్ని పొందడంవల్ల ఈ క్షేత్రం 'శ్రీకాళహస్తి' అని వ్యవహరించ బడుతోంది ఇచ్చట శివునికి తన కన్నులిచ్చిన 'భక్త కన్నప్ప' గుడి ఉంది

## 1.2.3 6 నాగలాపురం

శ్రీకృష్ణ దేవరాయలవారు దక్షిణాదిలో పాండ్య, చేర రాజులను జయించి హంపి విజయ నగరానికి పోతూ దారిలో ప్రస్తుత నాగలాపురంలో విడిది చేశారు అక్కడ తన తల్లి గుర్తుకు రాగా, వెంటనే అరుణానది ప్రవహించే చోట ఒక పట్టణాన్ని నిర్మించి 'నాగలాంబ పురం' అని తన తల్లి పేరు పెట్టారు ఆ పేరు క్రమంగా మారి నాగలాపురం అయింది రెండవ పర్యాయం శ్రీకృష్ణ దేవరాయలు కుంభకోణం నుండి తిరిగి వస్తూ నాగలాపురంలో విడిది చేయగా వేదనారాయణ స్వామి కలలో వచ్చి తనకు 7 ప్రాకారాల ఆలయాన్ని నిర్మించమని కోరగా ఆలయ నిర్మాణానికి రాయలవారు హరిదాసుని నియమించారు ఈ ఆలయ విస్తీర్ణం 12 ఎకరాలు శిల్పచాతుర్యానికి, వాస్తు వైభవానికి ఆటపట్టయిన ప్రాచీన దేవాలయాల్లో ఇది ప్రాముఖ్యం వహిస్తోంది గర్భాలయ మొదటి ద్వారంలో ద్వారపాలక విగ్రహాలను మణి-సందిక అని పిలుస్తారు వీనిలో మొదటిది పురుష విగ్రహం రెండవది స్త్రీ విగ్రహం ఇక మిగిలిన ద్వారాల్లో ద్వారపాలకులున్నారు ఉత్తరవైపు ద్వార సమీపంలో రెండు గుడులున్నాయి అందులో ఒకట హరికంరేశ్వరస్వామి గుడి, రెండవది నవగ్రహాల గుడి

## 1.2.3 7 కైలాసకోన

నారాయణవనం మండల కేంద్రంనుండి 3 కి మీ దూరంలో కైలాసకోన ఉంది ఇక్కడ 100 అడుగుల ఎత్తునుండి పడే జలపాతం ఉంది సదాశివేశ్వరస్వామి ఆలయంలో ప్రతిఏటా శివరాత్రికి ఉత్సవాలు జరుగుతాయి ఇది విహారకేంద్రం ఈ కోన ప్రక్కనే ఉన్న పర్వత పంక్తి 'నగరిముక్కు' (నగరి నోస్) అని పిలువబడుతోంది మధ్యయుగంలో చోళరాజులు ఈ నగరిముక్కుమీద ప్రతిరోజు రాత్రి పెద్ద దీపం పెట్టేవారు నావికులు దీని ఆధారంగా మదరాసు చేరేవారు ప్రస్తుతం పౌర్ణమినాడు దీపం పెడ్తారు

## 1-2-3-8. తలకోన

యర్రావారి పాళెం మండలం పరిధిలోని నెరబైలు గ్రామంలో "తలకోన" పేరు పొందిన పుణ్యక్షేత్రం తలకోనలో సుమారు 200 అడుగుల ఎత్తునుండి పడుతున్న జలపాతం ఉంది

ఇది పేదల 'ఊటీ'గా పేరు పొందింది కనువిందుగొల్పే సుందర ప్రకృతి దృశ్యాలతో అలరారుతోంది ప్రతి సంవత్సరం మహాశివరాత్రికి ముందు మూడురోజుల పాటు ఉత్సవాలు జరుగుతాయి ప్రతి సోమవారం సిద్ధేశ్వరస్వామి పూజ జరుగుతుంది

## 1-2-3-9 కాణిపాకం

చిత్తూరు నుండి 11 కి మీ దూరంలో ఐరాల మండలం పరిధిలో "కాణిపాకం" పుణ్యక్షేత్రం ఉంది "వెయ్యి సంవత్సరాలకు పూర్వం 'విహారపురం' అని పిలువబడే ఈ గ్రామంలో గ్రుడ్డి, మూగ, చెవిటి అయిన ముగ్గురు వ్యవసాయం చేసుకొని బ్రతికేవారు ఒక కాలంలో వారి ఏతపు బావిలో నీళ్ళు ఒట్టిపోయాయి ఆ అవిటి వాళ్ళు నీళ్ళకోసం ఏతపు బావిలో పారతో మట్టిని త్రవ్వగా భూమిలోంచి రక్తం చిమ్మింది వెంటనే వారి అవిటితనం పోయింది ఆ రక్తధారలు అక్కడే స్వయంభువుగా నిక్షిప్తమైన విఘ్నేశ్వరుని తలనుండి రావడం గమనించిన విహారపుర గ్రామస్తులు స్వామికి కొబ్బరి కాయలుకొట్టి ప్రార్థించారు అలా కొట్టిన కొబ్బరికాయల నీరు కాణి* పారగా "కాణి పారకమ్"గా ఆ గ్రామానికి పేరు స్థిరపడింది రాను రాను కాణిపాకంగా మారింది "[1] అచ్చట వెలసిన వరసిద్ధి వినాయకుని ప్రతిరోజు భక్తులనేకులు దర్శిస్తారు ఈ ఆలయం ప్రమాణాలకు ప్రసిద్ధి చెందింది బావిలో వెలసిన వినాయకుడి బావిలో అన్ని కాలాల్లోను నీళ్ళుండటం విశేషం

## 1-2-3-10 ఆరోగ్యవరం

నిమ్మనపల్లె పరిధిలో ప్రసిద్ధి చెందిన శానిటోరియాన్ని ఆరోగ్యవరం ప్రాంతంలో స్థాపించారు ఒకప్పుడు క్షయవ్యాధికి మాత్రమే చికిత్సా కేంద్రంగా పేరుపొందిన ఈ కేంద్రంలో నేడు వివిధ వ్యాధులకు చికిత్స చేస్తున్నారు

## 1-2-3-11 హార్సిలీ హిల్స్

బీరంగి కొత్తకోట మండల పరిధిలో ఉన్న హార్సిలీ కొండలు సముద్రమట్టానికి 4326 అడుగుల ఎత్తున ఉన్నాయి ఇది చల్లని వాతావరణం కల్గిన ప్రాంతం 'టూరిస్టు కార్పొరేషన్' వారిచే విహార యాత్రికులకు వసతి గృహాలు ఇక్కడ ఏర్పాటు చేయబడ్డాయి. ఆనాటి కడప కలెక్టరైన 'హార్సిలీ' పేరుతో ఇది ప్రసిద్ధికెక్కింది ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంచే ఈ కేంద్రాన్ని ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర గవర్నర్‌కు విడిది స్థలంగా నిర్దేశించబడింది

ఇవేకాకుండా ఇంకా ఎన్నో పుణ్యక్షేత్రాలు, చారిత్రక ప్రదేశాలు, దర్శనీయ స్థలాలు ఎన్నో ఉన్నాయి

---

* కాణి – ఎకరాపై పాతిక మేర

1 శ్రీ కాణిపాక వరసిద్ధి వినాయక సుప్రభాతము – చరిత్ర పఠతు

## 1-2-4 నేల రకాలు

చిత్తూరు జిల్లా 57 శాతం ఎర్రమట్టి నేలలు 34 శాతం ఎర్ర ఇసుక నేలలు మిగిలిన 9శాతం నల్లరేగడి మరియు నల్ల ఇసుక రకాలు కలిగి ఉన్నాయి

## 1-2-5 నదులు

ఈ జిల్లాలో జీవనదులు లేవు క్రింద కనబరచిన నదులు సంవత్సరంలో కొంతకాలం మాత్రమే ప్రవహిస్తాయి

1 పొన్నై - పాలారు నదికి ఉపనది
2 స్వర్ణముఖి
3 కుశస్థలి
4 భీమా
5 బహుదా
6 ఫించా
7 కళ్యాణి
8 ఆరణియార్
9 పెద్దేరు
10 నీవానది

పై నదులే కాకుండా వర్షాకాలంలో కొండవాగులు కూడా జిల్లాలో అక్కడక్కడ ప్రవహిస్తుంటాయి

## 1-2-6 వర్షపాతం

జిల్లాలో సాధారణ వర్షపాతం 908 1 మి మీ వివిధ ఋతుపవన కాలాల్లో సాధారణ వర్షపాతం క్రింద కనబరచిన విధంగా ఉంటుంది

| | | |
|---|---|---|
| నైఋతి ఋతుపవనాలు | - | 380 4 మి మీ |
| ఈశాన్య ఋతుపవనాలు | - | 410 5 మి మీ |
| చలికాలం | - | 24 6 మి మీ |
| ఎండాకాలం | - | 92 6 మి మీ |
| మొత్తం | - | 908 1 మి మీ [1] |

1. గణాంకదర్శిని - 1992-93 చిత్తూరు జిల్లా (సంకలనము మరియు ప్రచురణ, ముఖ్యప్రణాళికాధికారి, చిత్తూరు)

### 1-2-7 ఖనిజాలు

చిత్తూరు జిల్లాలో ఖనిజ సంపద అధికంగా లేదు పుత్తూరు మరియు గంగాధర నెల్లూరు ప్రాంతాల్లో "స్టాటైట్" అనే ఖనిజము లభిస్తోంది కుప్పం మరియు పరిసర ప్రాంతాల్లో బంగారు, ఇనుము మరియు ఎర్ర నమూనా ఇసుక లభిస్తాయి [1]

ఎంతో విస్తృతి కల్గి, భిన్న సంస్కృతుల, భిన్న సాంప్రదాయాల, భిన్న భాషల సంస్కృతి కల్గి, తెలుగు – తమిళ – కన్నడ సాంప్రదాయాల మేళవింపుగా ఉండే ఈ చిత్తూరు జిల్లా ఆంధ్రప్రదేశ్‌లో ప్రత్యేక గుర్తింపు పొందింది సాహిత్యకళారంగాల్లోను ఈ ప్రత్యేకత కన్పిస్తుంది కళలను ఆదరించి, కళాకారులను గౌరవించి, కళాలయాలను నిర్మించి పోషించడం తరతరాల నుండి వస్తున్న సాంప్రదాయం రాజులు, జమీందారులు, సహృదయ కళాభిమానులు కళలను ప్రోత్సహించారు ఈ కళల్లో ఒకటైన వీధినాటకాలకు జిల్లా వాసులు ఎంతో ప్రోత్సాహమిచ్చారు అలాంటి వీధినాటకాల పుట్టుపూర్వోత్తరాలను గురించి తెలుసు కొందాం

## 1-3 మొదటి నాట్య గృహ నిర్మాణం

నాట్య ప్రయోగానికి స్త్రీ జనుల సహాయం లేనిదే పురుషులు కైశికీ ప్రయోగాన్ని చేయ జాలరు కావున వారిని ప్రసాదించమని భరతుడు బ్రహ్మను వేడుకొన్నాడు పితామహుడు సంకల్ప మాత్రాన అప్సరసలను సృష్టించి నాట్యాలంకార చతురులైన అప్సరసలను ప్రయోగార్థం భరతునికిచ్చాడు నాట్య ప్రయోగాన్ని మహేంద్ర విజయసూచకమైన ధ్వజోత్సవాన నాట్యవేదాన్ని ప్రయోగింపుమని భరతునికి బ్రహ్మ చెప్పాడు బ్రహ్మ నాందీ సహిత నాట్యాన్ని ప్రయోగించాడు నాంద్యనంతరం దేవతలు దైత్యుల జయించిన రీతిని నాట్యం ద్వారా ప్రయోగించారు దీన్ని తిలకించిన దేవగణం సంతుష్టులై అనేక బహుమతులను భరత పుత్రులకిచ్చారు కాని దానవ నాశనాన్ని ప్రదర్శించిన తీరుకు అక్కడ చేరిన దైత్యులందరు కినుక వహించి, విరూపాక్షాదులు అసుర సహితంగా విజృంభించి మాయచే నటుల వాక్కును, చేష్టను, స్మృతిని స్తంభింపచేశారు దేవేంద్రుడు తన దివ్యదృష్టితో పరిశీలించి కారణం తెలిసినవాడై కోపంతో రత్నఖచితమైన తన ధ్వజాన్ని గ్రహించి, దానితో రంగ పీఠగతులగు విఘ్నకరులను జర్జరీకృత దేహులను కావించగా దానవులతోసహా విఘ్నకరు లందరూ మరణించారు తిరిగి ఇంద్రోత్సవంలో ప్రయోగం ప్రారంభమయింది మిగిలిన విఘ్నకరులు మరొక్కసారి విజృంభించి నటుల్ని భయకంపితుల్ని చేశారు ఈ విపత్తునుండి కాపాడవలసిందిగా భరతుడు పితామహున్ని ప్రార్థించాడు అప్పుడు బ్రహ్మ విశ్వకర్మను రప్పించి లక్షణ సంపన్నమైన నాట్యగృహాన్ని నిర్మింపచేశాడు

1. గణాంకదర్శిని – 1992-93 చిత్తూరు జిల్లా (సంకలనము మరియు ప్రచురణ, ముఖ్యప్రణాళికాధికారి, చిత్తూరు)

దీన్నిబట్టి మనం గమనించినట్లయితే ఈ నాట్యగృహ నిర్మాణానికి ముందు నాట్య ప్రయోగం ఆరుబయటనే ప్రయోగించి ఉండాలని గ్రహించాలి నాట్యమనగా దశరూపకాల్లో ఏదో ఒకదాన్ని గ్రహించాలి ప్రయోగార్థం ఉద్దేశించినది నాట్యం దీన్నే మనం "నాటకం" (డ్రామా) అని పిలుస్తున్నాం ఈ నాటకం దశరూపకాల్లో ప్రధాన భేదంతో ఒప్పుతున్నది రూపకం బదులు "నాటకం" అనే పదం సామాన్యవాచకంగా వాడుతున్నామని గ్రహింప వచ్చు కాబట్టి వేదకాలంలోనే దృశ్యశ్రవ్య రూపకాలకు బీజోత్పత్తి జరిగిందని చెప్పడానికి ఆధారాలు కన్పిస్తున్నాయి ఆంధ్రసాహిత్యంలో పూర్వచరిత్రల్ని రూపకంగా ప్రదర్శించడం నాట్యమౌతుందని "ప్రదమ పురాతన పటు చరిత్రములఁ గ్రమమొంద బహునాటకము లాడువారు"[1] అని పండితారాధ్య చరిత్రలో వివరించడం జరిగింది

పదమూడవ శతాబ్దంలో ఒకవైపు వీరశైవం, మరో వైపు వైష్ణవమతాలు వీరతాండవం చేయసాగాయి సమాజంలో మతకల్లోలాలను, మతవైషమ్యాలను సృష్టించిన తరుణంలో మానవాళికి హరిహరాద్వైతాన్ని ప్రబోధించడానికి మహాభారతాంధ్రీకరణలో తిక్కన దేశీయత ఉట్టిపడునట్లు నాటక శైలిని అనుసరించాడు పండితారాధ్య చరిత్ర పర్వతప్రకరణంలో గ్రామాల్లో సామాన్య ప్రజలకు వీధినాటకాలు, బహురూపాలు, తెరనాటకాలు ప్రదర్శించినట్లు ఉదాహరించబడింది

"జంగాలు తెరనాటకాలాడినట్లు బైచరాజు వెంకటనాధకవి 'పంచతంత్రం'లోను, అయ్యల రాజు నారాయణకవి 'హంస వింశతి' లోనూ ఉదాహరించారు "[2] శ్రీనాదుడు తన శృంగార నైషధ కావ్యంలో నలుడు దమయంతికి కన్పించిన ఘట్టంలో "జవనిక వాయం దట్టినం బొడసూపు బహురూపు తెఱంగున"[3] అనుటచే ఆ కాలానికే నాటకాలున్నట్లు స్పష్టమౌతుంది

## 1-4 దశవిధరూపకాలు - నాటకం

దశవిధ రూపకాల్లో 'నాటకం' అనే పదం సామాన్యవాచిగా వ్యవహరింపబడింది తెలుగు సాహిత్యంలో మొట్టమొదటి రూపక లక్షణాన్ని చిత్రకవి పెద్దనార్యుడు (క్రీ శ 1550) "లక్షణ సార సంగ్రహం"లో వివరించాడు అందులో రూపకాలన్నింటిని 'నాటక' పదంతోనే వ్యవహరించాడు కనుక నేడు మనం 'నాటకం' అని పిలువబడు పదం పూర్వం రూపకమనే సామాన్య వాచిగా వ్యవహరించుట మనకందరికి తెలిసిందే ఈ నాటక రచనలు సంస్కృతంలో 12వ శతాబ్ది వరకు నిరాటంకంగా సాగాయి తర్వాత క్షీణదశలో పడ్డాయని చెప్పవచ్చు 12వ శతాబ్ది తర్వాత గూడ తెలుగు కవులు సంస్కృతంలోనే రూపక రచనలు చేసి ఉన్నారు విశ్వనాధుని 'సౌగంధికాపహరణం' రామభట్ట బాణుని 'పార్వతీ పరిణయం'

1. పండితారాధ్య చరిత్ర – పాల్కురికి సోమనాధుడు పుట – 435
2. తెలుగు వారి జానపద కళారూపాలు – డా॥ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి పుట – 184
3. శృంగార నైషధం – వేదం వెంకటరాయశాస్త్రి పుట – 287

పరవస్తు వేంకట రంగాచార్యుల 'మంజుల నైషధం' శ్రీ విశ్వనాద సత్యనారాయణగారి "అమృత శర్మిష్ఠ' మొదలగునవి పేర్కొనవచ్చు

చిత్రకవి పెద్దనార్యుడు తన 'లక్షణసార సంగ్రహం'లో నాటక శబ్దాన్ని రూపకానికి పర్యాయంగా వాడాడు

**"తెలుగున నాటక లక్షణ**
**మిలనెవ్వరుఁ జేయలేదు వృషదశ్వసుతా।**
**లలిత మతి నీదు కృపచేఁ**
**దెలిసిన యంతయనొనర్తు దితిజధ్వంసీ॥"[1]**

అని చెప్పి పిదప నాటక లక్షణాన్ని నిర్వచించాడు అయినా తెలుగు భాషలో రూపక రచన సాగలేదు ఎక్కువగా నాటకాలను సంస్కృత భాషలోనే రచించేవారు కాని స్వతంత్రించి తెలుగు భాషలో రచనలు చేయలేదు మనకు తెలిసినంతవరకు వల్లభరాయల 'క్రీడాభిరామము' ఒక్కటే మొదటి తెలుగు రూపకమని చెప్పవచ్చు క్రీ శ 1860 ప్రాంతంలో ఆంగ్ల భాషా ప్రభావంతో మన తెలుగు భాషలో రూపక రచనలు ప్రారంభమయ్యాయని చెబుతారు

సంస్కృతంలో చెప్పబడ్డ 'వీథి' రూపకం, తెలుగులోగల వీధినాటకాలు ఒకటి కావు 'వీథి' రూపకానికి కల్పిత కథ ఉంటే, వీధి నాటకంలో ఏకథనైనా ఇతి వృత్తంగా తీసుకోవచ్చు అందు ధూర్తవిటుడు నాయకుడు కాగా వీధినాటకంలో ఆ నియమంలేదు అందు ప్రధాన రసం శృంగారం వీధినాటకాల్లో నవరసాల్లో ఏదైనా ప్రయోగించవచ్చు వీదిరూపకం ఏకాంకం – వీధినాటకం అంకనియమాలకు విరుద్ధం పై భేదాలను బట్టి వీధి రూపకం సంస్కృత నాటక పద్ధతిలో నడచేది డా॥ చింతారామనాథంగారు కూడా ఈ అభిప్రాయాన్నే వ్యక్తం చేస్తూ సంస్కృత వీధి రూపకం, తెలుగు వీధినాటకం ఒకటి కాదని, నాలుగు వీధులు కలిసే కూడళ్ళలో ఈ దేశి నాటకాలు ప్రదర్శిస్తారు కాబట్టి ఇవి వీధినాటకాలుగా ప్రసిద్ధి పొందాయని[2] చెప్పారు 'వీధినాటకాలు' అని తెలుగులోను, 'తెరుక్కూత్తు' అని తమిళంలోను, 'బయలాట' అని కన్నడంలోను నేడు వ్యవహరిస్తున్నారు

## 1-5. వీథి- అర్థవివరణ

**"నాటకం సప్రకరణ మంకో వ్యాయోగ ఏవచ**
**భాణః సమవకారశ్చ వీథీ ప్రహసనం డిమః**
**ఈహామృగశ్చ విజ్ఞేయో దశమో నాట్య లక్షణే"[3]**

1 నాట్యశాస్త్రము – పోణంగి శ్రీరామ అప్పారావు పుట – 545
2 కూచిపూడి నాట్య విశిష్టత – డా॥ చింతారామనాథం పుట – 98
3 నాట్యశాస్త్రం – పోణంగి శ్రీరామ అప్పారావు పుట – 508

అని భరతుడు దశవిధ రూపక నామాలను పేర్కొన్నాడు

1 నాటకం
2 ప్రకరణం
3 అంకం
4 వ్యాయోగం
5 భాణం
6 సమవకారం
7 వీధి
8 ప్రహసనం
9 డిమం
10 ఈహామృగం

ఈ పది రూపక భేదాలలో 'వీధి' ఒక రూపక భేదంగా నాట్యశాస్త్రంలో చెప్పబడింది వీధికి ఈ క్రింది లక్షణాలున్నట్లు నాట్యశాస్త్రంలో చెప్పబడింది

వీధి నాటకానికి కల్పిత కథ ఉంటుంది ధూర్త విటుడు నాయకుడుగా ఉంటాడు పూర్ణ శృంగారం ప్రధాన రసంగా ఉంటుంది కైశికీ వృత్తి ప్రయోగింపబడుతుంది ముఖ నిర్వహణ సంధులలో దయ, హాస్యం నర్మోక్తులలో వీధి నిర్వహించబడుతుంది

ఈ వీధికి కోశాల్లో ఈ క్రింది అర్థాలున్నాయి బహుజనపల్లి సీతారామాచార్యులవారు శబ్దరత్నాకరంలో ఈక్రింది అర్థాలిచ్చారు

వీది (వై వి) ఇండ్ల వరుసలు రెండింటి నడుమ త్రోవ

వీధి (సం వి) ఇ ఈ స్త్రీ 1 ఇండ్ల వరుస 2 వరుస 3 ఇండ్ల వరుసలు రెండింటి నడుమ త్రోవ 4 నాటక విశేషం

కొట్ర శ్యామల కామశాస్త్రిగారి ఆంధ్రవాచస్పత్యంలో వీధి శబ్దానికి ఈ క్రింది అర్థాలున్నాయి

వీది – వై వి – వీథీ – ఇండ్ల వరుసలు రెండింటి నడుమ త్రోవ – చనుప

వీధి – సం వి ఇ ఈ స్త్రీ (వీధి) = వీది ఇండ్ల వరుసలు రెండింటి నడుమ త్రోవ, ఇండ్ల వరుస, వరుస, రాజమార్గము, అంగళ్ల వాడ, దశరూపకముల లక్షణాలు

సర్ ఎమ్ ఎల్ విలియమ్స్‌గారి 'A Sanskrit English Dictionary' లో వీధికి ఈ క్రింది అర్థాలున్నాయి

---

వై వి వైకృత విశేష్యం, సం వి – సంస్కృత విశేష్యం

ఇ ఈ స్త్రీ – ఇకారాంత, ఈకారాంత స్త్రీలింగం

వీథీ or వీథి = A row, Line, a road, way, street, a market, stall, shop, a row of pictures, gallery, a perticular division of the planetory sphere, a terrace infront of a house, a sort of drama.

కోశాల్లోని పదాలను బట్టి వీథీ, వీథి, వీది పర్యాయ పదాలుగా కనిపించినా వైకృత విశేష్యంగా ఉండే 'వీది' శబ్దానికి ఇండ్లవరుసల నడిమి త్రోవ (Street) అనే అర్థము ఉన్నట్లు, సంస్కృత శబ్దమైన 'వీథి' శబ్దానికి, 'వీథి' (Street) అనే అర్థంతోపాటు రూపక భేదమనే అర్థమున్నట్లు తెలుస్తోంది. కాబట్టి వైకృత విశేష్యమైన వీది శబ్దానికి ఇండ్లవరుసల నడిమి త్రోవ అనే అర్థమే ఎక్కువ ప్రాచుర్యాన్ని పొందింది అని చెప్పవచ్చు.

## 1-6 పూర్వ కాలంలో వీధి

పూర్వం గ్రామీణ ప్రాంతాల్లో తగాదాలు గ్రామపెద్ద సమక్షంలో మరికొందరు గ్రామ పెద్దలు కలసి వివాదాంశాన్ని వీధిలో 'రచ్చ' (కొన్ని ప్రాంతాల్లో రచ్చబండ) మీద కూర్చొని పరిష్కరించేవారు. అంతేగాక కాలక్షేపం కోసం వినోదార్థం భారత భాగవత రామాయణాది పురాణ ఇతిహాసగాథలను కూడ గ్రామ నడిబొడ్డున గల వీధిలోని అరుగులపై కూర్చొని చదివి శ్రోతలకు అర్థమయ్యే రీతిలో విశదీకరించి చెప్పుకొనే వారు. గ్రామాల్లో పురాణ పఠనం చేయగల పరిజ్ఞానంగల పండితులు, బ్రాహ్మణులు, విద్యావంతులు లేదా మునసబు కరణంలాంటి వారు ఈ కార్యక్రమాన్ని నిర్వహించేవారు. అన్ని గ్రామాల్లోను విద్యా సౌకర్యం అందుబాటులో లేనందువల్ల అందరూ గ్రామమధ్యలో ఒక గురువును ఏర్పాటు చేసుకొని పిల్లలకు వీధిలోనే చదువు చెప్పించే వారు. వీటిని 'వీధిబడులు' అని ఆనాడు పిలిచేవారు.

పండుగలు, వివాహ సందర్భాల్లో కూడ వినోద కార్యక్రమాలను, ఊరేగింపులను వీధుల గుండానే నిర్వహించేవారు. దీన్నిబట్టి చూసినట్లయితే ఆరోజుల్లో వినోదకార్యక్రమాలు 'వీధి' లోనే నిర్వహించేవారని చెప్పవచ్చు. కాలక్రమేణా పురాణపఠనంతోబాటు నాటక రూపాలు కూడ పల్లెప్రాంతాల్లో ఆవిర్భవించాయి. ఈ నాటకాలను కూడ వీధుల్లోనే ప్రదర్శించేవారు. కనుక వీటికి "వీధి నాటకాలు" అనే పేరు ప్రచారంలోకి వచ్చిందని పరిశోధకుల అభిప్రాయం.

## 1.7. ఆదిమానవుడు - నృత్తరీతి

ఆదిమానవుడు [illegible] అడవుల్లో జీవిస్తుండేవారు. వారికి ప్రకృతిలోని ప్రతి విషయం విచిత్రంగా కన్పించేది. అడవిలో సంచరించే మృగాలతోబాటు తానూ ఒక మృగమై జీవించేవాడు. [illegible] అడవిలోని మృగాలనే చంపి పచ్చి మాంసాన్ని [illegible] గుహల్లో, చెట్ల పొదల్లో తలదాచుకునేవాడు.

ప్రకృతి ప్రసాదించిన ఆహారాన్ని భుజించి ఆనందాన్ని పొందేవాడు ఆహారం దొరకనప్పుడు ఆవేదన చెంది, దానికి కారణం ప్రకృతి కనికరించలేదని నమ్మేవాడు ఆ ప్రకృతిపట్ల భక్తి ప్రపత్తులను పెంపొందించుకోసాగాడు అనాలోచితంగా, సునాయాసంగా తనకు లభ్యమైన ఆహారాన్ని తినేవాడు వర్షం రావడాన్ని గుర్తించి ప్రకృతిమాత తమయెడ కనికరించిందని విశ్వసించేవాడు నాటినుండే పూజలు ప్రారంభమయ్యాయని చెప్పవచ్చు భయం చేతనో లేక కష్టం తీరినపుడు చేసే సంతోషాలాపనలు సంగీతానికి బీజాలయ్యాయి

ఆదిమానవుడు అనుకరణ శీలి తన చుట్టుపట్ల ఉన్న విషయాలను అనుకరించడంవల్ల మేధా సంపత్తిని పెంపొందించుకొన్నాడు ఆది మానవుడు అనుకరించిన మయూరి నాట్యవిశేషాలు, సంగీత నృత్యాల పుట్టుకకు కారణభూతాలని స్పష్టమవుతోంది పండుగ సందర్భాల్లో, ఉత్సవ వినోదాల్లో ఆ అనాగరిక ఆటవిక జాతివారి ఆట, పాట, మాట, అంగవిన్యాసాలే నేటి సంగీత సాహిత్య నృత్యాలకు బీజాలని స్పష్టమవుతోంది అంటే ప్రాక్తన మానవుని ఆట – పాటల (Ballad dance) నుండియే లలిత కళలన్నీ ఉత్పన్నమైనాయి

కాలక్రమేణ మానవుని మేధాశక్తి పరిపక్వత చెందుతూ వచ్చింది ఆహార విషయాల్లో, వస్త్రధారణలో, వేషభాషల్లో మార్పు చోటుచేసుకుంది సకల జీవరాశుల గమనానికి ఏవో అతీత శక్తులు పనిచేస్తున్నాయని, అవి మానవ సంక్షేమానికి భూమిమీదకు వచ్చిన శక్తులని నమ్మాడు వాటికి పూజలు చేయడం ప్రారంభించాడు ఆ పూజా సమయాల్లో పరవశిస్తూ పాటలు పాడాడు ఆటలు ఆడాడు భజనలూ చేశాడు ఈ విధంగా ప్రారంభమైన ఆటపాట లకు అభినయాన్ని జోడించాడు జంతువులను అనుకరించి వాటిని వేటాడి ఆహారాన్ని సంపాదించుకున్నాడు వాటి చర్మాలతో వాద్యాలను తయారుచేసుకున్నాడు పక్షులను, పాములను, జంతువులను అనుకరించి, వాటి అరుపులు, నడకలు, మెలికలు, మెడపట్లను అనుకరించి జంతు విన్యాసాలను ప్రదర్శించాడు ఆ విన్యాసాలే భావయుతమైన 'నటన'గా నెమలి నృత్యం' లాంటివి నేటికీ చూపరులను అమితంగా ఆకర్షిస్తున్నాయి ఈ అనాగరిక ఆటవిక నృత్యాలే కాలక్రమంలో నాటక రూపాలుగా పరిణతి చెందాయి భరతాది లాక్షణికులు లక్షణాలను నియంత్రించి, నాటక రచనలకు మార్గం వేశారు ఈ విధంగా ప్రారంభమైన నాటకాది లలితకళలు, నాటి జమీందారుల, శ్రీమంతుల వినోదం కోసం రాజకీయ శిబారాల్లో, దేవాలయాల్లో నిర్బంధించబడ్డాయి

దేవాలయాల్లోను, రాజమందిరాల్లోను ప్రదర్శించే నాటకాలను అప్పుడప్పుడు జన సామాన్యంచూచి ఆనందించి, అలాంటి వాటిని తామూ తమ గూడేల్లో, గ్రామాల్లో ప్రదర్శిం పడానికి పూనుకొన్నారు క్రమంగా ఆ నాటకాలు జనసామాన్యంలో ప్రచారాన్ని పొందాయి జనసామాన్యం నుండి రాజాశ్రయాన్ని పొందిన నాటకాది కళలు మెరుగులు దిద్దుకొని తిరిగి గ్రామప్రాంతాల్లో ప్రజాదరణ పొందాయి

## 1.8. నాటకాలు - వీధినాటకాలు

తెలుగు నాటకములను గూర్చి అసందిగ్ధంగా పేర్కొన్న ప్రథముడు పాల్కురికి సోమనాథుడు 'సిరియాల చరితమును "సాంగ భాషాంగ క్రియాంగ పటు నాటకంబుల నటియించువారు"[1] అని బసవ పురాణంలో తెల్పాడు ఈ నాటకాలు తెలుగు నాటకాలని నిస్సందేహంగా చెప్పవచ్చు ఎందుకంటే ఇందలికథ సిరియాలునికథ ఈ కథ ఏ సంస్కృత నాటకంలోనూ లేదు కనుక అది సంస్కృత నాటకానికి అనువాద నాటకంకాదు, పైగా సోమనాథుడు జాను తెనుగు కవి కావడం చేత

"లెస్సగాక కిరాట! ఈ లేమ చరిత మాదుదురు నాటకంబుగ నవనిలోన"[2] అని క్రీడాభిరామంలో వల్లభరాయుడు పేర్కొన్నాడు దీన్ని బట్టి 12వ శతాబ్దం నాటికే నాటకాలు ఆడుచున్నట్లు స్పష్టమవుతున్నది అయితే అంతకముందు నాటకాలు లేవా? అన్న ప్రశ్న ఉత్పన్నం కాగలదు ఒక్కసారిగా నాటకాలు పుట్టుకొచ్చాయా? అంటే అదీ కాదు ఎందు కంటే, ఆటపాటల సిద్ధాంతానుసారం ఈ నాటకాలు కూడ ఆనాటి నుండియే ప్రదర్శింప బడ్డాయి కాని వాటి నిరూపణకు తగిన ఆధారాలు, శాసనస్థంగాని, గ్రంధస్థంగాని లభ్యం కాలేదు శ్రీకృష్ణదేవరాయలకాలంలో స్త్రీ పురుషులు కలసి "తాయికొండ" నాటకాన్ని ప్రదర్శించినారు కానీ వారు ప్రదర్శించిన నాటకాలేవీ మనకు లభ్యం కానందువల్ల వాటి స్వభావ స్వరూపాలు మనకు తెలియవు పై విషయాలను పరిగణలోకి తీసుకొంటే ఈ తెలుగు నాటకాల తొలి దశ ఎటువంటిదో, ఈ నాటకాల ఆరంభం ఎప్పుడు జరిగిందో ఖచ్చితంగా చెప్పడానికి తగిన ఆధారాలు ఇప్పటికైతే లభ్యంకాలేదు ఈ నాటకాలను తోలుబొమ్మలాటలు, ఏలలు, కేళికలు, దొమ్మ రాటలు, బయలాటలు, యక్షగానాలు, వీధి నాటకాలు మొదలైన అనేక ప్రక్రియలుగా పేర్కొన్నారు ఆనాడు ఈ వీధినాటకాన్ని ఏప్రక్రియగా పేర్కొన్నారో తెలియడంలేదు జానపద కళా రూపాలను వీధుల్లోనే ప్రదర్శించేవారు పల్లెలో ఉండే విశాల బహిరంగ స్థలమే వారి రంగస్థలం అయితే ఇలాంటి ప్రదర్శనాలను రాయలసీమప్రాంతంలో బయల్నాటకాలంటారు[3] వీధినాటకాలను తొలుత ఆరుబయట ఆడేవారు తర్వాతి కాలంలో వీధుల్లో ప్రదర్శించేవారు అందువల్ల వీధినాటకాలకు పూర్వపు పేరు బయల్నాటకంగా చెప్పవచ్చు

సర్వకళలకు ఆటవికుని ఆటపాటలే కారణమని చెప్పినా, పై ఆటపాటల్లో పాటకే అధిక ప్రాధాన్యం ఉన్నప్పుడు అది గేయ కావ్యరచనకు దారితీసింది తత్ఫలితమే అర్వాచీన

1 బసవపురాణం - పాల్కురికి సోమనాథుడు పుట - 124

2 క్రీడాభిరామం - వల్లభరాయుడు పుట - 59

3 తెలుగువారి జానపదకళారూపాలు మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి పుట - 227

కాలంలోని యక్షగానం అట్లుగాక ఆటకూ కదా కదనానికి ప్రాధాన్యమున్నపుడు, అది క్రమంగా సంవాదానికీ తర్వాత రూపారోపానికి దారితీసింది దాని ఫలితమే అర్వాచీన కాలంలోని నాటకం సంస్కృత నాటకాలు మార్గనాటకాలు కాగా, తెలుగు నాటకాలు దేశి నాటకాలు అయితే తెలుగు దేశి నాటకాల ఆరంభం ఎప్పుడు జరిగిందో ఖచ్చితంగా చెప్పలేము కాని క్రీ శ 12వ శతాబ్దం తర్వాత జరిగిందనటానికంటే, అంతకుముందే ఆవిర్భవించిందని చెప్పడమే సబబు అయితే ఆ దేశికవుల పేర్లుగాని, వారి రచనలుగాని మనకు లభ్యంకాకపోవడం దురదృష్టమనే చెప్పాలి

## 1.9. వీధినాటక నామౌచిత్యం

పూర్వం జానపద కళారూపాలను ప్రదర్శించడానికి 'ఆరుబైలు' లేదా 'వీధి'నే రంగస్థలంగా ఉపయోగించేవారు ఊరి బయట పదిమంది కూర్చొని చూడ్డానికి అనువుగా ఉండే బయలు ప్రదేశాన్ని ఎంచుకొని, రంగస్థలాన్ని ఏర్పాటు చేసుకొనేవారు అటువంటి బయలు ప్రదేశంలో ప్రదర్శిస్తారు కాబట్టి ఆ ఆటలను 'బయలాట' లేదా 'బయలు నాటకం' అని పిలిచేవారు అప్పట్లో ప్రజాబాహుళ్యంలో మిక్కిలి ప్రచారంలో ఉండిన యక్షగానాలు, వీధి నాటకాలనూ కూడ బయలు ప్రదేశంలో ప్రదర్శించేవారు అందువల్లనే ఈ వీధి నాటకాలకు బయలు నాటకమని పేరు రూఢిఅయింది నాటకాలను ప్రదర్శించే స్థలాన్నిబట్టి అంటే వీధినే రంగస్థలంగా చేసుకొని ప్రదర్శిస్తారు కాబట్టి వీధి నాటకాలుగా ప్రసిద్ధికెక్కాయి అట్లే వాటిని ప్రదర్శించే స్థలాన్ని, వ్యక్తుల్ని, కులాల్ని, పద్ధతుల్ని, ప్రాంతీయుల్ని, ఇతి వృత్తాన్ని బట్టి అనేక రకాలుగా పిలువబడుతున్నాయి ఈ వీధినాటకాలకు గత చరిత్రమెండు ఆంధ్రరాష్ట్రంలో ఈ వీధి నాటకాలను అనేక పేర్లతో వ్యవహరిస్తున్నారు, ప్రదర్శిస్తున్నారు అవి

1 కురవంజి (కొరవంజి)

2 యక్షగానం

3 కూచిపూడి భాగవతం

4 బైలాట (బయలాట)

5 బైలు నాటకం (బయలు నాటకం)

6 వీధి నాటకం

7 చెంచు నాటకం

8 చిందుభాగవతం

9 వీధి భాగవతం

10 తూర్పు భాగవతం

11 యానాది భాగవతం

12 నక్కల భాగవతం

13 జేగంట భాగవతం

14 చిరతల భాగవతం

శ్రీశైలం, తిరుపతి, భద్రాచలం, శ్రీకాళహస్తి మొదలైన పుణ్యక్షేత్రాల్లో 'కురవలు' అనే జాతివారు భక్తులకు ఆయా పుణ్యక్షేత్రాల మాహాత్మ్యాన్ని తమ ఆటపాటలతో వివరించేవారు దీన్ని ఆనాడు 'యక్షులు' అనే జాతివారు తిలకించి, కురవలను అనుకరించి తమదైన ఒక ప్రత్యేక నృత్యశైలిగా మార్చుకొని యక్షగాన ప్రక్రియను రూపొందించుకున్నారని ప్రతీతి మాదిగవారు 'చిందు' అనే తమ ప్రత్యేక అడుగును జోడించి 'చిందు భాగవత' మనే పేరుతో ప్రదర్శనలిచ్చేవారు ఇదేవిధంగా నక్కల భాగవతం, యానాది భాగవతం మొదలగు పేర్లతో వీధినాటక ప్రదర్శనలు రూపొందాయి

'వీధి నాటకం' అనగానే వీధిలో ప్రదర్శించే నాటకమని మనకు స్ఫురిస్తుంది ఈవీధి నాటకానికి ఇన్ని పేర్లు ఎలా వచ్చాయో ఆలోచిస్తే సులభంగా తెలుసుకోవచ్చు 'కురవలు' ప్రదర్శించే నాటకానికి 'కురవంజి' అన్నారు కూచిపూడి వాస్తవ్యులు ప్రదర్శించేది 'కూచిపూడి భాగవతం' అన్నారు చెంచు జాతివారు ప్రదర్శించే నాటకానికి 'చెంచు నాటక'మని అన్నారు అయితే నేడు 'చెంచులక్ష్మి' కథను ఇతివృత్తంగా తీసుకొని వీధినాటకాలను ఇతర జాతులవారు కూడ ప్రదర్శిస్తున్నారు రంగస్థలంతో ప్రమేయం లేకనే వీధిలో ప్రదర్శించే నాటకాన్ని 'వీధినాటకం' అన్నారు ఈ నాటకంలో భగవంతుని లీలలను, మాహాత్మ్యాలను వివరించేవారు కాబట్టి 'వీధి భాగవతము' అని వ్యవహారంలోకి వచ్చింది ఈ నాటకాలకు ఆనాడు ప్రజాదరణ మెండుగా ఉండేది అనేకులు అనేక రకాలుగా నాటకాలను వీధులలో ప్రదర్శించేవారని స్పష్టమవుతూంది అట్లే తూర్పు ప్రాంతీయులు ప్రదర్శించే నాటకాలను 'తూర్పు భాగవత'మని, యానాదులు ప్రదర్శించే నాటకాలకు యానాది భాగవత'మని, నక్కలవారు ప్రదర్శించే నాటకాలను 'నక్కల భాగవత'మని పేర్లు వాడుకలోకి వచ్చినవి 'అట్లే పూర్వం దీపాలంకరణ చేయవీలులేక 'గరుడ స్తంభం' అనే పేరుతో దీపస్తంభాన్ని నడివీధిలో ఒకచోట పెట్టి, ఆ దీపం చుట్టూ తిరుగుతూ ఆ వెలుగులో చేతిలోని "గంట"ను మ్రోగించుకుంటూ కథ నడిపేవారు అందువల్ల ఈ ప్రదర్శనకు 'జేగంట భాగవత'మని పేరు వచ్చినట్లు తెలుస్తోంది

ఏ పేరుతో పిలిచినా, ఏ జాతి వారు ప్రదర్శించినా, ఏ పద్ధతిలో ప్రదర్శించినా పూర్వం ఈ వీధినాటకాలకు ప్రజాదరణ, ఆకర్షణ అమితంగా ఉండేది అనడం నిర్వివాదం



గరుడ స్తంభం

## 1.10. వీధి నాటక లక్షణాలు

చిత్తూరుజిల్లా వీధినాటకాలను పరిశీలించి ఈ క్రింది లక్షణాలను చెప్ప వచ్చు ఆచార్య జి నాగయ్యగారి గ్రంధం – మిక్కిలినేని మొట్టమొదటి సారిగా పరిశోధన చేసిన ప్రయత్నం, కళాకారుల అభిప్రాయాలు, ప్రదర్శనలు, క్షేత్ర పర్యటనల ద్వారా అనుభవంతో ఈ క్రింది లక్షణాలు రూపొందించడం జరిగింది భావి పరిశోధకులు వీటి కంటే ఇంకా ఎక్కువ లక్షణాలను పొందు పరచడానికి వీలుందని భావన

1 వీధి నాటకానికి రంగస్థలం ఆరుబయలు లేదా నాలుగు వీధుల కూడలి మాత్రం ఉండాలి
2 గ్రామంలోని వారందరూ చూడడానికి అనువుగా ఉండాలి
3 స్త్రీ పాత్రలను పురుషులే ధరించాలి
4 గ్రామం చుట్టుప్రక్కల దొరికే మూలికలు, వస్తువులతోనే రంగులను తయారు చేసుకోవాలి
5 రాత్రి పదిగంటలకు ప్రదర్శన ప్రారంభమై ఉదయం ఆరుగంటల వరకు ఆడేదే వీధి నాటకం
6 వీధి నాటకాలకు ప్రత్యేకంగా అంకాలు, రంగాలు అనేవి ఉండవు రంగాలు మారినట్లు మాటలతో చెప్పాలి

# రెండో అధ్యాయం

# వీధినాటకాలు - ఇతి వృత్తాలు

## 2.1. ప్రవేశిక

ప్రతి వ్యక్తికి జీవన గమ్యం ఉంటుంది ఆ గమ్యాన్ని చేరడానికి మానవ ప్రయత్నం నిర్విరామంగా సాగుతుంది కాని అందరూ తాము ఊహించిన గమ్యాన్ని చేరలేరు జీవితంలో ఎన్నో ఆటుపోటులకు గురి అయిన తర్వాతగాని ఆధ్యాత్మిక చింతన రాదు అప్పుదర్థమవుతుంది భక్తిలేనిదే ముక్తి లేదని కాబట్టి అలాంటి పరిస్థితుల్లో భక్తి భావాన్ని కుదుర్చుకుంటారు భగవంతుని గురించిన ఆలోచనలు మొదలవుతాయి దేవున్ని ప్రార్థిస్తారు పూజలు చేస్తారు చేతులెత్తి మొక్కుతారు కనబడిన రాయిని రప్పను చెట్టును పుట్టను భక్తితో పూజిస్తారు తమ ఆవేదన తెలుపుకుంటారు భగవంతుని సాన్నిధ్యం పొందడం ఎలా అన్న ప్రశ్నతో సతమతమవుతారు భక్తి మార్గమే శరణ్యం అని చివరకు ఇహలోక సుఖాల్ని కూడా వదులుకుంటారు భక్తి పారవశ్యంలో మునిగి తేలిన త్యాగయ్య, క్షేత్రయ్య, అన్నమయ్య లాంటివారు ఈ విషయాన్ని రుజువు చేశారు ఇదే మార్గాన్ని అందరూ ఆచరించవచ్చు భగవంతుని బహునామాలతో స్మరించి ముక్తిని పొందనూ వచ్చు ఈ బహునామాల్లో రామ నామం ఒక్కటే సకల పాపహరణం అనేది మన నమ్మకం అటువంటి శక్తివంతమైన రామనామాన్ని పామరులనుండి పండితుల వరకు అందించిన వాడు కవికోకిల వాల్మీకి పుట్టుకతో వాల్మీకి మహాపండితుడూ కాదు, వేదాంతీకాదు దారి దోపిడీలు చేసి బ్రతికే మామూలు బోయవాడు మీదుమిక్కిలి జానపదుడు అతని నోటినుండి వెలువడిన రామశబ్దం నేటికినీ జానపదుల నోట తారకమంత్రంగా జపింపబడుతోంది ఒక్క రామాయణమేకాదు, భారత భాగవతాలుకూడ జానపదుల జీవితాల్లో దర్శన మిస్తుంటాయి ముక్తికి భక్తి ఒక్కటే మార్గం ఈ సత్యాన్ని అందరూ గ్రహించాలని ఇతి హాసాల్లోని కథలను పురాణ పఠనం, హరికథ, బుర్రకథ, నాటకాలు మొదలైన అనేక రూపాల్లో తెలియచేసేవారు ఈ లక్ష్యసాధనకోసం ఇతిహాసాల్లోని కథలను ఇతివృత్తంగా తీసుకొని వీధి నాటకాలను రచించి ప్రదర్శించేవారు

ఈ వీధి నాటకాల్లోని ఇతివృత్తాన్నిబట్టి నాలుగు రకాలుగా వర్గీకరించవచ్చు

1 రామాయణకథలు

2 భారత కదలు

3 భాగవతకథలు

4 ఇతర కథలు

## 2.2. రామాయణ కథలు

భగవంతుని ఏదో ఒక రూపంలో, ఏదో ఒక విధంగా, ఏదో ఒక సమయంలో తలవని వ్యక్తి ఉండడు ముఖ్యంగా జానపదుల్లో రక్తితోపాటు భక్తికూడ మెండు వీరిలో ఎక్కువగా మూఢభక్తి కనిపిస్తుంది ఏ పనైనా పూజచేయనిదే ప్రారంభించరు ప్రతిచోట భక్తిని ప్రదర్శిస్తారు అందుకే ఎంత చిన్న గ్రామమైనా ఒక రామాలయమో, ఒక గ్రామ దేవతో, ఒక వినాయకుని గుడో, ఒక సత్తిరాయో (శక్తిరాయి) దర్శనమిస్తాయి గ్రామస్తులు పని పాట్లకు పోయేటప్పుడు ఈ గుళ్ళ ముందర మొక్కుకొని పోవడం ఆచారంగా కనిపిస్తుంది పండితులు కాకపోయినా పల్లెల్లో భారత, భాగవత, రామాయణ కథలను పురాణ పరనంగా చదివి అందరికీ అర్థమయ్యే విధంగా వివరించే వారున్నారు రామాయణకథ జానపదుల మనసుల్లో ఎప్పుడూ మెదుల్తూ ఉంటుంది కూర్చున్నా, లేచినా, కష్టమొచ్చినా, నష్టమొచ్చినా, విసుగు కల్గినా, బాధపడుతున్నా – 'రామా' రామచంద్రా' 'రామరామా' అనే పదాలు నోటినుండి అప్రయత్నంగానే వస్తాయి ఆహ్వాన పత్రికలు మొదలుకొని 'అకౌంట్స్' వరకు 'శ్రీరామ' అని రాసే మొదలుపెడతారు వినరాని మాట చెవిన పడినా 'రామ రామ' అనడం పరిపాటి చివరకు అప్పుడే పుట్టిన బిడ్డలకు స్నానం చేయించినా 'శ్రీరామరక్ష – నూరేళ్ళ ఆయుస్సు' అనడం ఆచారమైంది

'రా' అంటే పాపాలను, 'మ' అంటే నాశనం చేయడం అనగా 'రామ' అంటే పాపాలను నాశనం చేయువాడు అని జానపదుల విశ్వాసం అంతేగాక 'రా' అంటే ప్రపంచం, 'మ' అంటే ఈశ్వరుడని కూడ చెప్తారు

అన్ని పనులు ముగించుకొని రాత్రి పూట ఇంటికి చేరిన తర్వాత స్నానం చేసి, భోజనంచేసి, గ్రామంలోని 'రాముల గుడి' దగ్గర చేరి –

రామరామ యనుకుంటూ
రామ భజనలు చేసుకుంటూ
వకసారి రామాయనరాదా
వో పాపి మనసా వక సారి రామాయనరాదా॥

కసువూలు నూకుకుంటూ
సమసారము చేసుకుంటూ
వకసారి రామాయనరాదా
వో పాపి మనసా ఒకసారి రామా యనరాదా॥ *

అంటూ రామభజన చేయడం వారి నిత్యజీవితంలో ఒక భాగం వయసు మళ్ళిన వాళ్ళు తీరిక సమయాల్లో 'రామనామం' స్మరించడమే కాక 'రామకోటి' రాసి తరిస్తారు

వాల్మీకి సంస్కృతంలో రాసిన రామాయణాన్ని వివిధ నామాలతో ఎందరో తెలుగులోకి అనువాదం చేశారు అవి -

"1 కంబ రామాయణం
2 మొల్ల రామాయణం
3 రంగనాధ రామాయణం
4 నిర్వచనోత్తర రామాయణం
5 శ్రీమద్రామాయణ కల్పవృక్షం
6 సంక్షేప రామాయణం
7 భాస్కర రామాయణం
8 ఎఱ్ఱన రామాయణం (రామకథ)
9 రామాభ్యుదయం
10 రఘునాథ రామాయణం
11 అచ్చతెనుగు రామాయణం
12 గోపీనాథ రామాయణం
13 ఆంధ్రవాల్మీకి రామాయణం
14 శ్రీ కృష్ణ రామాయణం
15 సరస్వతీ రామాయణం
16 శ్రీ రఘు వీర చరితము
17 తెలుగు జానపద వాఙ్మయం - రామకధ
18 కుశలవ కుచ్చల చరిత్రము
19 శ్రీ రామాయణ గానం
20 ఊర్మిళాదేవి నిద్ర" *

ఈ రామాయణ కదలు జానపదుల హృదయాల్లో చెరగని ముద్ర వేసుకొన్నాయి అది

* జానపద కళారూపం - చెక్కభజన డా॥ చిగిచర్ల కృష్ణారెడ్డి - పుట - ll
* ద్విపద రామాయణ భారతి - జె వి సుబ్బరాయుడు తెలియజేశారు

ఎంతగా వారి జీవితాల్లో జీర్ణించుకొని పోయిందో ఈ క్రింది జాతీయాల్లో, సామెతల్లో స్పష్ట మవుతుంది జీవితసారాన్ని రంగరించి చూపినట్లుగా ఈ జాతీయాలు, సామెతలు దర్శన మిస్తాయి అల్పవాక్యాల్లో అనల్పార్థాన్ని సూచించే ఈ జాతీయాలు చూస్తే రామాయణం మామూలు గ్రామీణుల జీవితాల్లో ఎలా ప్రవేశించి తన ప్రాభవాన్ని నిల్పుకొన్నవో తెలియ గలదు

## 2-2-1 రామాయణ సంబంధిత జాతీయాలు

1 ఉడుతాభక్తి
2 కబంధ హస్తాలు
3 కుంభకర్ణ నిద్ర
4 భగరీథ ప్రయత్నం
5 లక్ష్మణరేఖ
6 లోకాభి రామాయణం
7 శూర్పనఖ మేనకోడలు (గయ్యాళి)
8 శ్రీరామరక్ష
9 శ్రీరాముడు (ఏకపత్నీవ్రతుడు)
10 మందర
11 రామలక్ష్మణులు
12 రామబాణం
13 రామరాజ్యం
14 రామాయణం
15 సీతామాలక్ష్మి
16 సుగ్రీవాజ్ఞ
17 వనవాసం
18 వాలిసుగ్రీవులు
19 హనుమంతుని తోక

## 2-2-2. రామాయణ సంబంధిత సామెతలు

1 ఆలులేని వానికి హనుమంతరాయని గుడి – బిడియమిడిచిన వాడికి వీరప్పగుడి శరణ్యం
2 ఇటువేస్తే హనుమంతుడు అటు వేస్తే వీరభద్రుడు
3 ఒకడు అగ్గిరాముడు ఇంకొకడు మైరావణుడు

4 కుంభకర్ణుడి నోటికి అరకాసు మజ్జిగా!

5 కైక పుట్టి చెరిచెగా రాము(ని) పట్టంబు

6 గోచిపెట్టినోడు గోవిందుడు కాదు, చీరకట్టిందంతా సీతక్కకాదు

7 చూచి రమ్మంటే కాల్చివచ్చినట్టు

8 తోక లేదు గాని, హనుమంతునంత బంటు

9 భరతుడి పట్నం రాముడి రాజ్యం

10 రంగడా విభీషునికి పంగనామమిడిన రీతి

11 రామాయణమంటే సామాన్యం కాదు గాడిద మోతంత వుందే అన్నట్టు

12 రామాయణం అంకు భారతం బొంకు

13 రామాయణంలో పిడకల వేట

14 రామాయణ మంతా విని రామునికి సీత ఏం కావాలని అడిగినట్టు

15 రాముడు లేని రాజ్యమైనట్లు

16 రాముని పాదాలు తగిలితే రాళ్ళు రమణులవుతాయి

17 రాముని వంటి రాజు ఉంటే హనుమంతుని వంటి బంటు ఉంటాడు

18 రాముడి వంటి రాజు రావణుని వంటి వైరి లేరు

19 శ్రీరాముడు మన వాడైతే చీడ పురుగులేం చేస్తాయి

20 సీత పుట్టుక లంక చేటుకే

21 సీత కష్టాలు సీతవి పీత కష్టాలు పీతవి

22 హనుమంతుని ముందు కుప్పిగంతులా

23 హనుమంతుని మోర వుంటే అదృష్టవంతుడు

రామాయణ సంబంధ జాతీయాలు, సామెతలు తెలుగు ప్రజల నోళ్ళలో నానుతుండడంవల్ల తెలుగు వారికి రామాయణమంటే గల గౌరవం ఎంతటిదో తెలుస్తుంది

## 2-2-3. రామాయణ ఇతివృత్త వీధినాటకాలు

చిత్తూరు జిల్లాలో రామాయణ ఇతి వృత్తాన్ని స్వీకరించి వీధినాటకాలు రాసి ప్రదర్శిస్తున్నారు ప్రస్తుతం లభ్యమయ్యే వీధి నాటకాలు

1 కౌసల్యా పరిణయం

2 సీతా కళ్యాణం

3 పాదుకా పట్టాభిషేకం
4 లంకా దహనం
5 శ్రీరామ పట్టాభిషేకం
6 రావణ కద
7 మైరావణ (మైతు రావణ)
8 రామాంజనేయ యుద్ధం
9 లవకుశ

## 2.3. బారత కథలు

వేదాలను విభజించిన మహామేధావి అయిన వ్యాసుడు సంస్కృతంలో మహాభారతాన్ని రచించాడు వేదవ్యాస విరచిత మహా భారతం ఒక గొప్ప ఇతిహాసం సర్వ వేదాల్లోని విషయాలు, సర్వ శాస్త్రాల, పురాణాల సారమే ఈ మహాభారతం ఇది ఆలోచనామృతం సర్వకాల సర్వావస్థల్లోను ఇది మానవాళికి మార్గదర్శి

నన్నయ తన రచనా కౌశలంతో సంస్కృత భారతాన్ని అందరికీ అర్థమయ్యే రీతిలో తెలుగు భాషలోకి అనువదించి తన రచనా చాతుర్యాన్ని చాటుకున్నాడు తర్వాతి కవులైన తిక్కన, ఎర్రనాదులకు మార్గదర్శకుడయ్యాడు కవిత్రయం వ్యాసభారతాన్ని తెలుగులోకి 18 పర్వాలుగా అనువదించారు

1 ఆదిపర్వం
2 సభాపర్వం
3 అరణ్యపర్వం
4 విరాట పర్వం
5 ఉద్యోగ పర్వం
6 భీష్మ పర్వం
7 ద్రోణ పర్వం
8 కర్ణ పర్వం
9 శల్య పర్వం
10 సౌప్తిక పర్వం
11 స్త్రీ పర్వం
12 శాంతి పర్వం
13 అనుశాసనిక పర్వం
14 అశ్వమేద పర్వం

15 ఆశ్రమవాస పర్వం

16 మౌసల పర్వం

17 స్వర్గారోహణ పర్వం

18 మహాప్రస్థాన పర్వం

వేద వ్యాస కృతమైన ఈ పంచమ వేదం భారతీయ భాషలన్నింటిలోకి అనువదించ బడింది అప్పటి దేశ కాల పరిస్థితులను బట్టి పద్య కావ్యాలుగా, ద్విపదలుగా, గద్య వ్యవహార భాషాకావ్యాలుగా, నాటకాలుగా మహాభారతం అనువదింపబడి వివిధ రూపాలు ధరించింది

"తెలుగులో ఉన్న భారత కావ్యాలు మూడు

1 కవిత్రయ భారతం

2 ద్విపద భారతం

3 శ్రీకృష్ణ భారతం

వీటిలో కలువె వీరరాజు సంస్కృత భారతానికి దేవరాజు సుధీ భారతాలు ప్రాచీనమైనవి "[1]

మహాభారతంలోని కొన్ని సంఘటనలను, ఘట్టాలను ఆధారం చేసుకొని ఎన్నో నాటకాలు వచ్చాయి ఇంతటి ప్రాశస్త్యం కల్గిన మహాభారతాన్ని తిరుపతి వేంకటకవులు 6 నాటకాలుగా రచించారు [2]

1 పాండవ విజయం (1903)

2 పాండవాశ్వమేధము (1903)

3 పాండవ ప్రవాసము (1907)

4 పాండవ జననము (1908)

5 పాండవోద్యోగము (1911)

6 పాండవ రాజసూయము (1921)

మహాభారతం పల్లె ప్రాంత ప్రజల హృదయాల్లో నిత్యం నినదిస్తూ ఉంటుంది తాము తరచు వాడుకొనే పదజాలంలో భారత సంబంధ పోలికలు, ఉపమలు చెప్పుకోవడమేగాక వాటిని అను దినం కథల రూపంలో మననం చేసుకుంటూ ఉంటారు భారత సంబంధమైన ఈ క్రింది జాతీయాలు, సామెతలు చూస్తే జానపదులకు భారతంపై గల మకుక్వ స్పష్టంగా తెలుస్తుంది

1 ద్రౌపది - రచయిత డా॥ డి సి రెడ్డి పుట - 5

2 తెలుగు నాటక వికాసం - డా॥ పి ఎస్ ఆర్ అప్పారావు

## 2-3-1. భారత సంబంధిత జాతీయాలు

1 అతిరథ మహారథులు
2 అజ్ఞాత వాసం
3 ఉత్తర ప్రగల్భాలు
4 కర్ణుని తల భారతం
5 కురుక్షేత్రం
6 చేట భారతం
7 ధర్మరాజు
8 శకుని
9 శల్య సారథ్యం మొ॥నవి

## 2-3-2. భారత సంబంధిత సామెతలు

1 ఆవులు మళ్ళించిన వాడే అర్జునుడు
2 ఇరాట పర్వం (విరాట) ఇంటాయన కొచ్చు బాగోతం మా బావకొచ్చు
3 కర్ణుడు లేని భారతం శొంఠి లేని కషాయం ఒక్కటే
4 కర్ణుని తల భారతమన్నట్టు
5 కర్ణునితో భారతం సరి – కార్తీక మాసంతో వానలు సరి
6 కాగల కార్యం గంధర్వులు తీరుస్తారు
7 కోతలకు ఉత్తర కుమారుడు
8 తింటే గారెలు తినాలి. వింటే భారతం వినాలి
9 పంచ పాండవులంటే నాకు తెలియదా? మంచపు కోళ్ళవలె ముగ్గురు అని రెండు వేళ్ళు చూపించాడట
10 పాండవుల వారి సంపాదన దుర్యోధనులవారి పిండాకూళ్ళకు సరి
11 భగవద్గీత పుచ్చుకుంటారా అంటే కడుపు నిండింది ఇంక తినలేను అన్నట్లు

మొదలగునవి తెలుగు వారి జన జీవితాల్లో ప్రవేశించి ఎంతగానో ప్రభావితం చేశాయి

పురాణ పఠనం ద్వారా, నాటక ప్రదర్శనల ద్వార జన బాహుళ్యంలో మహాభారతం విస్తృతంగా ప్రచారంలోకి వచ్చింది ఇందలి కొన్ని పాత్రలు జానపదుల్ని బాగా ఆకట్టుకున్నాయి కూడా మహాభారతంలో దుర్యోధనుడు దుష్టపాత్ర అయినప్పటికీ 'ఒక్క రోజు బ్రతికినా దుర్యోధనుడిలా బతకాలి' అనే అభిప్రాయం వ్యక్తం చేస్తుంటారు ఇక ఎదురులేని యువ వీరుడుగా అభిమన్యుడు, మహాబలశాలిగా భీముడు, గొప్ప పతివ్రతగా ద్రౌపది పాత్రలు జానపదుల్లో చెరగని ముద్రలు వేశాయి తమిళనాడు, చిత్తూరు జిల్లాల్లో

చాలా గ్రామాల్లో ధర్మరాజుల గుళ్ళను నిర్మించారు దీన్ని బట్టి ధర్మారాజు ధర్మాచరణకు ప్రతీకగా ప్రజలందరూ ఆయన చూపిన మార్గాన్ని అవలంబించాలని గుర్తు చేయడానికి ఈ గుళ్ళు నిర్మించారని స్పష్టమవుతోంది ఈ గుళ్ళ దగ్గర ప్రతి సంవత్సరం చైత్ర, వైశాఖ మాసాల్లో 18 రోజులు మహాభారత కదను ఒక్కొక్క పర్వాన్ని పగలు హరికదా రూపంలో చెప్పి, ఆనాటి కదను రాత్రిపూట వీధి నాటక రూపంలో ప్రదర్శిస్తారు ఈ విషయం ఐదో అధ్యాయంలో విపులంగా చెప్పబడింది

ఈ వీధినాటకాలను చూడటానికి చుట్టుప్రక్కల గ్రామాల ప్రజలు ఎద్దు బండ్లపై తండోప తండాలుగా వస్తారు ఇది ఒక ఉత్సవంగా నిర్వహింపబడుతుంది ఈ విధంగా వీధి నాటకాలను ఇంత ఘనంగా ప్రదర్శించే సాంప్రదాయం చిత్తూరు జిల్లా మరియు సరిహద్దు ప్రాంతాల్లో తప్ప మరి ఏ ఇతర జిల్లాల్లోనూ, రాష్ట్రాల్లోనూ లేదనే చెప్పవచ్చు

రామాయణ కథలకంటే భారత కథలకు ఎక్కువ ప్రాచుర్యం చిత్తూరు జిల్లాలో కనిపిస్తుంది లభ్యమవుతున్న నాటక కథలను బట్టి, ప్రదర్శిస్తున్న వీధి నాటకాలనుబట్టి భారత కథకల్గిన నాటకాలే ఎక్కువగా ఉన్నాయి

## 2.3.3. భారత ఇతి వృత్త వీధినాటకాలు

1 పాండవ జననం
2 వారణావతము (హిడింబాసురకధ)
3 ద్రౌపదీ కళ్యాణం (బకాసుర వధ)
4 ద్రౌపదీ వస్త్రాపహరణం
5 మయసభ
6 ద్రౌపదీ మాన సంరక్షణ
7 అరణ్య పర్వం
8 అర్జున తపస్సు
9 శశిరేఖా పరిణయము
10 గయోపాఖ్యానం
11 విరాటపర్వం (కీచక వధ)
12 ఉత్తర గోగ్రహణం
13 శ్రీ కృష్ణ రాయబారం
14 శ్రీ కృష్ణార్జున యుద్ధం
15 యుద్ధ పంచకం (దుర్యోధన వధ)
16 కచ దేవయాని

17 యయాతి చరిత్ర
18 పాండురాజు వేట

భారత ఆంధ్రీకరణకు ముందే రామాయణ భారత భాగవత కథలు జానపదుల నోళ్లల్లో నిత్యము నిర్వహించే పనిపాటల్లో ప్రచారం పొందుతూనే ఉండేవి అలాంటి కథలకు అనుగుణంగా తర్వాతి వీధి నాటక కళాకారులు కొందరు (ఆధునికులు) మహాభారతాన్ని పై పేర్లతో ప్రదర్శనలివ్వడానికి వీలుగా రచనలు చేసుకొన్నారు

## 2.4. బాగవత కథలు

భారతదేశం ఆధ్యాత్మిక విద్యకు, ఆచరణకు పుట్టినిల్లు పూర్వం ఋషులు, యోగులు, వేదాంతులు, మహాపురుషులు తమ తపశ్శక్తితో సృష్టిరహస్యాన్ని, ధర్మతత్వాన్ని, జీవిత ధ్యేయాన్ని తాము తెలుసుకొని, మానవులకు తెలియచేయాలనే ప్రయత్నం చేశారు ఆ ప్రయత్నంలో భాగంగానే అనేక ఇతిహాసాలు, మత గ్రంధాలు పుట్టాయి ఇవన్నీ భగవంతుని తత్వాన్ని తెలియజేసి, మానవుల మనసులను భగవంతుని మీదికి లగ్నం కావడానికి దోహద పడ్డాయి ఆవిధంగా రచింపబడ్డదే భాగవతం ఈ భాగవతాన్ని పోతనాదులు అనువాదం చేశారు ఇందులో భగవంతుని లీలలు విస్తృతంగా ప్రచారం చేయబడ్డాయి భక్తిరసానికి ప్రతీక భాగవతం భాగవతం అంటే భక్తి, జ్ఞాన, వైరాగ్య, తత్వ, మోక్షాలకు మార్గం భాగవతాన్ని తెలుగులోకి అనువదించిన పోతనాదులు, ఆనాటి జానపదుల ఆచార వ్యవహారాలను, తమ రచనల్లో ప్రతిబింబింపచేశారనుట నిర్వివాదాంశం అంతేగాదు నేటికీ జానపదుల నిత్య జీవితంలో భాగవత కదలు అనేక రూపాల్లో వెల్లడవుతూ ఉంటాయి అందుకు నిదర్శనం భాగవత సంబంధ జాతీయాలు, సామెతలనుబట్టి చూస్తే విశదమవుతుంది

### 2.4.1. భాగవత సంబంధిత జాతీయాలు

1 కృష్ణార్పణం
2 గంజేంద్రమోక్షం
3 నలుగురిలో నారాయణ
4 శ్రీకృష్ణుదు
5 భస్మాసుర హస్తం
6 బ్రహ్మరదం

### 2.4.2. భాగవత సంబంధిత సామెతలు

1 ఇల్ల నారాయణమ్మా అంటే వెళ్ళు గోవిందా అన్నట్టు
2 చేతి చమురు భాగవతం చెప్పుకొన్నట్టు

3 పైకం భాగవతం వారికి తిట్లు చాకలి, మంగలి వాళ్ళకు

4 బతుక లేక భాగవతం అన్నట్లు

భగవంతుని సేవించి తరించడానికి నవవిధ భక్తిమార్గాలను* పేర్కొన్నారు పూర్వులు అవి

1 శ్రవణం 2 కీర్తనం 3 స్మరణం 4 పాద సేవనం

5 అర్చనం 6 వందనం 7 దాస్యం 8 సఖ్యం

9 ఆత్మ నివేదనం

ఇటువంటి భక్తి ప్రబోధక ఇతి వృత్తాలను జానపదులు నాటకాలుగా ప్రదర్శిస్తున్నారు సమాజ పాపభీతిలేక పెడమార్గంలో సంచరిస్తున్నప్పుడు వారిని సరైన మార్గంలో నడిపించడానికి, వారిలో ధర్మ ప్రవృత్తిని, దైవచింతనను పెంచడానికి, భగవంతుని లీలలు కథలుగా తీసుకొని వీధి నాటకాలలో ప్రదర్శిస్తారు భాగవతం నుండి ఇతి వృత్తాన్ని గ్రహించి ప్రదర్శిస్తున్న వీధి నాటకాలు

1 గజేంద్రమోక్షం 2 శ్రీ కృష్ణలీలలు 3 భక్త ప్రహ్లాద

4 మోహినీ రుక్మాంగద 5 ఉషాపరిణయం (బాణాసురకద)

## 2.5. ఇతర కథలు

రామాయణ భారత భాగవత ఇతి వృత్త కదలను ప్రధానంగా స్వీకరించి చిరుమార్పులతో చేసిన కల్పిత కథలు పూర్తిగా ఇతిహాస కదకు సంబంధం లేక నూతనంగా కల్పించి రాసిన కల్పిత కదలు, భక్తి ప్రధానమైన కదలు, చారిత్రక కదలు ఈ ఇతర కథల్లో చేర్చవచ్చు

కేవల కల్పిత కథలు కూడా నాటకాలుగా ప్రదర్శించడం ఉంది కాని వీటి సంఖ్య అత్యల్పం అవి

1 జయంతి జయపాల

2 కావమ్మ కథ

3 అల్లి అర్జున

4 కురవంజి

5 కనకతార



* "శ్రవణం కీర్తనం విష్ణోస్మరణం పాదసేవనమ్
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మనివేదనమ్" –
శ్రీమద్భాగవతము – సప్తమస్కంధము – అ 5–శ్లో 23

పురాణ కథకు కల్పన జోడించి రాసిన కల్పిత కదలు 'అల్లి అర్జున' 'కురవంజి' నాటకాలు అర్జునుడు చాలా మంది కన్యలను వివాహం చేసుకున్నాడు ఈ విషయాన్ని దృష్టిలో పెట్టు కొని పాండ్యదేశపు కన్య అయిన అల్లిని అర్జునుడు వివాహం చేసుకొన్నట్టు కల్పించి 'అల్లి అర్జున' అనే వీధి నాటకాన్ని ప్రదర్శిస్తారు

ఈ కల్పిత కథల్లో 'కనకతార' అనే వీధి నాటకం విశేషంగా చిత్తూరు జిల్లాలో ప్రదర్శిస్తారు ఈ నాటకానికి ప్రజాదరణ మెండు దీన్ని వీధినాటకంగానే కాక 'డ్రామా'గా కూడా ప్రదర్శిస్తారు క్లుప్తంగా 'కనకతార' కద ఇలా ఉంటుంది

## 2.5.1. 'కనకతార' కథ

ఉదయసేనుడు, క్రూర సేనుడు అన్నదమ్ములు కమలాదేవి ఉదయసేనుని భార్య ఈ దంపతులకు కనక అనే కొడుకు, తార అనే కూతురు ఉన్నారు క్రూరసేనుడు అన్ని అవలక్షణాలుగల వాడు అన్న భార్య కమలాదేవిని చేపట్టాలనే దుర్బుద్ధితో మొదట ఉదయసేనుని మంత్రులైన ప్రతాప, ధీమంతులను చంపి, తన మంత్రులైన వీరపాలుడు, శూరపాలుడు అనే వారి సహాయంతో అన్నను చంపుతాడు ఆ తర్వాత నిద్రపోతున్న కమలా దేవిని చేపట్టగా ఆమె ఒప్పుకోకుండా తప్పించుకొని అడవిదారి పడుతుంది క్రూరసేనుడు వదలక వెన్నంటి వస్తాడు అడవిలో ఉన్న ఒక గొర్రెల కాపరి క్రూరసేనుణ్ణి దారి తప్పిస్తాడు క్రూరసేనుడు దారి తప్పినా మళ్ళీ కమలాదేవిని ఎలాగో పట్టుకొని బంధించగా ఆమె మరణమే శరణమని సముద్రంలోకి దూకుతుంది ఇక చేసేదిలేక కమలాదేవి బిడ్డలైన కనక, తారలను అడవికి తీసుకెళ్ళి చంపమని తన మంత్రులకు ఆజ్ఞాపిస్తాడు క్రూరసేనుడు కనక, తారలు ఏడుస్తూ వేడగా వారిని చంపకుండా అడవిలో వదిలేసి చంపామని అబద్ధం చెప్తారు మంత్రులు

చేపలు పట్టేవాళ్ళకు కమలాదేవి దొరుకుతుంది అందులో ఆ నాయకుడు కమలాదేవి అందానికి మురిసి తనను పెళ్ళిచేసుకోమని అడుగగా అతడి భార్య తెలివిగా కమలాదేవిని తప్పిస్తుంది

కనక, తారలు అడవిలో పోతూ ఆయాసపడినవేళ తార పడిపోగా, కనక నీళ్ళకోసంపోగా, ఆ సమయంలో ఆ ప్రదేశపు కొండరాజు తారను అపహరించుకొని పోయి, తన మిత్రుడైన క్రూరసేనునికి తార విరోధి అని తెలిసికొని, తారను తన దేవతకు బలి ఇవ్వాలని పూనుకొంటాడు

కమలాదేవి అడవిలో పోతూండగా ఒక బెబ్బులి తరుమగా రామజెట్టి కాపాడుతాడు నేను దిక్కులేని దానిని అని చెప్పిన కమలాదేవిని తన ఇంటికి తీసుకెళ్ళి, తన బిడ్డలకు తోడుగా ఉంచుతాడు

ఉదయసేనుని స్నేహితుడు విజయసేనుడు కనక, తారలను ఆదుకోవాలని వచ్చి, దారి మధ్యలో ఒక గుడిలో విశ్రాంతి తీసుకుంటుండగా కొండరాజు మత్తుమందు చల్లి తీసుకెళ్ళి పోతాడు విజయసేనుడు చాకచక్యంతో తప్పించుకొని, అక్కడే బందీగా ఉన్న తారను విడిపించుకొనిపోతాడు

రాజవంశీకుడై, కారణజన్ముడై యున్నట్టివారు ఎవరైతే తాకగా ఈ దేవాలయం కవాటం తెరుచుకుంటుందో వారే ఈ దేశపు రాజు అన్న శాసనంప్రకారం కనక తాకగా, తెరచుకోగా అతను ఆదేశపు రాజవుతాడు

విజయసేనుడు తారతో కనకను కలిసి క్రూరసేనుని తుదముట్టించి, కమలాదేవిని తీసుకొచ్చి కనకకు పట్టాభిషేకం చేస్తాడు

ఈ కల్పిత 'కనకతార' కథలాగానే ద్రౌపది కురవంజి వేషంవేసి దుర్యోధనుని భార్యకు 'సోదె' చెప్పడం కల్పించి 'కురవంజి' అనే నాటకాన్ని ప్రదర్శిస్తారు

చిత్తూరు జిల్లాలో దిగ్విజయంగా ప్రదర్శించబడుతూ జానపదుల ప్రశంసలందు కొంటున్న నాటకాలు -

1 సారంగధర

2 బ్రహ్మంగారి జీవితచరిత్ర

3 నలతంగ

4 చిన్నమ్మకథ

5 హరిశ్చంద్ర

పైన పేర్కొన్న వీధి నాటకాలన్నీ చిత్తూరు జిల్లాలో వివిధ ప్రాంతాల్లో ప్రదర్శిస్తారు అయితే కంగుంది వారు ఎక్కువగా భారత సంబంధ ఇతి వృత్త కథలనే తీసుకొని వీధి నాటకాలుగా రచించి ప్రదర్శిస్తారు కంగుంది వీధి నాటకాలకు ఒక ప్రత్యేకత ఉంది ఆ ప్రత్యేకతను ఐదో అధ్యాయంలో వివరించడం జరిగింది

## 2.6. ఇతి వృత్తం - మార్పులు - చేర్పులు

కంగుంది వారు పద్దెనిమిది రాత్రులు భారతకథను విభాగించుకొని వరుసగా ప్రదర్శిస్తారు జానపదుల స్థాయికి తగ్గట్టుగా మూలకథను కొద్దిగా మార్పుచేసి తమదైన ప్రత్యేకశైలిలో మలచుకొంటారు భాషకు సంబంధించి ఎక్కువగా గ్రాంధిక భాష ఉన్నప్పటికీ వ్యావహారికాన్ని కూడ ప్రయోగించి వీధినాటకాలను రాయడానికి నాటక కర్తలు ప్రయత్నిం చారు కంగుంది వారు రాసిన నాటకాల్లో ఒకటైన 'కీచక వధ' నాటకాన్ని తీసుకొని ఇతి వృత్తానికి సంబంధించి ఏరకమైన మార్పులు, చేర్పులు చేశారో విశ్లేషణా పద్ధతిలో చూద్దాం!

కావ్యంలో వర్ణన ప్రాధాన్యం వహిస్తుంది నాటకంలో పాత్రల సంభాషణలు, వారి హావ భావ ప్రకటనలు ప్రాధాన్యం వహిస్తాయి అతి విస్తృతి కల్గిన సూర్యోదయాది వర్ణనలు మొదలైనవి నాటకంలో చూపించడానికి వీలుకాదు అలాగే ప్రతిపాత్ర ప్రవేశమప్పుడు పాత్ర ప్రత్యేకతను చెప్పడం కావ్య సాంప్రదాయం అనిపించుకోదు అందుకే నాటకాలను రాసే వారు ఇతి వృత్తాన్ని, పాత్రలను, సంఘటనలను దృష్టిలో పెట్టుకొని మార్పుచేసుకొంటారు కొత్త కల్పనలను జోడించి నాటక ఇతి వృత్తానికి పుష్టిచేకూరుస్తారు పండితులను ఆకట్టుకొనే శాకుంతలం మొ॥ నాటకాలలో సంఘటనలు, వర్ణనలు – కల్పనలు ఉన్నప్పటికి భాష ఉదాత్తంగా ప్రయోగించబడింది జానపదులు ప్రదర్శించే ఈ కంగుంది నాటకాలలో కొన్ని చోట్ల భాష శుద్ధ వ్యావహారిక స్థాయిలో కన్పిస్తుంది ఇతి వృత్తంలో మార్పులు, చేర్పులు ఉండి సమకాలీన సమస్యలను కూడ దృష్టిలో పెట్టుకొన్నట్లు తెలుస్తుంది ఈ విషయాన్ని పరిశీలిద్దాం

తిక్కన భారతంలో విరాటపర్వం, ధౌమ్యుడు పాండవుల నూరార్చుటతో ప్రారంభమై అభిమన్యుని వివాహంతో ముగుస్తుంది ఈ కథను 5 ఆశ్వాసాల్లో తిక్కన అనువదించాడు ప్రథమాశ్వాసంలో పాంచాలీ పాండవులు మారువేషాల్లో విరాటుని ఆశ్రయం పొందే కథ చెప్పబడింది ద్వితీయాశ్వాసం భీముడు మల్లునితో యుద్ధం చేయడం, కీచకుడు సైరంధ్రిని చూడడం, సైరంధ్రిని బలాత్కరించడం, భీముడు కీచకుని సంహరించడంతో ముగుస్తుంది తృతీయాశ్వాసంలో ఉపకీచకులు ద్రౌపదిని కీచకుని శవంతో కట్టి దహించటానికి ప్రయత్నించుట, భీముడు ఉపకీచకులను సంహరించుట, సుశర్మ దక్షిణ గోగ్రహణం, పాండవులు సుశర్మను ఓడించి విరాటుని విడిపించుట, ధర్మరాజు సుశర్మను సపరివారంగా విడిపించి పంపే కథ వరకు ఇందున్నవి ఉత్తర గోగ్రహణంతో ప్రారంభమై, యుద్ధారంభంతో చతుర్థాశ్వాసం ముగుస్తుంది ఐదవ అశ్వాసంలో అర్జునుడుత్తరునకు కౌరవ వీరులను గురించి చెప్పటం, కురు వీరులతో చేసిన యుద్ధవర్ణన, అర్జునుడు దుర్యోధనుని ఉపాలంభించుట, దుర్యోధనుడు ఓటమితో వెనుదిరుగుట, ఉత్తరుని యుద్ధవిశేషాలు విరటునికి తెలియ చెప్పడం, పాండవులు తమ్ము నెరిగించుకొనుట, అభిమన్యుడు, ఉత్తరల వివాహంతో విరాట పర్వం పరిసమాప్తమవుతుంది

ఈ కథను వీధినాటక కర్తలు గ్రహించి తమకు అనువుగా మలచుకొన్నారు

విరాట పర్వం పేరుతోపాటు 'కీచక వధ' అనే పేరుకూడ ఈ నాటకానికున్నట్లు కుండలీ కరణంలో స్పష్టం చేశారు పాండవులు మారువేషాల్లో విరటుని కొల్వులో చేరడం మొదలు ఉపకీచకులను సంహరించడం వరకు గల ఇతివృత్తాన్ని నాటకకర్త స్వీకరించాడు 5 అశ్వాసాల్లో 2 అశ్వాసాలు పూర్తిగాను 3వ అశ్వాసంలో ఉపకీచకుల వధ మాత్రం గ్రహించి నాటకంగా రాశారు కాబట్టి ఈ నాటకానికి విరాటపర్వం అనడం కంటే 'కీచకవధ' అని అనడమే ఉచితం

తిక్కన భారతంలోని కథకు, నాటక కదకు కొన్నిచోట్ల వ్యత్యాసం కన్పిస్తున్నది

1 పాండవులు మారువేషంలో విరాటరాజు వద్ద చేరిన పిదప ద్రౌపది సైరంధ్రీవేషంలో సుదేష్ణ వద్దకు చేరినట్లు మూలంలో ఉంది

దీనిని నాటక కర్త కాలానుగుణమైన మార్పు చేసినట్లు తెలుస్తోంది భారత కాలానికి స్త్రీరక్షణ బాధ్యత పెద్దగా పట్టించుకొన్నట్లు లేదని భావించిన నాటక కర్త - పాండవుల కంటే ముందే ఆమెను సుధేష్ణ వద్దకు సైరంధ్రిగా పంపినట్లు మార్చినాడు పైగా ఆమెకు రక్షణగా సహదేవుని పంపినట్లు కూడా రాశాడు

"ఇంక వేషంబులు ధరియించి పోవుదము సహదేవా! నీవు ఈ ద్రౌపది వెంటనంటి అమె సుధేష్ణ మందిరంబు చేరిన వెంటనే యిందొచ్చి చేరుము జాగ్రత్త! అనగా నకులుడు అలాగే వెళ్ళివచ్చెదను"[1] అనును ఇది మూలమునకు భిన్నంగా చేసిన రచన దీనివల్ల నాటక కర్త స్త్రీ రక్షణ బాధ్యత నకులునకు అప్పజెప్పి, ఆమె ముందు సుధేష్ణ గృహంలో చేరేంతవరకు దూరము నుండి రక్షణగా వెళ్ళినట్లు, తర్వాత పాండవులు ఒకరొకరుగా వెళ్ళి విరాటుని సభలో చేరినట్లు మార్పు చేయడం వల్ల ద్రౌపది ఒకటే మిగిలిపోయి, ఏకాంతంగా ఉండే దృశ్యాన్ని నాటక కర్త పరిహరించినాడు

2 పాండవులకు ధౌమ్యుడు సేవాధర్మము తెలిపే ఘట్టము నాటక కర్త పూర్తిగా తొలగించాడు

3 ద్రౌపది సైరంధ్రీ వేషంతో రాజవీధిలో పోవడం, చుట్టూ చేరిన జనాలు ఆమెను ప్రశ్నించడం అందుకు ఆమె సమాధానంగా

**"ఏనుగట్టు వాలుదాన నాకెవ్వరు**
**కడుపుకూడు బెట్టి కట్టంజీర**
**యిచ్చి సాకతమున నేలుదురట్టివా**
**రలకుఁ బనులు సేసి మెలగుబుద్ధి"[2]**

వచ్చితి అని చెప్పి రాజమందిరము చక్కటికి నరుగుచుండగా రమ్యహర్మ్యము తుది నిలువున ప్రణయ సఖులతోడ విహారాస్పదమగు నెలవున మెలగెడి సుధేష్ణ ద్రౌపదిని చూచి ప్రౌఢాంగనలిద్దరిని పంపి తన వద్దకు తోడ్కొని తెమ్మని చెప్పినట్లు మూలంలో కలదు

నాటకంలో సైరంధ్రి రాజవీధిలో సుధేష్ణ మందిరం ఏది అని చాతుర్వర్ణాలవారిని అడుగుతూ పోతున్నట్లు పాత్ర ప్రవేశం జరిగింది

పాట - ఆది -

"చూపరారె సూదేష్ణ గృహము ॥చూ॥

1 విరాటపర్వం వ్రాతప్రతి - చూడు పుట - 191

2 శ్రీ మహాభారతం - ప్ర ఆ పద్యం - 298 పుట -59

చూపరె బ్రాహ్మణ సుందరాంగులార
యీపట్లనెనరుంచి భూపాలు దేవి గృహము ॥చూ॥
రాజసౌధములా రంజిల్లు క్షత్రియ
రాజవదనులార! రాజదేవి గృహమునాకు ॥చూ॥
మాటలు తేటలా నీటగు వైశ్య
బోటులార యా విరాటు దేవి గృహము ॥చూ॥
వేములపల్లె హరి ప్రేమ గల్గినా శూద్ర
భామలార మత్స్యభూమీశు దేవి గృహము ॥చూ॥

మాట –

ఓ కొమ్మలార యా సుధేష్ణ గృహము యచ్చట నున్నదో తెల్పరమ్మా"[1] ఇట్లు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులను అడుగుతూ పోతూండగా చూచిన సుధేష్ణ నాపేరడగుతూ వచ్చే ఆమె ఏవరై ఉండవచ్చునని తన కుమార్తె అగు ఉత్తరనడగడం, సైరంధ్రిని వర్ణిస్తూ, ఉత్తరా! నీవు పోయి ఆమెను తగు వినయముతో పిలుచుకరమ్ము, అనగా ఆమె తోడ్కని వచ్చినది సుధేష్ణ ఉత్తరల సంభాషణ నాటకోచితం కాబట్టి మూలంలోలేని కల్పన చేయవలసి వచ్చింది

సుధేష్ణ సౌధానికి వచ్చే సందర్భంలోగల సైరంధ్రి, ఉత్తరల సంభాషణ నాటకంలో మాత్రమే ఉంది మూలంలో వారి ప్రస్తావన లేదు మూలంలో ద్రౌపది మేడ ఎక్కి సుధేష్ణతో మాట్లాడినట్లున్నది నాటకంలో "అమ్మా! నేను చాలా దూరము నుండి నడిసి అలసియున్నాను ఈ మేడ ఎక్కన్ జాల మీతల్లినే రమ్మన వమ్మా ఉత్తరా!"[2] అన్నది ఆమె తల్లితో ఆ మాటలు చెప్పగా మేడదిగి వచ్చి ద్రౌపదిని కలుసుకొన్నది ఈ మార్పువల్ల ద్రౌపది రాచరీవికి భంగము కలుగకుండ ఆమె పాత్ర ఉదాత్తత కోసం ఉత్తరను మధ్యలో ప్రవేశపెట్టాడు

4 మూలంలో మల్లుని ప్రవేశం కీచకుని పాత్ర ప్రవేశానికంటే ముందే ఉంది పాండవులు, ద్రౌపది మారు వేషాల్లో విరాటుని కొల్వులో చేరిన పిదప, భీముడు మల్లునితో యుద్ధము చేయు ఘట్టముంది ఆ తర్వాత కీచకుడు పాంచాలిని చూచి మోహించుటకలదు

కీచక వధ నాటకంలో మాత్రం సైరంధ్రిని కీచకుడు చూచి మోహించుట, ఆమెతో సంభాషించుట, తదుపరి తన అక్కయగు సుధేష్ణలో తన మనో నిశ్చయము చెప్పగా కల్లు తెమ్మను నెపముతో సైరంధ్రిని నీవద్దకు పంపెదనని చెప్పి కీచకుని పంపివేసెను అప్పుడు విరాటుని సభకు జెట్టి (మల్లుడు) ప్రవేశిస్తాడు

కథలో ఈ విధమైన మార్పు చేయడానికి కారణమిట్లూహించవచ్చు కీచకుడు ద్రౌపదిని బలాత్కరించి వెళ్ళిన పిమ్మట వెంటనే ద్రౌపదిని కల్లుదెమ్మని పంపించునట్లు నాటకంలో

1, 2 విరాటపర్వం వ్రాత ప్రతి – చూడు పుట – 192 197

చూపినా, ప్రేక్షకులకు వైవిధ్యముండదని భావించి మధ్యలో మల్లుని ప్రవేశపెట్టి, భీమ - మల్లుల యుద్ధము రంగంపై చూపించి ఉండవచ్చు అంతవరకు శృంగారాభాస చూచిన వారికి భీముని వీరత్వం చూచి కొంత ఊరట కల్గడం కోసం కదలో మార్పు చేసి ఉండవచ్చు

5 మూలాని కంటే భిన్నంగా నాటకంలో కీచక పాత్రను ఒక పచ్చి తాగుబోతుగా చూపడానికి ప్రయత్నించాడు కీచకుడు పాడుపాటల్లో కూడ 'బ్రాందీ", "విస్కీ" లాంటి పదాల ప్రయోగంతో ఆ పాత్రను ఒక జానపదనాయకుడుగా చూపడానికి ప్రయత్నించాడు నాటక కర్త కీచకుడు రంగంపై కనిపించిన పిదప

పాట - జుల్వ

**"బ్రాందీ శీషా నీకేల గోషా.**

**రావేలనే నీ షోకుల్ జూప॥**

**శీషాషోకుల్ జూప**

**నీవే గదా మాకుల దైవము॥**

**శీషాకుల దైవము ॥బ్రాందీ॥"[1]**

ఈ పాట పాడి సుధేష్ణను చూడవలెనని వెళ్తాడు ఈ పాట నాటకంలో అతికిన అతుకు లాగా ఉన్నది ఈ పాటలో ఎక్కువగా అన్యదేశాలు వాడడంవల్ల నాటకంలోని భాషకంటే ఈ ఒక్క పాటలోని భాష కొంత ఎబ్బెట్టుగా కన్పిస్తున్నది కాని జానపదుల సంతోషం కోసం ఇలాంటి వాటిని కూడ కవి చొప్పించవలసిందేనేమో!

6 నాటకంలో కీచకుని పాత్రతో పాటు మంత్రి పాత్రను ప్రవేశపెట్టి, వారి సంభాషణ లను నాటకీయంగా మలచినాడు మూలంలో కీచకుడు ఒకడే సుధేష్ణవద్దకు వెళ్ళడం, సైరంధ్రిని చూడడం ఉంది సంవాదం కోసం, నాటకీకరణ కోసం మంత్రిని కీచకునితో పాటు ప్రవేశపెట్టాడు

7 సైరంధ్రి కీచకుని ఇంటికి వెళ్ళునపుడు తన రక్షణకోసం సూర్యుని ప్రార్థించడం, అప్పుడు సూర్యుడు ఒక రాక్షసుని ఆమెకు రక్షణగా పంపగా అతడు అదృశ్యాకారంలో ఆమె వెంట ఉన్నట్లు మూలంలో ఉంది

**"తరణియు దుఃఖితయగున**

**త్తరుణిం గాచుటకు నత్యుగ్రభుజావి**

**స్ఫురణాఢ్యు నొక్క రక్కసుఁ**

**గరుణార్ద్రమనస్కుడగుచు గ్రక్కునబనిచెన్**

వచనము - వాడునుంబని బూని యంబర తలంబున దృశ్యాకారుండై వచ్చినిలిచె"[2]

---

1 విరాటపర్వం వ్రాత ప్రతి - చూడు పుట - 231

2 శ్రీ మహాభారతం - విరాటపర్వం - ద్వితీయాశ్వాసం - పద్యం - 110 - వచనం - 111

నాటకంలో రాక్షసుని పాత్రను రంగంపై ప్రత్యక్షంగా ప్రవేశపెట్టి అతడు బహిర్గతంగా కీచకుని కొట్టినట్లు మార్పుచేశాడు నాటకంలో కీచకుని నుండి విడిపించుకొని సైరంధ్రి విరటుని కొల్వులోకి పోవడం, అక్కడ ఎవరూ రక్షించకపోగా రాక్షసుడు రక్షించినట్లు కల్పన చేశాడు అదృశ్యంగా మూలంలో చెప్పబడిన రాక్షసుని ప్రవేశం నాటకంలో సభలో ప్రవేశించిన సందర్భంలో ప్రత్యక్షంగా చూపబడింది ఇది నాటకీకరణకోసం చేసిన మార్పుగా చెప్పుకోవచ్చు

8 కీచకుడు ద్రౌపది యందలి మోహమున పరితాపము నొందుట, కీచకుడు ఉద్యాన వనంలో విహరించుట, సూర్యాస్తమయ వర్ణన తిక్కన భారతంలో ఉండగా, నాటకంలో వీటిని పరిహరించాడు కథా దృష్టి ముఖ్యమైనందున వీటిని పరిహరించడం ఉచితమే

భీమ కీచకుల యుద్ధం నిశ్శబ్దంగా జరిగినట్లు మూలంలో ఉంటే, నాటకంలో భీమ కీచకుల సంవాదం విపులంగా వర్ణించబడింది

మూలంలో కావలి వారలను పిలిచి సైరంధ్రి కీచకవధ గురించి చెప్పగా, నాటకంలో కావలివారు సైరంధ్రిని ఎవరని ప్రశ్నించడం, అపుడామె కీచకవధ విషయం చెప్పినట్లు చిరుమార్పు చేశాడు

కీచకుని మరణానంతరం సుధేష్ణ, సైరంధ్రిల సంభాషణ అతి పేలవంగా నాటకంలో ఉంది

"సుధేష్ణ గూబవలెను వచ్చి కొంపలెల్లను గూల్చ

మా బాగా యుండునే మాలిని ఓసి మాలిని

సైరంధ్రి కొంపలు గూల్చేటి రంపి తలనుబట్టి గుంటించి పండ్లూడ గొట్టేనే నేను కొట్టేను

సుధేష్ణ పండ్లూడ గొట్టితే పట్నాము వెడలింతు కండ్ల జూడవే కడగండ్ల మారీ ఓ కడగండ్ల మారీ

సైరంధ్రి కడగండ్ల మారీ వై కల్లుదెమ్మని నన్ను చెడుగు కీచకుపాలు జేసితివే నీవు జేసితివే "[1]

పై సంవాదం జానపదులు తమస్థాయికి తగ్గట్టు వాడుకొన్న పదాలనే నాటకకర్త ప్రయోగించినాడు

ఈవిధంగా రామాయణ భారత భాగవతాదులతోపాటు ఇతర కదలు కూడ జానపదులు తమకు అనుకూలంగా అల్లుకొని వీధి నాటకాలను మలచుకున్నారు. అలాంటి వీధి నాటకాలలో వాడే వస్తు సామగ్రి ఎలాంటిదో తర్వాతి అధ్యాయంలో వివరించడం జరిగింది

1. విరాటపర్వం వ్రాత ప్రతి - చూడు పుట - 319

# మూడో అధ్యాయం

# వీధినాటకాలు - వస్తు సామగ్రి

## 3.1. ప్రవేశిక

ఒక కథను దృష్టిలో పెట్టుకొని ఆయా పాత్రధారులు రకరకాల అలంకరణతో, ఆట పాటలతో వీధిలో ప్రదర్శనలిచ్చేవారు ఆయా అలంకరణలు, కిరీటాలు, భుజకీర్తులు, కత్తులు మొదలగునవి కర్రలతో చేయబడి ఉండేవి అవి నగిషీపనితో మెరుస్తుండేవి రంగు రంగుల వస్త్రాలతో అలంకరించుకొని పాత్రకు నిండుదనాన్ని ఆపాదించేవారు పాత్రకు తగిన రంగులను, కిరీటాలను వాడుతూ చూపరులకు పాత్ర ప్రవేశంలోనే ఒక అవగాహన కల్గేటట్లు అలంకరణ విషయంలో నటులు శ్రద్ధ తీసుకునేవారు ఇందుకోసం ప్రత్యేకంగా అలంకరణ నిపుణులను పెట్టుకునేవారు ఒకప్పుడు తోటి నటకులే అలంకరణ చేసేవారు ఒకరు వాడిన వస్త్రాలను, కిరీటాలను, భుజకీర్తులను ఇంకొకరు వాడుకునేవారు ఈ విధమైన అలంకరణ సామగ్రి విశేషాలను వివరంగా తెలుసుకొందాం

## 3.2. అలంకరణ

అలంకరణకు సంబంధించిన వస్తువులను వినాయకుని ముందుంచి భక్తి శ్రద్ధలతో పూజించిన తర్వాత అలంకరించుకోవడం ప్రారంభిస్తారు అలంకరణకు ఉపయోగించే రంగులు పూర్వం లభ్యం కావు కనుక వారికి అందుబాటులో ఉన్న వస్తువులనే ఉపయోగించే వారు కొన్నింటిని అంగట్లో కొనేవారు

### 3.2.1. అద్దలం

ఇది ఒక లోహంలా గడ్డగా చందనపు బిళ్ళ ఆకారంలో ఉంటుంది దీన్ని నీళ్ళతో కలిపి రుద్దితే పసుపు, తెలుపు రంగులు కలిసిన ఒక రంగు వస్తుంది దీనితోపాటు రవ్వలవలె మెరుగు కూడ వస్తుంది దీన్ని ముఖానికి వేసుకొంటారు చేతులకు, పెదాలకు కూడా రాసుకుంటారు

### 3.2.2. గడ్డనీలి

ఇది గడ్డగాను, పొడిగాను అంగట్లో అమ్ముతారు దీన్ని కూడ నీటిలో కలిపితే నీలిరంగు

వస్తుంది శ్రీకృష్ణుడు, అర్జునుడు, భీముడు, బలరాముడు మొదలగు పాత్రధారుల ముఖాలకు ఈ రంగులు వాడ్తారు

## 3.2.3. బొగ్గు

జానపదులు వంటచేయుటకు కట్టెలను వాడ్తారు కట్టెలు కాలిపోయిన తర్వాత నిప్పులను పొయ్యి నుండి తీసి నీళ్ళతో ఆర్పి బొగ్గులను తయారు చేస్తారు ఈ బొగ్గులను గ్రామంలో ప్రతి ఇంటి పెరట్లో ఒక కడవలో వేసి దాచేవారు చాకలి, కమ్మరి, కంసాలి మొదలగు వారికిచ్చే వారు ఇలా ఆయా కులవృత్తుల వారికి అవసరమైన బొగ్గులిచ్చి తమ అవసరాలను తీర్చుకునే వారు అంతేగాక ఆ రోజుల్లో బొగ్గుతోనే పళ్లుతోముకునేవారు కాబట్టి ఈబొగు ప్రతి గ్రామంలో అందరికీ ఎప్పుడూ అందుబాటులో ఉండే వస్తువు వీధి నాటకాలు ఆడేవారు ఈ బొగ్గను రాతిబండపై నీళ్ళతో రాచి కాటుకగా, మీసాలుగా, గడ్డాలుగా, దిష్టిబొట్టుగా వాడ్తారు

## 3.2.4. సామలు

ఒక పెనుము*లో నల్లగా సామలు* వేయించి అందులో కొద్దిగా నీళ్ళుపోసి ఉడికిస్తే పాకం వస్తుంది దీన్ని గుడ్డతో టెంకాయచిప్పలోకి వడగడ్తారు చిప్పతో ఎండబెడ్తారు ఈఎండిన పాకంలో నాలుగైదు చుక్కలు నీళ్ళువేసి వేలితో రాస్తే నల్లటి సాందు* వస్తుంది దీన్ని వీధి నాటక కళాకారులు కాటుకగా వాడ్తారు

## 3.2.5. దీపం మసి

మూడు ఇటుకలతో చిన్న పొయ్యిని తయారుచేసి దానిమీద ఒక తవ్వ* ఆముదం పట్టేంత మట్టి ప్రమిద పెట్టి, చిటికెన వేలి మందం వత్తిని తయారుచేసి దీపం అంటిస్తారు వత్తికి పైన రెండంగుళాల ఎత్తులో ఉండేటట్లు ఒక కుండను గాని, మూకుడుగాని అమరుస్తారు ఈ వత్తినుండి వచ్చిన పొగ ఆ కుండకు/మూకుడుకు తేనెరేడలా ఉంటకడు తుంది ఈ ఉంటను ఒక కాగితంలో తీసుకొని, ఒక గిన్నెలో కొద్దిగా ఆముదం పోసి ఈ మసిపొడిని అందులో కలిపితే గట్టిగా వస్తుంది దీన్ని కాటుకగా వాడితే చల్లదనం ఇస్తుంది అంతేగాక కంటి పొరను కూడ తీసేస్తుందనే నమ్మకం ఉంది ఈవిధమైన దీపం మసిని వీధినాటక అలంకరణలో కాటుకగా వాడ్తారు

## 3.2.6. కలబంద సాందు

కలబందను అడ్డంగా కోస్తే జిగురు వస్తుంది ఆ జిగురుకు ఆముదం పూసి దీపానికి

---

* పెనుము వంటకు ఉపయోగించే బాణలి

* సామలు ఇది ఒకరకమైన ధాన్య విశేషం

* సాందు బొగ్గను కాటుకగా వాడితే కంటిజబ్బులు వస్తాయని శాస్త్రీయపద్ధతిలో తయారుచేసుకొన్నది

* తవ్వ 175 గ్రాములు పట్టే కొలత

చూపి వేడి చేసినట్లయితే అది నల్లటి లేహ్యంలా అవుతుంది దీన్ని కూడా కాటుకగా వాడుతారు

## 3.3. ఇంగిలీకం

ఇది ఒక చిన్న డబ్బీలో పొడిగా అంగట్లో లభిస్తుంది ఈ పొడిని నీళ్ళతో కలిపితే ఎరుపు రంగు వస్తుంది ఈ రంగును పాత్రధారులు పెదాలకు వేసుకొంటారు దీన్నే బొట్టుగాను, పాదాలకు పారాణిగానూ వాడ్తారు

## 3.4. అబ్బరకం (అభ్రకం)

ఇది కంగుంది ప్రాంతంలో మరియు మొరపనేలల్లో సున్నపు పొరలాగ దొరుకుతుంది ఈ అబ్బరకాన్ని* రోటిలో వేసి దంచి పొడిగొట్టి పల్చని గుడ్డలో వేసుకొని ముఖం మీద చల్లుకుంటారు ఇది పెట్రొమాక్సు లైట్ల వెలుగులో తళతళమని మెరుస్తుంది ప్రస్తుతం దీనికి బదులు చెమికి వాడుతున్నారు

## 3.5. సపేతా

ఇది తెల్లగా ఉంటుంది ఎరుపు తెలుగు రంగు కావలసినపుడు దీన్ని ఇంగిలీకంతో కలిపి నీళ్ళతో కలుపుకొంటారు దీన్ని స్త్రీ పాత్ర ధారుల ముఖాలకు చేతులకు పూస్తారు



అలంకరణకు రంగుల్ని తయారుచేస్తున్న దృశ్యం

* అబ్బరకం అభ్రకం

## 3.6. భూషణాలు

అలంకరణానంతరం ఆయా పాత్రలకనుగుణంగా తలకు, భుజాలకు, ముఖాలకు ఛాతికి, చేతులకు, నడుముకు, కాళ్ళకు ఆభరణాలను ధరించుకొంటారు స్త్రీ పాత్ర ధారులు చెక్కతో తయారు చేయబడిన పాపిటబిళ్ళ, తలముడికి మధ్య నాగరం, సూర్యచంద్రవంకలు, ముక్కు కుడివైపు పుడక, ఎడమవైపు అడ్డబాకు, మధ్య నత్తు పెట్టుకొంటారు చెవులకు జిమికీలు (జుంకాలు), చెవి అంతటిని కప్పడానికి కర్ణాభరణం ధరిస్తారు మెడకు కంఠాభరణం, చాతిపై వివిధ పతకాలను పాత్రోచితంగా ధరిస్తారు భుజాలకి వంకీలు*, చేతి మణికట్టుకి కంకణాలు, నడుంకి వడ్డాణం, పాదాలకు కడియాలు పెట్టుకొంటారు పాత్రోచితంగా మెడలో మంగళసూత్రం, కాళ్ళకు మెట్టెలు పెట్టుకొంటారు పురుష పాత్రధారులు పాత్రోచితంగా కిరీటం, మకుటం, భుజకీర్తులు, చెవులకు కుండలాలు, చాతిపై కంచుకము, చేతులకు మణిబంధాలు, పాదాలకు కడియాలు, చేతి వేళ్ళకు ఉంగరాలు, తలపాగ, ఇవే కాకుండా పాత్రోచితంగా కత్తి, డాలు, గద, విల్లు, అంబులపొది మొదలైన ఆయుధాలను కూడా ధరిస్తారు ఈ ఆభరణ ఆయుధాలను అత్తి, పనస, పొన్న, బాడిద కర్రలతో తయారు చేయడం విశేషం * వీటికి బంగారు రంగుకాగితాలు అంటించి, పూసలు, అద్దాలు తాపడం చేస్తారు. అవి వెలుతురులో మెరుస్తూ విలువైన భూషణాలవలె కనిపిస్తాయి

### 3.6.1. కిరీటం

వీధి నాటకాలలో ధరించే కిరీటాలు పునుగుకొయ్య, మునగ కొయ్యలతో తయారుచేసి వాటికి కాకి బంగారం అతికించి, అద్దాల బిళ్లలు, పూసలు అమరుస్తారు ఈ కిరీటాలు తయారుచేయడానికి 250 నుండి 300 రూపాయల వరకు ఖర్చు అవుతుంది ఈ కిరీటాలను అమర్చటానికి ముందు తలపై వెంట్రుకల్ని నడినెత్తిపై గుండ్రంగా బంతిలాగా చుట్టి గుడ్డతో కడ్తారు. దీనిని 'బంతిముడి' అంటారు ఈ బంతి ముడిపై కిరీటాన్ని అమర్చి ఒక నల్లగుడ్డతో కిరీటం, తలముడి కదలకుండా తల వెనుకభాగంలో గట్టిగా కడ్తారు దీనికోసం ఆ రోజుల్లో వేషం కట్టేవారు జుట్టు పెంచుకొనేవారు కిరీటాలు రెండు రకాలు దుర్యోధనుడు, ధర్మరాజు మొదలగు విశిష్ట పాత్రలు ధరించేవి పెద్దవిగా అందంగా ఉంటాయి రెండో రకం కిరీటం చిన్నదిగా అందంగా ఉంటుంది దీన్ని బంతి ముడి లేకనే తలకు గట్టిగా అమరుస్తారు కంగుంది వీధి నాటకాల పితామహుడు చిత్తేరి మునస్వామి స్వయంగా తయారుచేసి తాను ధరించిన కిరీటం (కొయ్యది) ప్రస్తుతం రవీంద్రభారతిలో ఉంది * ఈ వీధి నాటకాల్లో పాత్రధారులు ధరించే కిరీటాలు అనేక రకాలుగా ఉంటాయి

---

* వంకీలు బాహుబంధాలు

* ముఖాముఖి శ్రీ ఎస్ క్రిష్ణమూర్తి – వయసు 70 సంవత్సరాలు, కంగా నెల్లూరు

* ముఖాముఖి శ్రీ ఎ ఎస్ నాయుడు - 50 సం॥ వయసు, కొత్తఇండ్లు

3 6 1 1 మానికిరిటం

పలివిరేని మాను* కొయ్యతో తయారుచేసేది మానికిరీటం కొయ్యను ముక్కలుగా చేసుకొని వజ్రంతో కిరీట ఆకారంలో అతుకుతారు దానికి రకరకాల అద్దాలు, బంగారు రంగు కాగితాలు అతికిస్తారు పక్కలో చిలకలు పెట్టి చెంపమీద క్రింద మెడ వరకు కట్టు కుంటారు రాముడు, ధర్మరాజులాంటి మంచి పాత్రలు ఈ కిరీటాల్ని ధరిస్తారు

3 6 1 2 నాగకిరీటం

కిరీటం మధ్యభాగం (ముందువైపు)లో కొన్నింటికి నాగపడిగ బొమ్మను అతికిస్తారు ఈ నాగపడిగగల కిరీటాలను దుర్యోధనుడు, కీచకుడు, రావణుడు లాంటి దుష్టపాత్రధారులు ధరిస్తారు

3 6.1.3. అరకిరీటం

కిరీటానికి పైభాగాన ఉన్నకుప్పిని తొలగిస్తే అరకిరీటమవుతుంది దీన్ని దుశ్శాసనాదులు వాడ్తారు

3 6 1 4 సాధారణ కిరీటం

కాలక్రమేణ బుట్ట కిరీటాలు, అట్టకిరీటాలు వచ్చాయి ఇవి సాధారణ కిరీటాలు వీటికి వెనుకవైపున రేకుతో చేసిన ప్రభను అమరుస్తారు ఇవి మెరవడానికి బంగారు రంగు కాగితాలు, కాకి బంగారం అతికిస్తారు

3 6 1.5. మకుటం

దీనినే సిగరేకులని కూడా అంటారు ఇది గుండ్రంగా ఉండి వంపులు తిరిగి ఉంటుంది భీముడు, దుశ్శాసనుడు మొదలగు పాత్రధారులు రంగస్థలంపై ఎగిరి దూకడానికి, పల్టీలు* కొట్టడానికి చాలా అనువుగా ఉంటుంది

3 6 1 6 తురాయి కిరీటం

అట్టను నుదురుపై సరిపోయేంత చిన్నదిగా రకరకాల అకారాలతో కత్తిరిస్తారు దానికి బంగారురంగు కాగితాన్ని, కాకిబంగారాన్ని అతికించి పైకొసలో కుచ్చులుగాని, ముత్యాలు గాని పెడ్తారు లేదా వేలాడదీస్తారు ద్రౌపది, గాంధారి, కుంతి తదితర రాణులకు గుర్తింపుగా ధరించేవి తురాయి కిరీటాలు

## 3.7. గిరదాటోపను

పురుషుల కిరీటాలు కదలకుండా కిరీటాల కిందే వాడేది టోపను

* పలివిరేని మాను రెప్పాలిమాను

* పల్టీ రెండు చేతులను నేలపైమోపి, కాళ్ళుపైకెత్తి పక్కకు, ముందుకు గిరికీలు కొట్టడం



వీధి నాటక కళాకారులు ధరించే రకరకాల కిరీటాలు



నాగకిరీటాలు



తురాయి కిరీటం

## 3.8. నొష్టపట్టం

దీనినే నుదుటి పట్టం అని కూడా అంటారు దానిని నుదుట కడ్తారు ఇది లోహ తయారి మామిడి మొగ్గలాంటి హారం

## 3.9. ముత్యాలహారం

ముత్యాల పూసలతో కూర్చికట్టినది ముత్యాలహారం దీన్ని మెడలో ధరిస్తారు

## 3.10. కర్ణభూషణాలు

కిరీటం లేదా మకుటాన్ని ఆనుకొని చెవిదగ్గర కర్ణభూషణాలను అమరుస్తారు వీటిని పలుచని చెక్కతోగాని, అట్టతోగాని తయారుచేస్తారు చెవికి అలంకరించే దానిని కర్ణభూషణం అంటారు దీన్ని పోలిన ఆభరణాన్నే బుగ్గలపై కూడ అమిర్చుకొంటారు వీటిని తుమ్మ, రేగు బంకలతో మెత్తిస్తారు

### 3.11. పతకం

పలుచటి చెక్కతో లేదా అట్టతో పతకం లాగా తయారు చేసి, రంగురంగుల పూసలతో అలంకరించి చాతిపై వేలాడదీసుకొనే ఆభరణం ఇది నాభి వరకు వేలాడుతుంది దీనితోపాటు పూసల దండను కూడ వేసి రెండు కలిసి పోకుండా విడివిడిగా ముడివేస్తారు

### 3.12. బుజకీర్తులు

పాత్రధారుల అంగసౌష్టవాన్ని ద్విగుణీకృతం చేయడానికి అలంకరించే భూషణం భుజకీర్తులు వీటిని కూడ కర్రలేదా అట్టతోగాని తయారుచేసి రంగుకాగితాలు అతికించి పూసలు, అద్దపు ముక్కలు తాపడం చేస్తారు ఇవి రెక్కల ఆకారాన్ని కల్గి ఉంటాఇ పాత్ర పాత్రకు భుజకీర్తుల పొడవు, వెడల్పులలో మార్పు ఉంటుంది

### 3.13. కంకణం / మణిబంధాలు

స్త్రీలు మణికంకణాన్ని, పురుషులు మణిబంధాన్ని ధరిస్తారు వీటిని కూడ చెక్కతో తయారు చేసి రంగు కాగితాలు, అద్దాలు అతికిస్తారు

### 3.14. ఉంగరాలు

కర్రకు పూసలు తాపడం చేసి వేళ్ళ మధ్యగా దారాలతో కట్టి మణికట్టువద్ద ఊడకుండా కడ్తారు

### 3.15. చంద్రహారం

వజ్రవైఢూర్య పుష్యరాగాలతో పొదగబడినట్లు ఉండే హారం చంద్రహారం దీన్ని గాంధారి, కుంతి మొదలగు పట్టపురాణులు ధరిస్తారు

### 3.16 పాట్లాపులు

చెవి కమ్మ నుండి పైకి చెక్కే ఆభరణం దీన్ని నేటి 'చెంపసరాలు' అని చెప్పవచ్చు

### 3.17. ముక్కెర / ముక్కు పుల్లలు

ఇవి ముక్కుకు స్త్రీ పాత్రలు ధరించేవి

### 3.18. రెట్టపట్టీలు / రెట్టవంకీలు

స్త్రీల భుజాలకు కట్టేవాటిని రెట్టవంకీలు, పురుషుల భుజాలకు కట్టే వాటిని రెట్టపట్టీలు అంటారు

## 3.19. జడపట్టీ

దీన్ని చెక్కతో తయారుచేస్తారు చెక్కను 'జడ' ఆకారంలో బిళ్ళలుగా తయారుచేసుకొని వాటిని ఒక దారంలో కూర్చి రంగు కాగితాలు అతికిస్తారు దీన్ని స్త్రీ పాత్ర ధారులు వాడ్తారు

## 3.20. కిర్రుమెట్లు / కిరుకుమెట్లు

చెప్పులకు ముందువైపు వంపుగా పైకి లేపి దానికి కుచ్చుకడ్తారు ఈ రకమైన చెప్పులను రాజు పాత్రధారులు ధరిస్తారు

## 3.21. వడ్డాణం

గుడ్డతో ఒక పట్టలాగా చేసి ముందు వైపు పూసలు కుట్టి ఉన్న దాన్ని వడ్డాణం అంటారు దీన్ని 'బంగారు డాబు' అని కూడ పిలుస్తారు దీన్ని స్త్రీ పురుషులిద్దరు నడుముపై కట్టుకొంటారు

## 3.22. ఆయుదాలు

పాత్రోచితమైన ఆయుధాలను కర్రతో తయారుచేస్తారు వీటికి బంగారు రంగు కాగితాన్ని అతిస్తారు కొన్నింటిని లోహంతో కూడ తయారుచేస్తారు సాధారణంగా కొన్ని స్త్రీ పాత్రలు మరి కొన్ని చిన్నపాత్రలు తప్ప, సూత్రధారుని మొదలుకొని అన్ని పాత్రలు 'కత్తి'ని ధరిస్తారు కర్రలతో తయారుచేసిన ధనుస్సు, గదాయుధం, నాగాస్త్రం మొదలైనవి పాత్రోచితంగా వాడ్తారు వెదురు దబ్బలతో తయారుచేసిన విల్లు, బాణము కాకి బంగారం అంటించి వాడ్తారు ఇవేగాక అంబుల పొదిని అట్టలతో తయారుచేసి ధరిస్తారు



ఆయుధాలు

## 3.23. వస్త్రాలు

వీధి నాటకాలలో పాత్ర ధారులు ధరించే వస్త్రాలు ఒక విశిష్టతను సంతరించుకొన్నాయి సాధారణంగా స్త్రీ పాత్రలు చీరలు, రవికలు, గాజులు, సవరాలు ధరించడం ఉంటుంది కాని పురుష పాత్రలు, దుష్టస్త్రీ పాత్రలు మొదలైన వారి వస్త్రధారణ ఒక పద్ధతి ప్రకారం ఉంటుంది

### 3.23.1. కాలిచెడ్డి (ప్యాంట్)

కాళ్ళు పూర్తిగా కనబడకుండా కాళ్ళకు అతుక్కొని ఉండేలా తెల్లవస్త్రాన్ని కాళ్ళకు చుట్టుకొంటారు లేదా 'ప్యాంటు'ను పోలిన వస్త్రాన్ని కూడ ధరిస్తారు

హాస్య పరిపుష్టికి 'బఫూన్' అను పాత్ర కూడ ఒక నిర్దిష్టమైన దుస్తులను ధరిస్తాడు ప్యాంటు వేసుకొని నడువపైభాగం వరకే చొక్కాను వేసుకొంటాడు శంఖాకృతిగల ఒక కుచ్చులకుళాయి ధరించి ప్రేక్షకులు తనను చూడగానే నవ్వించే విధంగా ఉంటాడు

### 3.23.2. పావడ

వీధినాటకంలోని పాత్రధారి మంచి అంగపుష్టి కల్గి ఉన్నప్పటికీ గంభీరంగా కనిపించడానికి నడుము చుట్టు వరిగడ్డిని ఎంటి*గా చుట్టి ఆపైన తెల్లగుడ్డకాని, రంగు గుడ్డకాని పావడగా కట్టుకొంటారు ఎగిరేటప్పుడు శ్రమ లేకుండా బరువు తగ్గించుకోడానికి తొడలకు అతుక్కొనేటట్లు గట్టి వస్త్రాన్ని చుట్టి దానిపై పావడ కట్టుకోవడం కూడ పరిపాటి

### 3.23.3. అంగవస్త్రం

ఇది మెడకు వేలాడదీసుకొనే అంగవస్త్రం పాత్ర పాత్రకు ఉన్న తేడాని చూపించడానికి దీన్ని ఉపయోగిస్తారు పురుష పాత్రలు పూర్తి చేతులు కల్గిన చొక్కాను ధరిస్తారు చొక్కాతో పాటు షరాయి లేదా శుర్వా* ధరిస్తారు

### 3.23.4. అంచుగుడ్డ

పాదానికి పై భాగంలో రెండు మూడు మడతలుగా చుట్టుకొనే గుడ్డ అంచుగుడ్డ దీనిపై గజ్జెలు కట్టుకుంటారు మణికట్టుపై కూడ ఈ అంచు గుడ్డను ధరిస్తారు సాధారణంగా అంచుగుడ్డ ఏదో ఒక రంగు వస్త్రమై ఉంటుంది

### 3.23.5. కుచ్చుటగొంగడి

అజ్ఞాత వాసంలో సహదేవుడు మారువేషంలో పశువుల కాపరిగా పైన వేసుకొనే కంబళినే కుచ్చుట గొంగడి అంటారు

---

* ఎంటి ఎండు వరిగడ్డిని పురిపెట్టి గుండ్రంగా మోకులాగా తయారుచేసినది
* శుర్వా చూడు పక్కపేజీలో శుర్వాల్

## 3.23.6 కీపాసు

పెద్దపంచె, పట్టుచీరలను కీపాసుగా కడ్తారు పాత్ర వేషధారణకు తగ్గట్టుగా రంగుల్ని ఎంచుకొంటారు అంటే పాత్ర ముఖానికి వేసే రంగును బట్టి వస్త్రాలను ఎంపిక చేస్తారు

## 3.23.7. శుర్వాల్

నడుము నుండి మోకాలు వరకు వదులుగా పెట్టి, మోకాలు నుండి పాదం వరకు బిగుతుగా ఉండేటట్లు కుట్టి వేసుకొనే దాన్ని శుర్వాల్ అంటారు బిగుతుగా ఉండేచోట వేసుకోదానికి వీలుగా గుండీలు లేదా పిన్నులు పెట్టుకుంటారు ఈ శుర్వాల్‌ను రాజు పాత్రలకు ఎక్కువగా వాడ్తారు

## 3.23.8. అల్పి

గొంతునుండి ఛాతీమీద, రెండు భుజాలమీద, వెనుక అర్ధవీపుమీద ఇలా అన్ని వైపులా అమరేటట్లు వేసుకొనేది అల్పి రంగురంగుల 'సిల్కు' గుడ్డను తీసుకొని చతురస్రాకారంగా కత్తిరించి, గుడ్డ మధ్యభాగంలో తలదూరేటట్లు ఒక రంధ్రం కుట్తారు ఈగుడ్డ అంచులకు జంగపూసలు* 'ఉలన్'తో కూర్చి, పూస చివరి కుచ్చులను వేలాడదీస్తారు మిగిలిన గుడ్డభాగం మొత్తం 'గోధుమ పూసల'తో వివిధ ఆకృతులతో పూలను కుట్తారు

## 3.23.9. జుల్లి పావడ

నడుం నుండి మోకాలు వరకు వచ్చేటట్లు తగిన పొడవుగల ఒక వస్త్రాన్ని తీసుకొని రెండుగా మడచి, ఒక భాగం పొడవుగా, మరో భాగం పొట్టిగా వచ్చేటట్లు చేసి నడుము దగ్గర కుదించి దారంతో కడ్తారు ఇది మోకాలు క్రింది వరకు ఉండి గిరికీలు కొట్టినప్పుడు వలయాలుగా తిరుగుతుంది ఇది చూపరులను బాగా ఆకట్టుకుంటుంది

## 3.23.10. వాష్‌కోట్

గొంతునుండి నడుంవరకు కప్పి ఉండేటట్లుగా బిగుతుగా వెనుకవైపు దారాలతో కడ్తారు ముందువైపు ఈ 'వాష్‌కోట్' పైన చెమికీబిళ్ళలతో హంస, నెమలి, గరుడపక్షి, చిలుకలు, నాగుపాము మొదలైన బొమ్మలను కుట్తారు భుజంపైన ఎత్తుగా అమరేటట్లు 'వాష్‌కోట్' కింద గుడ్డను దిండుగా కడ్తారు ఈ దిండుపైన అమరిన వాష్‌కోట్ అంచులకు పుర్నీ*ని సుమారు మూడు అంగుళాల పొడవు వదలి వేలాడదీస్తారు ఈ వాష్ కోట్ కిందనుండి

* జంగపూసలు రకరకాల రంగుల్లో 'స్ట్రా' ఆకారంలో గుండ్రంగా, పక్షాలుగా ఉంటుంది కావలసిన పరిధిలో వించుకొని పూసల్లాగా దారంలో కూర్చుకుంటారు

* పుర్నీ సరిగదారం

భుజకీర్తులు కడ్తారు  ఈ వాష్ కోట్ రంగులకు వాటపై కుట్టి ఉండు బొమ్మలకు అనుగుణంగా ఆయా పాత్రల మనస్తత్వాన్ని బట్టి వాడ్తారు



వాష్‌కోట్

## 3.23.11. నడుంపట్టి

వాష్‌కోట్ పైన నడుందగ్గర 'సిల్కు' గుడ్డతో పట్టీగా కడ్తారు  ఈ పట్టీ ముందర 'సిల్కు' గుడ్డతోనే రకరకాల ఆకారాల తోరణాలను కుటి, వాటిపై చమికీ బిళ్ళలతో అందమైన బొమ్మలను కుట్తారు  ఆ తోరణాల అంచులకు మూడు అంగుళాల పొడవు పుర్రీలను వేలాడ దీస్తారు  ఇవి దీపకాంతులలో నిగనిగలాడుతూ ఉంటాయి

## 3.23.12. అరద / ఒడ్డు / పరదాగుడ్డ

పాత్ర వేషధారణకు వెనుకవైపు కట్టిన దారాలు, ముడులు కనిపించకుండా మెడనుండి పిక్కలవరకు అడ్డుగా ఒక గుడ్డను వేలాడదీస్తారు  దీన్నే అరద, ఒడ్డు లేదా పరదాగుడ్డ అనంటారు  ఈ గుడ్డకు చుట్టూ రిబ్బనుతో అంచులు కుట్తారు



పరదాగుడ్డ

### 3.23.13. చేతిగుడ్డ

చేతిగుడ్డకు చిన్న రంధ్రం చేసి చిటికెనవేలుకు లేదా ఉంగరపు వేలుకు తగిలించు కుంటారు ఈ చేతి గుడ్డను ప్రతి స్త్రీ, పురుష పాత్రధారులు తప్పనిసరిగా ధరిస్తారు

## 3.24. శ్రుతి పళ్ళెరం

ఒక కంచు 'పళ్ళెరం' బోర్లించి, దాని మధ్యభాగంలో తేనె మైనం ఉంచి, దానిపైన జొన్నపుల్లను పెట్టి, వేళ్ళను అప్పుడప్పుడు తడిచేసుకొని, ఆ జొన్నపుల్లను మీటుతూ శబ్దాన్ని సృష్టించేవారు దాన్నే శ్రుతిగా వాడేవారు

## 3.25. శ్రుతి తిత్తి / గాలితిత్తి

మేకతోలును తిత్తిలా తయారు చేసుకొని ఇటు ఒక కాలును, అటు ఒక కాలును రంధ్రం లేకుండా కట్టివేసి, మిగిలిన రెండుకాళ్ళకు కాకి వెదురు బుర్రలను అమర్చి, ఒక బుర్రగుండా నోటితోగాలి నింపి బొటనవేలితో మూసి, మరోబుర్ర గుండా వచ్చేగాలి శబ్దాన్ని శ్రుతిగా వాడేవారు తర్వాతి కాలంలో చెక్కతో తయారు చేయబడిన శృతి పెట్టెలు వాడుకలోకి వచ్చాయి

## 3.26. మద్దెల

పనస తుండును మద్దెల ఆకారంగా చేసుకొని, మధ్యలో తొర్రచేసి రెండువైపులా మేకతోలును రెండు మడతలుగా బిగించి కడ్తారు చిటిమిరాయిని పొడిచేసి అన్నపుగంజితో కలిపి ముద్దగా నూరి కరిణి తయారుచేస్తారు గురిగింజ పప్పును నీటిలో సాదనగా వచ్చిన బంకను కరిణి వేయవలసిన చోట పూస్తారు ఆరిన తర్వాత కరిణి పూసి నున్నటి గుండ్రాయితో నాదం వచ్చేవరకు రుద్దుతారు

## 3.27. డగ్గా

మద్దెలను రెండు భాగాలుగా విభజించి కుడి, ఎడమలుగా చేసుకొని, కుడి కొయ్యతుండుతో చేయబడి, ఎడమను డగ్గాగా అంటే సట్టికి మేకతోలుకట్టి వాడేవారు

## 3.28. తాళాలు

కంచుతో చేసిన తాళాలను వాడ్తారు కనీసం రెండుజతల తాళాలను వాడ్తారు

## 3.29. హార్మోనియం

కిందకూర్చొని ఎడమచేతితో గాలి మర వత్తుతూ కుడిచేత్తో స్వరాలు పలికించేది హార్మోనియం తర్వాతి కాలంలో కుర్చీపై కూర్చొని కాలితో గాలిమర వత్తుతూ రెండు చేతులతో స్వరాలు పలికించే 'లెగ్ హార్మోనియం' వాడుకలోకి వచ్చింది



లెగ్ హార్మోనియం

# నాలుగో అధ్యాయం

# వీధి నాటకాలు - రంగస్థలం ప్రదర్శన

## 4.1. ప్రవేశిక

చిత్తూరు జిల్లాలో వీధి నాటకాలను చాలా వరకు వేసవికాలంలో ప్రదర్శిస్తారు ఎందుకంటే రైతులకు వ్యవసాయపనులు పూర్తయి కొంత విరామం ఉంటుంది అంతేగాక వేసవికాలంలో ఇప్పటిలాగ 'కరెంటు', 'ఫేన్ల' సౌకర్యం లేనందువల్ల రాత్రిపూట నిద్రపట్టక ఆరుబయళ్ళలో చల్లని వాతావరణంలో వీధి నాటకాన్ని చూడ్డానికొచ్చేవారు

చిత్తూరు జిల్లాలో ఎక్కువ గ్రామాల్లో ధర్మరాజు గుళ్ళు ఉన్నాయి ఎప్పటికైనా ధర్మం జయిస్తుందని, అధర్మం నాశనహేతువని ప్రజలకు గుర్తుచేయడానికే ఎక్కువగా మహాభారత కథలనే వీధినాటకాలుగా ప్రదర్శించడం జరుగుతూ ఉంది ఈ వీధి నాటకాల ప్రదర్శన జరపడానికి అయ్యే ఖర్చులను గ్రామస్తులందరు విరాళాల రూపంలో సేకరిస్తారు కొన్ని గ్రామాల్లో చీటీలు నిర్వహించి వచ్చిన వడ్డీ డబ్బును ఈ వీధినాటక ప్రదర్శనలకు ఖర్చుచేస్తారు

కొన్నిచోట్ల ధర్మరాజు గుళ్ళకు 'మాన్యాలు' ఉన్నాయి ఆ మాన్యాలను సాగుచేసే వారు ఇచ్చేసొమ్ములో ఆ గుళ్ళదగ్గర భారతం 'పగులు కథ'గా చెప్పించి రాత్రిపూట ఆ కథను వీధినాటకంగా ప్రదర్శిస్తారు పగటిపూట మధ్యాహ్నం 12 గంటలనుండి 6 గంటలవరకు భారతం ఒకరు చదువుతూ ఉంటేదానిని సవిమర్శకంగా పౌరాణికుడు ప్రేక్షకులకు వివరించేవాడు దాన్ని చిత్తూరు ప్రాంతంలో 'పగులు కథ'గా వ్యవహరిస్తారు క్రమంగా చదివే పద్ధతిపోయి హరికథా కాలక్షేపం పద్ధతిలో భాగవతార్ ఒక్కడే రాగతాళబద్ధంగా పాటలుపాడి, కథ చెప్పే పద్ధతి ప్రస్తుతం అన్నిచోట్లా జరుగుతున్నది భాగవతార్‌కు సహకరిస్తూ మద్దెల, తబలా వాళ్ళు, సంగీత విద్వాంసుడు ఉంటారు భాగవతార్‌కు 'పగులు కథ' చెప్పేటప్పుడు ప్రేక్షకులు కానుకలు ఇస్తారు వీటిని 'పొగిడింపు' అంటారు గుడికి చందాతోబాటు భాగవతార్‌కు పొగిడింపు ఇస్తారు ఆ పొగిడింపును తీసుకునేటప్పుడు దాతను ఆశీర్వదిస్తూ భాగవతార్ పొగిడింపును గ్రహిస్తాడు

## 4.2. శిక్షణా కాలం

ఒక గ్రామంలో వీధి నాటకం వేస్తే, దాన్ని చూడడానికి వచ్చిన చుట్టుప్రక్కల గ్రామాలవాళ్ళు ఆ వీధి నాటకం నేర్పిన గురువును తమ గ్రామానికి పిలిపించి వీధినాటకం నేర్పించమని అడిగేవారు కారణం పూర్వం వీధి నాటకాలకు మంచి ఆదరణ, ఆకర్షణ ఉండేది ప్రజలు ఎంతగానో హర్షించేవారు అలాంటి ఆదరణ, ఆకర్షణ, హర్షం తమకు కావాలనే భావన, తమ గ్రామ ప్రజల్లో కూడా వీధినాటకాల ద్వారా చైతన్యం తేవాలనే స్పందన చూసిన వారికి కలగడం సహజం

అలా తమ తమ గ్రామాలకు గురువును రప్పించుకొని వీధి నాటకం నేర్చుకొనేవారు అలా వెళ్ళిన గురువు ఆ గ్రామంలో వీధి నాటకాన్ని వేయడానికి ఎంత మంది ఉత్సాహంతో ఉన్నారో తెలుసుకొని, వీధి నాటకానికి అవసరమైన పాత్రలు అంటే సుమారు 15 మందిని తీసుకొని, 15 నుండి 10 మందికి తగ్గినట్లయితే ఒకరిద్దరికి రెండుపాత్రలు ఇచ్చి వీధి నాటకాన్ని నేర్పించడానికి పూనుకొనేవాడు ఈ విధంగా నేర్పించడానికి నెలకు కొద్ది మొత్తం జీతం, దినసరి ఆహారం, వసతి కుదుర్చుకొని గురువు అక్కడే ఉండేవాడు

శిష్యులందరూ స్నానం చేసి శుభ్రమైన దుస్తులు ధరించి, పూజా సామగ్రితో రాత్రి పూట గురువు వద్దకు వచ్చిన తర్వాత ఇటీవలి కాలంలో "శుక్లాంబరధరం " అను విఘ్నేశ్వర శ్లోకంతోపాటు "సరస్వతీ నమస్తుభ్యం " అనే శ్లోకాన్ని* శిష్యులచే చెప్పించిన పిదప వలయాకారంగా కూర్చోబెట్టి, ఆ వలయం మధ్య గురువు కూర్చొని ఒక్కొక్కరిచే పాత్రల పాటలను పాడిస్తాడు తర్వాత వారి అంగసౌష్టవం, ముఖ వర్చస్సు, విద్యాస్థాయి, గ్రహణ కౌశలం, నేర్పునుబట్టి ఎవరెవరు ఏ పాత్ర వెయ్యాలో నిర్ణయిస్తాడు స్త్రీ పాత్రలు వేసే వారిని జుట్టు పెంచుకోమని, ఋషి వేషం వేసే వారిని జుట్టు, గడ్డం పెంచుకోమని ఆజ్ఞాపిస్తాడు గురువు ఆజ్ఞను అనుసరించి శిష్యులు ఆయా పాత్రలకు సన్నద్ధమవుతారు

ఒక్కొక్క పాత్ర ధారుడు ఒక్కొక్క పుస్తకాన్ని తెచ్చుకొని వారి పాత్రకు సంబంధించిన మాటలు, పద్యాలు, పాటలు గురువువద్ద రాసుకొని ప్రతి రాత్రి గురువువద్ద ఆ కథను నేర్చుకొనేవారు వీలునుబట్టి కొంతమంది పగటిపూట కూడా నేర్చుకొనేవారు ఈ విధంగా సుమారు రెండు నెలలు నేర్పిన తర్వాత గురువు 'వద్దిక' ఏర్పాటు చేస్తాడు సుమారు మూడు నెలలపాటు 'వద్దిక' నిర్వహించి, నటకులు పూర్తిగా నాటకాన్ని నేర్చుకొన్న తర్వాత 'గజ్జెపూజ' ఏర్పాటు చేస్తాడు

ఈ గజ్జెపూజకు గ్రామ ప్రజలంతా వస్తారు దేవుని పటాలముందు గజ్జెలను పెట్టి,

* ఇటీవలి కాలంలో ఈ ప్రార్థనాగీతాన్ని ఆలపించడం ఆచారంగా కనిపిస్తుంది కాని ప్రాచీనకాలంలో ఏ ప్రార్థనా గీతాన్ని పాడేవారో తెలియరావడంలేదు దీనికి భిన్నంగా ఉండొచ్చునని భావిస్తున్నారు

శిష్యులు తెచ్చిన పూజా సామగ్రితో, ప్రసాదాలలో గజ్జెపూజ చేసి, మొట్టమొదట గురువు గజ్జె ఎలా కట్టాలో చెప్పి తాను కట్టుకొని, ఆపై శి.ష్యులకు గజ్జెలు కట్టించి, వచ్చిన ప్రజలకు ప్రసాదం పంచి తిరిగి 'వద్దిక' ప్రారంభిస్తాడు

గజ్జెలను కట్టుకొన్న శిష్యుల్ని వరుసగా నిలబెట్టి అడుగులు ఎలా వేయాలో, చేతులు ఎలా తిప్పాలో గురువు నేర్పిస్తాడు ఆ రోజునుండి రెండునెలల వరకు ప్రతిరోజూ ఇలా 'అడుగుల వద్దిక' నిర్వహించి వీధి నాటకం ఆడటానికి తయారవుతారు

ఈ వీధి నాటకం నేర్చడానికి అందం, గాత్రం లేకున్నా సరే పిల్లలందర్నీ సాయంత్రం వేళ భజన మందిరంలోకి చేర్చి దేవుని భజనలు చేస్తూ, అలాగే ఈ వీధి నాటకాలపాట, మాట చదువురాని వారిని సైతం సాధన చేయమని ప్రోత్సహించి వారిచేత వీధినాటకాలు ఆడించే వారు ఇదంతా ఆ గ్రామంలో అనుభవమున్నవారు గురువుగా ముందుండి చేస్తారు దీనివల్ల ఆ పిల్లల్లో తల్లి, తండ్రి, గురువు, దైవం అనే సద్భావన కల్గి, మంచి చెడుల తేడా తెలిసి, ఐక్యత లాభం ఎరిగి వారంతా ఎదిగితే ఆ గ్రామం ఒక బృందావనంలా అందరి మన్ననలు పొంది, గర్వించదగ్గదిగా గురుతెరిగి, సంఘీభావంలోని సారాన్ని చవిచూస్తారు

## 4.2.1. శిక్షకులు పాటించే నియమాలు

ప్రతి పాత్రధారి తనకు కేటాయించిన నాటకాన్ని కంఠస్థం చేసుకోవాలి

నాటక ప్రదర్శనకు ముందు మూడు నెలలనుండే నాటకం 'వద్దిక' తప్పనిసరిగా ఉంటుంది

వద్దిక ఒక పద్ధతికి వచ్చిన తర్వాత గజ్జెపూజ చేస్తారు

స్త్రీ పాత్ర ధారులు జుట్టును పెంచుకోవాలి

నాటకం విఘ్నేశ్వర పాత్రధారి పాటతో ప్రారంభం కావాలి.

రంగస్థలం మీదికి మొదటిసారిగా పాత్రలు ప్రవేశించే ముందు ఆ పాత్రను గూర్చి వంతగాళ్ళు పాటలో సూచించాలి

## 4.3. ప్రదర్శనా ప్రచారం

చిత్తూరు జిల్లాలో వేసవికాలం గ్రామ దేవతల తిరుణాళ్ళు జరిగేవి ఆ తిరునాళ్ళు జరిగే రోజుల్లో రాత్రిపూట ఆటపాటలు జరిగేవి ఆ ఆటపాటలే కాలక్రమంలో వీధినాటకాలుగా ప్రసిద్ధికెక్కాయి అప్పుడప్పుడు ఉత్సవాలు, పండుగలు వర్షాకాలంలో కూడా జరుపుకొనే వారు అలాంటి సందర్భాల్లోనూ వీధినాటకాలను ప్రదర్శించేవారు వర్షాలు లేనప్పుడు వర్షాలు రావాలని గ్రామాల్లో వ్యాధులు (అమ్మవారు) సోకకూడదని కూడ వీధి నాటకాలను ఆడేవారు గ్రామాల్లో ఎవరైనా మరణిస్తే వారి కర్మకాండ రోజున కూడ వీధినాటకాలను

ప్రదర్శించేవారు ఈ వీదినాటకాలను గుడి ముందుగాని, మైదానంలోగాని లేక నాలుగు వీధుల కూడలిలోగాని ప్రదర్శించేవారు కాలక్రమంలో వీటికి నాటక పందిళ్ళు ఏర్పాటు చేయబడ్డాయి వీధినాటకాలను ప్రదర్శించడానికి ముందు దానికి తగిన ప్రచారం చేయడం అవసరం గ్రామ తలారి ద్వారా 'దండోరా'[1] వేయించి, ప్రదర్శింపబోవు నాటకాన్ని, నాటక బృందాన్ని, ప్రదర్శనా స్థలాన్ని ప్రచారం చేసేవారు ఈ రోజుల్లో మైకుల ద్వారా ప్రచారం చేస్తున్నారు

## 4.4. రంగస్థలం

వీధుల్లో ప్రదర్శించే నాటకాలను వీధినాటకాలుగా చెప్పుకొన్నాం అంటే ఎలాంటి నిర్మిత రంగస్థలం లేని ప్రదేశంలో ఒక రంగస్థలాన్ని అప్పటికప్పుడు తాత్కాలికంగా ఏర్పాటు చేసుకొని వీధి నాటకాలను ప్రదర్శిస్తారు వీరికి వీధి రంగస్థలం ప్రేక్షక లోకానికి పాత్రలు, పాత్రల హావభావాలు స్పష్టంగా కనపడాలని మట్టిని ఎత్తుగా పోసుకొని కొంత ప్రదేశాన్ని ఏర్పాటుచేసుకొంటారు కొన్ని సందర్భాల్లో ఈ నాటక ప్రదర్శనకు ఆర్థిక సహాయం చేసిన వారి ఇండ్ల ముందర కూడ ప్రదర్శనలిచ్చేవారు ఈ ఎత్తయిన ప్రదేశం పై మూడు వైపులనుండి నాటకాన్ని చూడటానికి వీలుండేటట్లు పందిరి వేసేవారు నాలుగు వైపుల నాలుగు వెదురు 'గుంజ' (కట్టె)లను పాతుతారు ఆ గుంజలపైన అడ్డం దుడ్డంగా మరికొన్ని కొయ్యలు వేస్తారు ఈ పందిరిపైన టెంకాయ మట్టలు, తాటిపట్టలు లేదా ఈత చాపలు కప్పుగా వాడలారు పందిరి స్తంభాలకు పచ్చగా టెంకాయ మట్టలను చుట్తారు పందిరి చుట్టూ మామిడి తోరణాలతో అలంకరిస్తారు నేటివలె తెరలు ఆనాడు లేనందువల్ల ఒక గుడ్డపైన కళంకారీ అద్దకం వంటి బొమ్మలు వేసిన దుప్పటిలాంటిదాన్ని తెరగా ఉపయోగించేవారు ఈ విధంగా ఏర్పాటుచేసిన పందిరిలోపలి భాగంలో "బిసపలకలు" (బెంచీలు) అమరుస్తారు ఈ పలకలపైన పాటగాళ్ళు, వంతగాళ్ళు, వాద్యగాళ్ళు కూర్చొని ప్రదర్శనకు సహకారాన్ని అందిస్తారు కొన్ని ప్రాంతాల్లో పందిరికి ఒకవైపు తడికలు అడ్డంగా కట్టి అలంకరణగదిని ఏర్పాటు చేస్తారు అందుకు వీలులేని పరిస్థితిలో గ్రామంలో అనువైనచోట ఎవరి ఇంట్లోనైనా అలంకరణ చేసుకొని ప్రదర్శనా స్థలానికి వస్తారు

## 4.5. ప్రేక్షకుల స్థలం ఏర్పాటు

రంగస్థలానికి ముందువైపు ప్రేక్షకులు కూర్చొని నాటక ప్రదర్శనను చూడడానికి కూడా

1. దండోరా అంటే చాటింపు ఆరోజు జరగబోవు కార్యక్రమాన్ని తప్పెటమీద (డప్పు) దండువారి కోపు కొడుతూ విపరించి చెప్పడం 'ఇందు మూలంగా అందరికీ తెలియజేసేదేమంటే రేపు ఆదివారం కాకుండా ఆపై వచ్చే ఆదివారం మిట్టపల్లె ధర్మరాజుల గుడి దగ్గర యిజయవాడ హరికతదాసు పగలుకత మధాన్నం 2 గంట్లకు చెప్తాడు ఆరాత్రి నుండి పజ్జెనిమిది రోజులు కంగుంది వారు భారతం ఆడ్తారు అందరూ రావాల్సిందహో' అని ఒక వారం రోజుల పాటు దండోరా వేస్తారు

కొన్ని ప్రత్యేక ఏర్పాట్లు చేసేవారు రంగస్థలానికి ముందు వైపు సుమారు మోకాటి లోతు మట్టిని తీసి 'గాడి' తవ్వేవారు ఈవిధంగా ప్రతి రెండడుగుల స్థలాన్ని వదలి, మట్టితీసి 'గాళ్ళ'ను తయారు చేసేవారు రెండడుగుల గడ్డపైన కూర్చోవడానికి ఈత చాపలు లేదా చెక్కపలకలు వేస్తారు ఈ గడ్డపైన కూర్చొని కాళ్ళు ఆ 'గాడి'లో పెట్టుకోవడానికి అనువుగా ఏర్పాట్లు చేస్తారు ఈ స్థలంలో గ్రామపెద్దలు, మునసబు, కరణం, నాటక ప్రదర్శనకు విరాళాలిచ్చిన దాతలు మొదలగు ప్రముఖులైన వ్యక్తుల్ని కూర్చోనిస్తారు ఈ ఏర్పాట్లు నేటి బెంచీలకు ప్రత్యామ్నాయంగా అనుకోవచ్చు వీరికి వెనుకవైపున తక్కిన ప్రేక్షకులు ఎవరికి వారే ఈత చాపలు, గోనెసంచులు తెచ్చి వేసుకొని కూర్చునేవారు

## 4.6. దీపాలంకరణ

రంగస్థలం ముందర రెండువైపుల రెండు వెదురు కర్రలు నాటేవారు ఆ వెదురు కర్రలకు దివిటీలను కడ్తారు ఈ దివిటీలు పొడుగు దివిటీ, ఉంట దివిటీ అని రెండు రకాలు

### 4.6.1. పొడుగు దివిటీ

ఒక గజం వెదురు కర్రకు ముప్పావు వంతు మందంగా గుడ్డచుట్టి, పైభాగం కొద్దిగా గుబ్బగా వదలి, దానికింద అర్థడుగు రోకటి పన్నులాగా రేకుతో బిగిస్తారు గుబ్బమీద పోసే గబ్బు నూనె* కిందికి దిగకుండా అక్కడే మండే దివిటీని పొడుగు దివిటీ అంటారు

### 4.6.2. ఉంటదివిటీ

ఒక మూర వెదురు కర్రకు రెండడుగుల సన్నని కమ్మీని బిగించి, కమ్మీ ముందు భాగం వలయంగా మరో కమ్మీని కంసాలితో తయారు చేయించి, దానికి మందంగా, ఉంటగా గుడ్డలు చుట్టి దానిపై గబ్బునూనె పోసి మండించేదాన్ని ఉంటదివిటీ అంటారు

ఈ దివిటీలను గ్రామం చాకలి చిన్న దుత్తలో గబ్బునూనె పోసుకొని, గరిటెతో ముంచి దివిటీలపై పోస్తూ ఆరిపోకుండా మండిస్తాడు తర్వాత కాలంలో వీటి స్థానంలో 'పెట్రొమాక్సు లైట్ల'ను వేలాడదీసి నాటక ప్రదర్శనలిచ్చేవారు కొన్ని సందర్భాల్లో రాజు, రాణి, నాయకుడు, దుర్యోధన భీమ కంసాదులు ప్రవేశించేటప్పుడు కొంత 'గుగ్గిలాన్ని' వేసి పెద్ద వెలుగును సృష్టించేవారు ఆ మెరుపు వెలుగులో ఆ పాత్రల ప్రవేశం ఒక ప్రత్యేక ఆకర్షణగా ఉండేది రాక్షస పాత్ర ప్రవేశించేటప్పుడు నోటిలో పోసుకున్న గబ్బునూనెను దివిటీలపై ఊది మంటలు పుట్టించి చూసే ప్రేక్షకులకు భయోత్పాతాన్ని కలిగించేవారు

## 4.7. పూజా విధానం

నాటక ప్రదర్శన ప్రారంభించడానికి ముందే ప్రేక్షకులందరూ వచ్చి కూర్చుంటారు

---

1 గబ్బునూనె – కిరసనాయిలు వేపనూనె కానగనూనె, ఆముదం

వాద్యగాళ్ళు, నేపద్యగాయకులు, వంతగాళ్ళు అందరు వారి వారి నిర్ణీత స్థలాల్లో కూర్చొని ఏకోన్ముఖంగా పాట పాడుతారు దీన్నే 'మేళం కట్టడం' అంటారు ఒక విధంగా చెప్పాలంటే నాటకం అతి త్వరలో ప్రారంభమవుతుందనటానికి ఇది సూచన ఈ మేళం కట్టడం తర్వాత ప్రార్థనాగీతం

**శ్రీ గణేశ శివుని కుమార**
**శ్రిత జన వినుత నమోనమో**
**గౌరీనందన గజాననా**
**గిరిజా నందన నిరంజన ॥శ్రీ॥**
**నవరస భరితం నయనానంద కరము**
**వివిధ విషాత్మకము విఖ్యాత చరితము ॥శ్రీ॥**
**వీధి నాటక విధి విధానము**
**సాధనమ్ములకు సన్నిధానము**
**మాధవుని శ్రోత్ర ప్రధానము**
**మనుజులకు ముక్తి ప్రదాయము ॥శ్రీ॥**

అని భక్తి శ్రద్ధలతో పాడ్తారు ఈ పాటను వాద్యగాళ్ళు, గాయకులు, వంతగాళ్ళు కలిసి పాడ్తారు పూజగా కొనసాగే ఈ పాట ప్రారంభంలో ఒక పాత్రధారి తన ముఖం ప్రేక్షకులకు కనిపించకుండా కిరీటాన్ని అడ్డం పెట్టుకొని రంగస్థలం మీదికి ప్రవేశిస్తాడు ఆ పాత్రను అందరూ విఘ్నేశ్వరునిగా భావిస్తారు ఆట మొదలుకు ఈ విఘ్నేశ్వర పూజ తప్పనిసరి చేస్తారు కాలవ్యవధి ఉన్నట్లయితే వినాయక స్తుతితో పాటు సరస్వతీ స్తుతి, శివస్తుతి, గురుస్తుతి, భారతమాత స్తుతి కూడ చేస్తారు పాట పూర్తవగానే రంగస్థలంలో ఉన్న పాత్ర నిష్క్రమిస్తుంది దీన్ని రంగపూజ అని కూడ అంటారు

## 4.8. ఆటమొదలు

పూజానంతరం నాటకం ప్రారంభమవుతుంది నాటకంలో ప్రతిపాత్ర మొట్టమొదట ప్రవేశించడానికి ముందు తెరపట్టేవారు ఆ రోజుల్లో అడ్డపంచెనే తెరగా వాడేవారు తర్వాత క్రమంగా తెల్లవస్త్రం తెరగా ఉపయోగించారు నేడు రంగు వస్త్రాలు, బొమ్మల దృశ్యాలు ఉండే తెరను వాడుతున్నారు ఈ తెరల వెనుకవైపు పాటను ఆలాపిస్తారు

ప్రతి నాటకంలోను మొట్టమొదట విదూషకుడుగాని, చోపుదార్లుగాని, ప్రవేశిస్తారు విదూషకుడ్ని బఫూన్ అనికూడా పిలుస్తారు ఈ విదూషకుడే ఒకొక్కప్పుడు సూత్రధారిగా వ్యవహరిస్తాడు చోపుదారుల ప్రవేశం ఇలా ఉంటుంది

పాట – నాటుకురంజిరాగం – ఆదితాళం

**సోపుదారులు వచ్చిరి సభకు సొంపుమీరగ**

ఏపు మీర దుర్యోధన రాజు సభకు వచ్చు ననుచు ॥సోపు॥
బంగరు సరిగంచు దట్టి సుంగులు జీరాడగట్టి
సింగము లంగించినట్లు చెంగున దాటుచు శృంగారముతో ॥సోపు॥

అని పాడుతూ ప్రవేశించి,

ఓ సభా సదులార! ఈ దినంబున మన రాజాధిరాజయగు దుర్యోధన చక్రవర్తి ఈ కొల్వుకూటంబునకు రాబోవుచున్నవారు కావున కోటలు, కొత్తలంబులు, వీధులు, విపణిమార్గంబులు, రచ్చలు, రచ్చకొట్టంబులు, నాటక శాలలు, నగరులు ఈ విధముగా కస్తూరిచే పూజించి, రంగురంగుల వైభవముగా దిద్ది, పచ్చటి తోరణంబులు కట్టించి, ముత్యాల హారంబులతో శృంగారించి యుండునట్లు హితులు, పురోహితులు, బ్రాహ్మణ, వైశ్య, శూద్ర, క్షత్రియ సకల వర్ణంబులందరూ హాజరై కొలువున యుండవలయును గాన –

పాట – కేదారగౌళరాగం – ఆదితాళం
హెచ్చరికతో నుండుడి సభికులార ॥హె॥
హెచ్చరికతో నుండు డిచ్చలోపల మీర
హెచ్చుగ సభజేర అదిగో వచ్చును రాజు ॥హె॥

ఈవిధంగా పాడుతూ అభినయిస్తూ ప్రేక్షకులకు నమస్కరిస్తారు తర్వాత ప్రదర్శించబోవు నాటకాన్ని గురించి, నటకుల గురించి ప్రేక్షకలోకానికి వ్యావహారిక భాషలో తెలియజేస్తారు

ఒకొక్కప్పుడు నాటకకర్త కూడా విదూషకునితో కలిసి పాల్గొని నాటకాన్ని గూర్చి పరిచయం చేస్తాడు అప్పుడప్పుడు చిన్నచిన్న పాత్రలను ధరిస్తూ ప్రేక్షకులకు కథా వివరణ చేయడమేగాక కథతో పాటు ఆనాటి సాంఘిక, రాజకీయ విషయాలను గురించి చెప్పినవ్విస్తూ వినోదాన్ని కల్పిస్తాడు



చోపుదారులు

## 4.9. ప్రదర్శనా పద్ధతి

చోపుదారులు, విదూషకుడు ఎవరో ఒకరు ప్రవేశించి తన ప్రసంగం ద్వారా మొదటగా రంగస్థలం పైకి రాబోవు పాత్రలను ప్రేక్షకులకు పరిచయం చేస్తాడు రంగస్థలం పైకి ప్రవేశించు ప్రతి కొత్త పాత్ర తెర తొలగించుకొని ప్రేక్షకులకు కనిపించడం ఆనవాయితీ తెరతొలగించిన తర్వాత పాడుతూ ఆడుతూ తన పాత్ర ప్రాధాన్యం గురించి సభికులకు తెలియజేస్తాడు



వీధినాటకాల్లో ఉపయోగించిన

ఉత్తర గోగ్రహణం నాటక ప్రారంభంలో దర్బారుకు దుర్యోధన పాత్రను ప్రవేశపెట్టు సందర్భంలో దుర్యోధనుడు తనను గూర్చి ఇలా పరిచయం చేసుకొంటాడు

పాట - ఆదితాళం

వచ్చెను దుర్యోధనుడిదిగో ఎచ్చుగాను సభకు
వ్చా వీడీతానా యిచ్చతో పాండవులపై
మచ్చరమూనచ్చుగా హెచ్చుగాను ॥వచ్చె॥
పొంకము మీరా వర పంకజా రాగ హస్త
కంకణారుసులా దిశల క్రమ్మగనూ ॥వచ్చె॥
భూరి మాణిక్య కంఠహారము యురమూనా
జారగ వేడక లూరగను ॥వచ్చె॥
బడి బడి వేమూల పల్లె శౌరీని మదిని
చిదముడితో గేలీ చేయుచూను ॥వచ్చె॥

ఒక స్త్రీ పాత్ర, ఉదాహరణకు ద్రౌపది ప్రవేశం ఇలా ఉంటుంది

పాట - త్రిపుట తాళం

**తన విభుడు పిలువ తెర వెడలి**

**వచ్చేనూ ద్రుపదరాజ పుత్రీ**

**అభయ మభయమని అడుగులు తడబడ**

**నభినుతి చేయుచునాధుని ఎదుటా ॥తన॥**

ఈ విధంగానే అన్ని పాత్రలు కథానుసారంగా ప్రవేశిస్తాయి ఇట్లు ప్రవేశించిన ప్రతి పాత్రకూడా తనదైన ప్రత్యేక శైలిలో రంగస్థలంపైకి వస్తుంది ఒక పాత్ర పాడుతున్న పాటను రంగస్థలంపై ఒక వారగా ఉన్న ఇతర పాత్రధారులు వంత పాడుతారు వీరికి మద్దెల విద్వాంసుడు, హార్మోనిస్టు, తాళం గొట్టేవాడు, ముఖ వీణదారుడు, సెహనాయి వాయించేవాడు సహకరిస్తారు



వంతపాడడం

అవసరమైనపుడు విదూషకుడు ప్రవేశించి పూర్వపర కథాంశాలను చెప్పి సమన్వయం చేస్తాడు నాటక ప్రదర్శనకు ఆలస్యంగా వచ్చే ప్రేక్షకుల కోసం ఈ తంతు నిర్వహిస్తాడు రెండు పాత్రలు మొదట కలుసుకొన్నప్పుడు పద్యాలలో దీవెనలుంటాయి ఈ వీధినాటకాల్లో వాడే సంభాషణలు సరళంగా అందరికీ అర్థమయ్యే రీతిలో ఉంటాయి

'బకాసుర వధ' అను వీధినాటకంలో బకాసురుడికి రోజుకు ఒక ఇంటివారు ఒక బండి నిండికి కుడుములు, కూరలు, పాలు, పెరుగు, నెయ్యి, మద్య మాంసంబులుగా గల

భోజన వస్తువుల నిచ్చి, రెండు ఎనుబోతులు, ఒక మనిషిని పంపడానికి ఒప్పందం కుదుర్చుకుంటారు ఆ వంతు ఒక బ్రాహ్మణ కుటుంబమునకు వచ్చింది ఆ కుటుంబమును ఈ విపత్తునుండి రక్షించడానికి కుంతి ఆదేశానుసారం భీముడు బకాసురునికి బండికుంభం తీసుకొనిపోతాడు ఆ సందర్భంలో భీమ బకాసురుల సంవాదం ఇలా నడుస్తుంది

బకాసుర మాట ఎక్కడరా బలిబండి యింకనూ కనుపించలేదు ఒరే మానవాదమా బ్రాహ్మనా

గీతపద్యం

**బ్రాహ్మనాదమ నీవింత భయములేక**
**కుడుచుచున్నావు నాదైన కూడుగూర**
**అహహ మినుమేక చక్ర మగ్రహార వాసు**
**లకు సుల్కి నైతిగా నయు నేను.**

మాట ఒరే బ్రాహ్మనాధమా!

కందపద్యం

**ఇక్కడ నాతో బలుకక నక్కడ జూచుచును**
**బండి డన్నము కుడుముల్ మెక్కెద**
**వది యల్లను నే గ్రక్కించెద**
**నాదు ముష్టిఘట్టిన వలనన్**

మాట ఓరె హీనమానవా బ్రాహ్మనోత్తములు నాకిష్టంబుగా పంపిన మృష్టాన్నంబులెల్లా సంతుష్టిగా భుజింపుచున్నావు ఇట్టి నిన్ను నష్టప్రాణునిన్ జేసి నీ రక్తంబు నాకిష్టంబు తీరునట్లుగా ద్రావుచున్నాను నా ముష్టి గటినంబు చూడరా మానవాదమా

భీముడు – కందపద్యం

**నీ ముష్టి గట్టనకు నా రోమం బల్లాదద**
**య్యె రోమం చెలా సామజిరద**
**ఘట్టనకును భీమంబగు సింహ**
**మహహ బెదురు నెదనుజా**

ఆ పాత్రలు దారి పొడవునా నోట్లో కిరసనాయిలు పోసుకొని మంటల్ని పుట్టిస్తూ హాహాకారాలు చేస్తూ వస్తారు. సాధారణంగా ఈ పాత్రలను రాత్రిపూట రెండుగంటలపైన ప్రవేశించేటట్లు నాటకాన్ని ప్రదర్శిస్తారు ఇక్కడ గమనించాల్సిన విషయం ఒకటుంది ఆ సమయంలో ప్రేక్షకులందరూ నిద్రావస్థలో ఉంటారు వారందరిని నిద్రలేపడానికి ఈవిధమైన పాత్రల ప్రవేశం దోహదం చేస్తాయి

## 4.10. ఆటముగింపు

ఈ వీధినాటకాలను రాత్రి పదిగంటలకు ప్రారంభించి సూర్యోదయం వరకు ప్రదర్శిస్తారు నాటక ప్రదర్శన పూర్తికాగానే ఈ క్రింది మంగళ గీతాలతో ముగిస్తారు

ఆదితాళం

**మంగళం బిదే మాదవా మురారీ ॥మం॥**

**సెన్నకేశవా నిన్ను వేదితీమీ**

**సన్ను తాంగరారా సమయమీదే బ్రోవా ॥మం॥**

**బాలులంత గూడి పూలతోట జేరీ**

**పూలు గోసి మిమ్ము పూజ జేతుమయ్యా ॥మం॥**

**జేజే భారతమాతుకు జే ॥మం॥**

ఈ వీధినాటకాల్లో ప్రతి పాత్ర తమవంతు పద్యాలను, పాటలను రాగ, తాళ బద్ధంగా పాడుతారు వీటిని గురించి పరిశీలిద్దాం

## 4.11. రాగాలు / తాళాలు

వీధినాటకంలో శాస్త్రీయ సంగీతానికి కూడ ప్రాముఖ్యం ఉంటుంది జానపదులుగా గ్రామీణ ప్రాంతాల్లో నాటకాలుగా ప్రదర్శించేవారు చక్కని సంగీత పరిజ్ఞానం కలిగి



ప్రత్యేకపద్ధతిలో జెట్టి ప్రవేశం

ఉంటారు గురు ముఖతః నేర్చుకొని ఉండడం వల్ల, పక్కనే వాద్య సహకారం ఉండడంవల్ల సంగీతంలోగల పెక్కు రాగాలను నటకులు బాగా నేర్చుకొని సాధన చేసుకుంటారు పాటపాడడంలో ఏదైనా లోపం వస్తే 'హార్మోనిష్టు' తన యంత్ర సహకారంతో ఆ లోపాన్ని

బహిర్గతం కాకుండా పూరిస్తాడు రసోచితంగా పాత్రలు రాగాలను ఆలపిస్తాయి కరుణ రసానికి వేరుగా, వీర బీభత్స రౌద్రాలకు వేరుగా వేరువేరు రాగాలతో పాటలను నటకులు స్వయంగా పాడుతారు రంగస్థలం మీదికి తెరతొలగించుకొని కొన్ని పాత్రలు ప్రవేశిస్తాయి మరికొన్ని ముఖ్య పాత్రలు, దుష్టపాత్రల ప్రవేశం ఇంకో రకంగా ఉంటుంది భీమ, దుర్యోధన, దుశ్శాసన, బకాసుర, హిడింబి మొదలగు పాత్రలు ధరించేవారు కొన్ని సందర్భాలలో ఊరిబయట అలంకరణ చేసుకొంటారు ఆ పాత్రల్ని ప్రవేశపెట్టేటప్పుడు ముందు తప్పెట్లు వాయిస్తారు పాత్రల వెంట అనేకులు వస్తారు ఆ పాటను అందుకొని అదే రాగంలో పునశ్చరణ చేస్తారు వీధి నాటకంలో పద్యాలను కూడా రాగయుక్తంగా పాడతారు దీర్ఘమైన పద్యాలను పాడడం వల్లే తిరుపతి వేంకటకవులు మొదలగువారు పద్య నాటకాలను ఆరోజుల్లో రచించారు వీధి నాటకాల్లో అక్కడక్కడ స్తుతి పద్యాలు, కందార్థాలు, దీవెన పద్యాలు, సీసపద్యాలు ఉన్నాయి వీటిని రాగయుక్తంగానే పాడతారు

1 శ్రీరంజని
2 భాగేశ్వరి
3 కళ్యాణి
4 కేదారం
5 మోహన
6 మాయా మాళవగౌళ
7 శోకావళి
8 కామాక్షి
9 తోడి
10 ఆనందభైరవి
11 మధ్యమావతి
12 మాండు
13 మాండుగర్భ
14 హంసధ్వని
15 సావేరి
16 నాటు

తదితర రాగాలు వీధి నాటకాల్లో వాడుతారు కొన్ని రాగలక్షణాలు ఇలా ఉంటాయి

## 4.11.1. శ్రీరంజని

ఇది ఖరహర ప్రియ అను 22వ మేళ కర్తయొక్క జన్యము

ఆరోహణము - సరిగమపదనిస

అవరోహణము - సనిదప మగరిస

ఇది అన్ని వేళల పాడదగిన రాగం దీన్ని హిందూస్థానీ సంగీతమున 'భాగే' అని పిలుస్తారు దుఃఖరసంగా ఉండేది ఆరోహణ అవరోహణ శబ్దాలతో పూరించినది శ్రీ రంజని రాగం

ఉదాహరణకు తనకు తలనొప్పిగా ఉన్నదని, తన తమ్ముడైన కీచకుని మందిరంలో ఉన్న మద్యం తెమ్మని, సైరంధ్రితో సుదేష్ణాదేవి కపట బుద్ధితోపని చెప్పగా మనసులో బాధపడుతూ సైరంధ్రి పాడే పాట-

**న్యాయమే నమ్మా. నీ వీటుబల్క న్యాయ మేనమ్మా ॥న్యా॥**
**న్యాయమే నమ్మా తోయజదళనేత్రి పాయక**
**పొరుగిండ్ల పనులకు ననుబంప ॥న్యా॥**

## 4.11.2. కళ్యాణి

65వ మేళ కర్త కటపయాది సంఖ్యలో ఇముడుట కొరకు 'మేచ' అను పదము 'కళ్యాణి' ముందు అమర్చబడి 'మేచ కళ్యాణి' అను నామధేయంతో పిలువబడుచున్నది

ఆరోహణము - సరిగమపదనిస

అవరోహణము - సనిదపమగరిస

ఆరోహణ క్రమంలో పూర్తిగా పోకుండా అవరోహణకు దిగిపోవడం కళ్యాణి అన్ని వేళలా పాడదగురాగం కానీ సాయం సమయం పెద్దరాగం సమంజసం

ఉదాహరణకు సైరంధ్రి కీచకుని మందిరానికి మద్యమునకై వెళ్ళేముందు భగవంతుని స్మరించేపాట -

**ఓం నమో నారాయణాయ భాస్కరాయ భవ్యచరితాయ**
**పరమ పావన పాప వినాశన రక్షింపుము**
**రక్షింపుము ఓ సూర్యదేవా॥**

## 4.11.3. కేదారం

ధర శంకరాభరణయను 29వ మేళకర్త యొక్క జన్యం కేదారం

ఆరోహణము - సరిగమపనిస

అవరోహణము - సనిపమగరిస

ఉదాహరణకు శ్రీ కృష్ణుడు రాయబారిగా వెళ్ళేటపుడు పాడే పాట

**వారణాపురికే తెంచెను వాసుదేవుడు**

కౌరవులకు నీతూలొప్ప కయ్యమూ వలదనుచూ చెప్ప
వారణాపురికే తెంచే వాసుదేవుడు॥

### 4.11.4. మోహన

హరి కాంబోజి అను 28వ మేళకర్త జన్యం మోహన రాగం

ఆరోహణము - సరిగపదస

అవరోహణము - సదపగరిస

వర్జరాగం, ఔడవరాగం, సర్వస్వర గమకవరిక రాగం

హిందూస్థానీ సంగీతమున ఈ రాగానికి 'భూప్' అని పేరు అన్నివేళల పాడదగును రాత్రివేళ పాడుట సమంజసం ఎక్కువగా శ్లోకాల్లో, పద్యాల్లో ఉపయోగిస్తారు

ఉదాహరణకు రాయబారిగా వెళ్ళివచ్చిన శ్రీకృష్ణుడు కుంతితో చెప్పిన ద్విపద -

వినువమ్మా కుంతి యావిమల ప్రశాంతి జని నేను కురువంశ జననాదు సుతుల అర్ధరాజ్య భాగ మిమ్మటన్న యా మూర్ఖుడు సుయోధనుడు సూది మోపనంత భూమి నివ్వననియే॥

### 4.11.5. మాయామాళవ గౌళ

15వ మేళ కర్తరాగం అగ్ని అను 3వ చక్రమునకు చెందినది

ఆరోహణము - సరిగమపదనిస

అవరోహణము - సనిదప మగరిస

సంపూర్ణరాగం, రక్తిరాగం, సర్వస్వర గమకవరిక రాగం ప్రాచీన రాగం అన్ని వేళల పాడదగు రాగం సంగీత కళకు పునాదియగు రాగం కర్ణాటక సంగీత విద్యార్థులు ఈ రాగాన్నే ప్రథమంలో నేర్చుకొంటారు

హిందూస్థానీలో దీనిని పోలిన రాగం 'భైరవ' రాగం పెక్కు జన్యరాగ సంతానం కల జనక రాగం దీనికి మాళవగౌళ అని పేరు తర్వాత 15వ మేళముగా సరిదిద్దుట వలన మయా అనుపదం చేర్చబడి మాయా మాళవగౌళ రాగం అయ్యింది

ఉదారణకు శ్రీకృష్ణరాయబారంలో శ్రీకృష్ణుడు పాడే పాట -

విశ్వరూపము జూపెనిపుదు శ్రీకృష్ణమూర్తి ॥విశ్వ।

అశ్వని దేవగణేశ్వర భవముఖ శాశ్వత కోటి మునీశ్వర కోటితో ॥విశ్వ॥

### 4.11.6. తోడి

8వమేళ కర్తరాగం నేత్రచక్రమను రెండవ చక్రంలో రెండవ మేళ కర్తరాగం

కటపయాది సంఖ్యకొరకు 'షను' అను పదము 'తోడి' అను నామము మొదటకూర్చి 'షనుమతోడి' అని పిలువబడుచున్నది

ఆరోహణము - సరిగమపదనిస

అవరోహణము - సనిదపమగరిస

సంపూర్ణరాగం, జన్యరాగ సంతతిగల జనకరాగం రక్తిరాగం పెద్దరాగం అన్నివేళల పాడదగిన రాగం దాదాపు 700 సంవత్సరాల క్రితం ఉత్తరం నుండి దక్షిణానికి వచ్చి సొంత రాగంగా మారింది శ్లోకం, పద్యాలకు వాడుతారు

ఉదాహరణకు "వారణావతం'లో హిడింబాసురుని చెల్లెలు హిడింబి అను 'కమల పాలిక' భీముని చూచి పాడే పాట -

ఇది ఎంతపని నాకు ఇతని వరించుట మదిరాక్ష పదపదవే ॥

నాదగు విద్య మహిమ తెలుసుగదవే ॥

## 4.11.7. ఆనందభైరవి

ఇది నటభైరవి అను 20వ మేళకర్త రాగజన్యం

ఆరోహణము - సగరిగమ పదపస

అవరోహణము - సనిదపమగరిస

భాషాంగరాగం అన్యస్వరము ఆరోహణా అవరోణములో చేర్చబడిన రాగాల్లో ఇది ఒకటి లాలిపాటలు ఈ రాగంలో పాడదగును

ఉదాహరణకు 'సారంగధర'లో చిత్రాంగి సారంగధరుని మోహింప, సారంగధరుడు తగదని వేడుకొనుట -

**జననీ శ్రీ నడతలునే గనలేకనుమూడుడగుచు**
**గ్రక్కున నిటకున్ చనుదెంచి నీ ముద్దుల**
**తనయుని మోహింప నీకు తగదు పూబోణి ॥**

## 4.11.8. మధ్యమావతి

హరికాంభోజి అను 28వ మేళకర్త జన్యరాగం మధ్యమావతి

ఆరోహణము - సమగమపదనిస

అవరోహణము - సనిదపమగరిస

ఇది దేశ్యరాగం 200 సంవత్సరాల క్రితం సంగీతంలో ప్రవేశించిట్లు తోచును త్యాగరాజుకు ముందు ఎవరూ రచించలేదు హిందూస్థానీ సంగీతమున దీన్ని 'ఖమాస్ ఠాట్' అంటారు

ఉదాహరణకు 'హరిశ్చంద్ర' నాటకంలో ప్రార్థన తర్వాత రంగస్థలంమీద ప్రవేశించిన భార్యా భర్తలు పాడినపాట -

సూ  రావే రావే రావే నటీ రాకేందు వదనా

నటి  ఏల ఏల ప్రాణనాథానను బిలిచిన కారణము

సూ  చూడు సఖీ చూడు సఖీ సభ ఈ సభ ఆనందము

నటి  చూసితిని ప్రాణనాదా ఈ సభా వినోదము ॥

## 4.11.9. హంసధ్వని

ధర శంకరాభరణమను 29వ మేళకర్త రాగజన్యం హంసధ్వని

ఆరోహణము - సరిగపనిస

అవరోహణము - సనిపగరిస

ఔడవ రాగం వర్జరాగం 'గని' జీవ స్వరాలు సభారంభంలో పాడదగ రాగం ఇందులో రాగాలాపన హంస నడకలాగా సాగుతుంది

ఉదాహరణకు 'సారంగధర'లో తన కాళ్ళు చేతులు నరుకుటకు భటులు అడవికి తీసుకెళ్ళినపుడు రత్నాంగితో సారంగధరుడు పాడేపాట -

**తల్లిరో ఇటులేల తల్లడిల్లు మహత్తి**
ఇంక జాగగు పురికేగు మమ్మా॥

## 4.11.10. సావేరి

మాయామాళవగౌళ అను 15వ మేళకర్త యొక్క జన్యం సావేరి రాగం

ఆరోహణము - సరిమపదస

అవరోహణము - సనిదపమగరిస

ఔడవ సంపూర్ణరాగం వర్జరాగం రక్తి రాగం 9 నుండి 12 గంటల వరకు గాని లేక రాత్రిగాని పాడుటకు తగిన రాగం కరుణరసం వెదజల్లు రాగం నాటికలు, నృత్యనాటిక లందును పాడబడును

ఉదాహరణకు 'హరిశ్చంద్ర' నాటకంలో కాలకౌశికుడనే బ్రాహ్మణుడు వీధిలో పాడుకుంటూ పోయేపాట -

కరువున పడియుంటి కడుపారనే తింటి

ఏ వ్  పప్పుదప్పలము ఉప్పు ఊర్గాయి

కడుపార నే తింటి॥

### 4.11.11. నాటురాగం

చలనాట అను 36వ మేళకర్త జన్యం నాటురాగం

ఆరోహణము – సరిగమపదనిస

అవరోహణము – సనిపమరిస

సంపూర్ణ ఔడవరాగం వర్జరాగం సాయం సమయమున పాడదగురాగం

ఉదాహరణకు 'హరిశ్చంద్ర' నాటకంలో వీరబాహుని రంగస్థల ప్రవేశపాట –

**కల్లుముంత మాయమ్మనిన్ను మరువజాలనే – తల్లీ**
**కల్లు కెళ్ళేటపుడు మనము కలసిపోదుము**
**మళ్ళా వచ్చేటపుడు మనము మాటలాడము ॥కల్లు॥**

### 4.11.12. ఆదితాళం

తక్కధిమిత తక్కతైత తధింత తక తధిమిత నడకతో సాగేది ఆదితాళం

ఉదాహరణకు 'పాండురాజు వేట' నాటకంలో పాండురాజు పాడే పాట

వేటలాడగ వెడలెను రాజేంద్రుడు వేటలాడగ వెడలె ॥వేట॥

వేటలాడగ వెడలె వేడుక మీరగ బోటి చెంచులు తన వెంబడి నడవగ ॥వేట॥

### 4.11.13. ఏకతాళం

తై తక్ ధిమిత తైతక్ ధిమిత నడకతో సాగేది ఏకతాళం

ఉదాహరణకు 'కనకతార' నాటకంలో అడవిలో తారపాడే పాట

ఎందుపోతివో ఓ కనక సేన ॥ఎందు॥

ఇందెందైన దాగి పరీక్షింతువా ॥ఎందు॥

తప్పేమి జేసానురా మాయప్ప నన్నిటుల

వీడిపోవ నీ మనం బెటుల నొప్పె ॥ఎందు॥

### 4.11.14. జుల్వతాళం

తక్కధిం తక్కధిం తధిం తధిం తక్కధిం నడకతో సాగేది జుల్వతాళం దీన్ని ఎక్కువగా హరికథ, బుర్రకథలోనే వాడతారు సందర్భానుసారంగా ఆటతాళంలో వాడతారు

ఉదాహరణకు విరాటపర్వములో కీచకుడు పాడేపాట –

బ్రాందీ సీసా నీకేల గోషా రావేలనే నీ

షోకుల్ జూప నీవే కదా మా కులదైవము॥

## 4.11.15. జంపెతాళం

తై తకతై తై తకతై నడకతో సాగేది జంపెతాళం

ఉదాహరణకు 'సారంగధర' నాటకంలో చిత్రాంగి తన చెలికత్తెలతో ప్రేమను గూర్చి తెలుపుట -

**హితులార ననుగన్న సకులార గనపుణ్య**
**వతులార పతిజాడ అతివేగ దెల్పా ॥హి॥**
**పటమందు నా ముద్దు పతికాన నైతిని**
**ఏటువంటిదీ మాయ కుటిలాత్ములారా ॥హి॥**

ఈ జంపెతాళంలో వాచికాభినయాలే ఉంటాయి

## 4.11.16 రూపక తాళం

కృష్ణలీలలు (కంసవధ)లో శ్రీకృష్ణుని దగ్గరికి కంసుడు రాయబారిగా పంపిన అక్రూరుడు పాడే పాట -

**ఎంత పుణ్యము గలిగెరా నాకు. ఔరరనేడు**
**ధనము లక్షలకొలది మున్ను దాన ధర్మము చేసితినో**
**మనంబున ఘనంబుగ ధనుజారీ కృష్ణుని దర్శింపగలిగేను ॥ఎం॥**

## 4.11.17 అటతాళం (ఆటతాళం)

విరాటపర్వములో కీచకునితో ద్రౌపది పాడేపాట

**తగునేమన్న పరమగువల జూచియో**
**మగవారు నీలాగు పొగరు మాటలాడ కీచక ఒరే ॥తగునే॥**

## 4.12. భంగిమలు / అడుగులు

నాటకానికి హావభావాలు ముఖ్యం హావభావాలను కాళ్ళు చేతుల ద్వారా, ముఖ కవళికల ద్వారా నటుడు అభినయించి ప్రేక్షులకు రసానుభూతి కల్గిస్తాడు లలితాత్మకమైన నాట్యంలో హస్తముద్రలు, భంగిమలు చూపరులను ఆకట్టుకొంటాయి వీధి నాటకంలో నాట్యానికంటే భిన్నంగా 'అడుగులు' ప్రేక్షకుల మనస్సును రంజింపజేస్తాయి ముఖ్యంగా వీరభయానక రౌద్ర రస పోషణకు ఆటపట్టయిన పాత్రలు వేసే అడుగులు ఆ పాత్రల స్వరూపాన్ని తెలియజేస్తాయి ఉదాహరణకు ధర్మరాజు సాత్విక పాత్ర అతని ప్రవేశం సాధారణంగా ఉంటుంది కాని దుర్యోధన పాత్ర ప్రవేశం అత్యంత అట్టహాసంగా రకరకాల 'అడుగులు' వేసుకుంటూ రంగంపై 'గిరికీలు' కొడుతూ ప్రేక్షకులకు తన ఔన్నత్యాన్ని ప్రకటిస్తాడు అలాగే బక రాక్షసుని పాత్ర తన ప్రత్యేక 'అడుగు'లతో ఆ స్ఫూర్తిని ప్రేక్షకులు

పొందేటట్లు నాటకరంగంపై దూకుతూ, ఎగిరి గంతులువేస్తూ, పల్టీలు కొడుతూ నిర్ణీత అడుగుల క్రమాన్ని లయబద్ధంగా అనుసరిస్తూ తన నటనను ప్రదర్శిస్తాడు ఈ 'అడుగు'లను గురువువద్ద నుండి శిక్షణతో నటుడు నేర్చుకొంటాడు ఇవి స్వయంగా గురువు నేర్పితే వచ్చేవి ఈ అడుగులు నాటకంలో 5 రకాలున్నట్లు తెలుస్తున్నది అవి

1 అడ్డడుగు
2 నిడివడుగు
3 కత్తెరడుగు
4 పెనడుగు
5 ఒంటిమెలికలు

## 4.12.1. అడ్డడుగు

ఎడమకాలుతో నేలను కొట్టడం కుడికాలు ఎడమకాలు ముందుకు చాపి నేలను కొట్టడం అదే కుడికాలు వెనక్కి తీసి నేలను కొట్టడం ఎడమకాలు అడ్డంగా కుడి పక్కకు తీసి నేలను కొట్టడం అడ్డడుగు అంటారు

ఉదాహరణకు 'ద్రౌపది' వస్త్రాపహరణం' నాటకంలో దుర్యోధనపాత్ర ప్రవేశం –
**దుర్యోధన మహరాజు కొల్వుకు త్వరితంబుగ వచ్చెన్**
**వేడుగ మీర కొల్వుకు త్వరితంబుగ వచ్చెన్**
**దుర్యోధన మహరాజు . . కొల్వుకు.**
**కొల్వుకు . . కొల్వుకు ... కొల్వుకువచ్చెన్**

## 4.12.2. నిడివడుగు

ఎడమకాలు ముందుకు పెట్టి, కుడికాలు వెనక్కు తీసుకుని ముందుకు రావడాన్ని నిడివడుగు అంటారు

ఉదాహరణకు 'ద్రౌపది వస్త్రాపహరణం' నాటకంలో దుశ్శాసన పాత్ర ప్రవేశం
**రాజసోదరుడూ వచ్చెను మేలాయానముచూ**
**అంబరమణి తేజంబునగల కిరీటంబును**
**తనదు శిరమున మెరయగ**
**పట్టుగొడుగు లిరుతట్టున పట్టుచు**
**పట్టుగొడుగు పట్టుగొడుగు పట్టుగొ**
**దుగులిరుతట్టున పట్టుచు పట్ట వైభవమున -పట్టభద్రుడై ॥రాజ॥**

## 4.12.3. కత్తెరడగు

వెనక్కి ముందుకి వెనక్కి ముందుకి వేసేది కత్తెరడుగు అంటారు

ఉదాహరణకు 'విరాట పర్వం' నాటకంలో జెట్టివాడు ప్రవేశం

**జెట్టివాడు వచ్చెను విరటుని సభకు ॥జెట్టి॥**
**జెట్టివాడు వచ్చె జనులెల్ల పొగడగ విరటుదున్న సభకు ॥జెట్టి॥**
**జెట్టివాడు వచ్చె జెట్టివాడువచ్చె**
**జెట్టివాడు వచ్చె జెట్టివాడు వచ్చె**

## 4.12.4. పెనదుగు

రెండు పాదాలను ఒక పాదం వెనుక ఒక పాదం పెనవేస్తున్నట్లు ముందు వెనుకలకు నడవడాన్ని పెనదుగు అంటారు ఈ పెనదుగు ఎక్కువగా స్త్రీ పాత్రలు, ధర్మరాజులాంటి సాత్విక పాత్రలు వేస్తారు

ఉదాహరణకు 'శశిరేఖ పరిణయం' నాటకంలో శశిరేఖ పాత్ర ప్రవేశం -

**వెడలేను శశిరేఖ సంతతమొంది ॥వె॥**
**వెడలె పదతులు కుడివడిగ కుడియడమ**
**నడువగ నదుగులిదుచుసు ॥వె॥**

## 4.12.5. ఒంటి మెలిక

చేతులు తిప్పుతూ కుడికాలును జాడించడం ఒంటిమెలిక అంటారు

ఉదాహరణకు 'విరాటపర్వం' నాటకంలో సైరంధ్రికి రక్షగా సూర్యదేవుడు పంపిన మాయారాక్షసుని పాత్ర ప్రవేశం -

**రాక్షసుడరుదెంచెను ఆర్భాటమున ॥రా॥**

**రాక్షసుడరుదెంచె జనులెల్ల చూడగ ॥రా॥**

'కీచకవధ' అనే వీధి నాటక ప్రదర్శనలోని పార్యాంశంతోపాటు రాగతాళ లయలను పాత్రోచితంగా వివరించటం జరుగుతుంది

## 4.13. కీచక వద (విరాటపర్వం) - పార్వ్యాంశం

ఈ కీచకవధ (విరాటపర్వం) వీధినాటకం కంగుంది కుప్పం నాటకాలను నేర్పే గురువు శ్రీ కృష్ణమూర్తిగారి వ్రాతప్రతిని యధాతథంగా తీసుకొని ముద్రించాము ఇందులో మార్పులు, చేర్పులు అక్షర, వ్యాకరణదోషాలు, వాక్యనిర్మాణం మొదలగువాటిని సవరణచేయలేదు

శ్రీరామజయం

విఘ్నేశ్వర ప్రార్థన

శ్లోకం ॥ **శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్ భుజం**

**ప్రసన్నవదనం ధ్యాయే సర్వ విఘ్నోప శాంతయే॥**

పార్వతి ప్రార్థన

**నమ్మితి, నామనంబున సనాతనులైన ఉమామహేశులన్**
**మిమ్ము పురాణ దంపతుల మేలు గదమ్మ పె**
**ద్దమ్మ దయాంబు రాశివి గదమ్మ హరిన్ గతిన్ జేయ**
**వమ్మ నిను నమ్మినవారికి మోక్షము గాద గదమ్మ ఈశ్వరీ ॥ఈశ్వరీ॥**

## కథా ప్రారంభం

పాండవులు – పాట – ఆది

**పాండవులిదిగో వచ్చిరీ వనవాసము గడిపి ॥పాండ॥**
**పాండవులిదిగో వచ్చిరి పంద్రెండోత్సరములు గడిపి**
**అజ్ఞాత వాసము గడుప ఆలోచింపుచూను వేగ ॥పాండ॥**
**దారుణీలో నంభూరి దాముని దలచూచు మదిని**
**ఏరీతి గడుపగలమని యోచించి తమ్ములతోను ॥పాం॥**

ధర్మ మా

తమ్ములార ఆ పరంధాముని కృపచే ఇంతవరకు ఏ ఆపత్తులేక వనవాసము గడిపితిమి గాని

ధర్మరాజు-పాట-రూపకం-ఆట

**ఎంత కష్టము గలిగెను మీకు నా వలన పుడమిలో ॥ఎంత॥**
**నాడు నగరములందు తిరుగు వారలాను అడవిజేర్చి క్రూర**
**బాధలొంద జేసి గట్టుకొంటి ఘోర పాపము ॥ఎంత॥**
**యజ్ఞశేని ఎపుడునైన ఎరుగునా ఈ ప్రారాబ్ధము**

కపట జూదము నను నోడి గాసి నొందించితిని మిమ్ము ॥ఎంత॥
ధరణిలో నంభూరి పురి దాముని కృప దప్పి
మాద్రి తనయులు విలపింప నడవి త్రిప్పితినిక నేను జేతు ॥ఎంత॥

ధర్మ మా
సహోదరులార నావలనగద మీకైవురికి కష్టంబులు సంభవించె

ధర్మరాజు-పాట-ఆది
ఎట్లా నెరవేర్తము తమ్ములార అజ్ఞాతవాస ॥మెట్లా॥
ఎట్లు ఎట్లు ఈ పట్లను, ఆర్వురునట్లు బోవ జనులెరుగకుందురే ॥ఎట్లా॥
శకుని కర్ణ దుశ్శాసనులాడిగ విగటులు మనలను వెదకుచుందురే ॥ఎట్లా॥
ధరవేముల పల్లె. దాముదైన హరి కరుణతో ఎటువలే కాపాడునో హరి ॥ఎట్లా॥

ధర్మ మా
మనమార్వురము ఒకరి కంటబడకుండా ఎట్లు అజ్ఞాత వాసంబు గడుపగలమో చెప్పరయ్యా అనుజన్ములార

అర్జు గీతపద్యం
ధర్మదేవత నీరు స
ద్ధర్మమునకు మెచ్చినంతయు ప్రీతి ఇచ్చినట్టి
వరము. కలుగంగ మనకేమి
వర్తనముల ఎచ్చట నుండిన పరులకు ఎరుగ నగునే॥

అర్జు మా
అన్నా కురుదేశంబుల చుట్టు పాంచాల చేది మత్స్య సాల్వ విదేహ బాహ్లీక సూరసేక కళింగ మగధ దేశంబులు సుభిక్షంబని వింటిమిగద వాటియందు మీకిష్టంబైన చోట ఈ వ్రతంబు గడుపుదమన్నా

ధర్మ మా
సహోదరులార ఇన్ని దేశంబులలో

ధర్మ గీత
నాకు చూడ మత్స్య నరపతి సద్ధర్మవర్తి సుజన హితుడు భూరి బాహు
బలుడు గాన యతని పాలనందరు తగువైన పనుల నిలచుటభిమతంబు

ధర్మ మా
కావున యా విరాట పట్టణంబు చాల సౌఖ్యంబని తోచుచున్నది గాని
తమ్ములార మీరెట్లు విరాట భూధవుని సేవించెదరో ॥తమ్ము॥
యిమ్మాహి వారికి ఎరుక పడక మీరూపంబుల నెటువలెనిక మీరు దాచెదరో ॥తమ్ము॥

మన యాజ్ఞకు లోనై కప్పములు ఇచ్చునట్టి రాజునెటుల కొలతూరో ॥తమ్ము॥
దొరలైయుండియు మీరు వెరచి ధైర్యము దక్కి యొరులెట్లు గొలచెదరో
॥తమ్ము॥
పరుల కంటికి నగు పడక బార్గుడు మున్ను సిరుదొండపండందు
మరుగైయుండిన యట్లు ॥తమ్ము॥
నాడు నగరము వీడి మీ గణతపోనాడి ఏడు వరకు ఎట్లు మీ రణగి
యుందూరు పన్నగేంద్రుడు ఎటుల మనలను గాచునో ॥త॥

ధర్మ మా

సహోదరులార ఈ వేషంబులతో యా విరాటుని ఎట్లు గోలతురు దెల్పండి

అర్జునుడు - కందార్థం

రాజులను గెలచి ధరణీ రాజులకును రాజువగుచు.
రవితేజుడవై తేజిల్లెదు నీవు మహారాజువై
నీవెట్లు మత్స్యరాజు గొలచెదవో
నీవెట్లు మత్స్యరాజు గొలచెదవో రాజసముడగీ యూరకయున్న జనులు
నీ తేజముగని ధర్మరాజాని ఎరుగారే ॥రాజు॥

అర్జు మా

చప్పన్నారు దేశంబుల రాజుల వద్ద కప్పంబులు గొని గొప్పరాజువని కీర్తిబొందిన
నీవెట్లు యా విరాటుని గొలుతువో జెప్పుమా ధర్మనందనా

ధర్మరాజు - కందార్థం

యతి వేషంబున జని. భూపతి మన్ననగాంచి
యతడు ప్రార్థింపగా. హిలి మతితోదుత
దెల్పుదు. నతనికి సత్పున్యకథలు
నర్జున నేనూ ॥స॥ మర్మమెరుగక నన్ను గనుగొనదలచిన
దుర్జనుల పొందు నిర్జించి యుండెద ॥నర్జు॥

ధర్మ మా

కంకు భట్లను నామంబు చే విరాటునకు తగు పురాణములు జెప్పుచు వ్రతంబు
గడుపుదునయ్యా అర్జునా

అర్జు మా

చాలా సంతోషంబాయెను ధర్మనందనా

ధర్మరాజు - కందార్థం

బక కమ్మీరి డింబాసుర నికరములను దృంచినట్టీ
నీ బాహుబలంబిక నెటువలె దాచుకొని యదవకటా

యరుగంగ జెప్పు వయ్యా భీమా ఎరుగంగ జెప్పవయ్యా
భీమ కయ్యమన్నను ఒక్కగడియైనను నిలువావు
అయ్యా నీవెటువలె అనగి యుందువో జెప్పుమయ్యా భీమా ॥

ధర్మ మా

నీ కోపంబు వీడి నీవెట్లు ననగి గొలతువో జెప్పుము భీమా

భీమ – కందార్థం

బంటు తనంబును విడచియు. బంటు దెలసి
దినదినంబు నొక్కొక్క రుచిగా వంటలు
జేయుచు విరటుని ఇంటన్॥ వచియింపుచుందు
ఇందూకులేశా ॥వచి॥ సందేహమేలా నా సాటి మల్లురతోడ
నందందే పెనగి మత్స్యాధీసు మెప్పింతు ॥ఇందు॥

భీమ మా

వలలుండను పేరున విరటుని ఇంట వంటలు జేయుచు వ్రతంబు గడుపుదునయ్యా ధర్మజ

ధర్మ మా

సంతోషము

ధర్మరాజు – కందార్థం

చండగతిన్ రణమున యా
కండలు నోడించి యతని కాండవ వనము
దండత అగ్ని కొసంగిన
॥దండి పరాక్రమము ఎట్లు దాచెదవో చెప్పుమా
అర్జున ఎట్లు దాచెదవయ్యా ఇత్తరి నీవు నీ రూపు
దాచుకొన్నను జనులు యోచింపకుందురే ॥దాచె॥

ధర్మ మా

సకల రాజుల నోడించి కాండవ వనంబు అగ్నికొసంగినట్టి వాడవెట్లు గొలతువయ్యా అర్జునా

అర్జునుడు – కందార్థం

నేను నపుంసక వేషము
బూనుకనటుబోయి మత్స్య భూపతి చెంతన్
మానినుల కాటపాటలు మానితాగతి నేర్పుచుందు మానవనాథ॥
మానవనాద నను మానమేలను నీకు
గాన విద్యలకుని దాన మౌటెరుగావే ॥మానవ॥

అర్జు మా

నేను నపుంసక రూపంబు వహించి విరాటుకన్నెకలకు నాట పాటలు నేర్పుచు వ్రతంబు గడుపుదును

ధర్మ మా

అట్టి నపుంసక రూపంబు ఎట్లు కలిగెనో చెప్పవయ్యా తమ్ముడా

అర్జునుడు-పాట-ఆది

**వినవన్న దెల్పెదాను ధర్మజ నీకు ॥వి॥**
**వినవన్న మును నేను దేవ సభకేతెంచ**
**కనుగొని ఊర్వశి కామింప గోరెను ॥వి॥**
**తల్లి నీ వనుచూను తనయుఁడ నమ్మనే యుల్లమున**
**నను కోర చెల్లునని వేడిన కోపించి**
**యాదేవి శాపంబిడెను నాకు రూపంబు**
**మారి పేడి రూపము వచ్చునన ॥వి॥**
**దివిజ వల్లభుతోడ సవిరలంబుగ జప్ప నది**
**విని నీకిది మేలగునని తాబల్కె ॥వి॥**
**మును మీరు అజ్ఞాతమును సల్పుదురు ఏడు**
**ననుదలచ పేడి రూపము వచ్చునని బల్కె**

అర్జు మా

మున్ను స్వర్గంబునకు బోయినప్పుడు ఊర్వశి నన్ను మోహింప నేనొడంబడ నందున ఆమె శాపంబు నిడెను అట్టి శాపంబున నపుంసకుండనై విరాట కన్యకలకు నాటపాటలు గరపుచు కాలంబు గడుపుదుమన్న

ధర్మ మా

చాలా సంతోషము తమ్ముడా అర్జునా

ధర్మరాజు – కందార్థం

**అన్నా నకులుడ వినుమా**
**ఎన్నడు పరనృపుల గొలచి ఎరుగవు నీవు**
**క్రన్నన నిను జూడగనతి ॥ దుఃఖంబున॥**
**కన్నీ రిదె వెడలంగ జొచ్చె గదరా తండ్రి ॥వెడ॥**
**వదలక నీదు లావణ్యము**
**గనుగొని మధములు నకులుడానికీదేతెంతురో నీకు ॥కదరా తండ్రి॥**

ధర్మ మా

నీవెట్లు ఈ వేషంబు మార్చి గొలతువో జెప్పవయ్యా నకులా॥

నకులుడు - కందార్థం

ఈ క్షణమున నీదు కృపా
వీక్షణమునబోయి నేను విరటుని పాలన్ అశ్వ
శిక్షకుడనగుచు విఖ్యాదక్షుడనై గొలచి యుందు ధర్మతనూజా
॥నేగొల॥ మర్మము తోడ దామగ్రంథి యనుపేర నిర్మముగా దాల్చి
నే గొలచి యుందేదా ॥ధర్మ॥

నకు మా

దామగ్రంధి యనుపేర నశ్వములకు శిక్షకుండనై గొలతును అన్నయ్యా॥

ధర్మ మా

సంతోషము

ధర్మరాజు - కందార్థం

మార శృంగార సుకుమార.
శరీరుండవనుచు - మగువలలోనన్.
దూరక చేరి విరాటుని ॥యూరన్ సహదేవా ఎట్లు యుండెదవయ్యా
॥సహ॥ నిందు వేడుక తోడ నిను జూచి
పౌరులు ఖండితంబుగ నెరుగకుందురే యందైన

ధర్మ మా

యా విరాటునెట్లు గొలతువో చెప్పవయ్యా తమ్ముడా

సహదేవుడు - కందార్థం

గోపాలు వేషమున యా.
భూపాలుచెంతజేరి పురమునగల యా
గోపాలు రభినుతింపగ గో
వుపాలన చేయుచుందు గురుకుల తిలకా ॥చే॥
గురుకుల తిలకా నాకొరకు నీవిటువాలే
పరితాపమునను తొందర బొందనేల. ఓ ॥గురు॥

గీత పద్యం

పశువుల రక్షణయందు తప్పకను. కొన్ని
మహిమలెరుగుదుగాన మా మత్స్య విభుని. ఇట్టి వేషమున నేను గొల్తు కోరి
తంత్రి పాలుండను పేరుచే పార్తివేంద్ర ॥

మా సహ

తంత్రీ పాలుడను పేరున గొలతునయ్యా ధర్మరాజా

ధర్మ మా

తలోధరి ద్రౌపతి

ద్రౌపది – పాట – రూపకం

వందనంబు మీకు బుదా వందితా విలాస సదా
వందితాది నాలి విజయ వందితము నిరంజన
భూభంజనకర వినుమా దయా విలాస మనవి వివరించెద వినుమా ॥వంద॥
రాజరాజ శేఖరా, రాజమాన్య పూజిత భూజనాలి
వినుత దేవా సారస గుణమేరు ధీరసార సాక్ష వీరశూర
వినుమా దయావిలాస మనవి వివరించెద వినుమా ॥వంద॥

ద్రౌప మా

పదివేలు వందనములు ప్రాణేశులార

ధర్మ గీ ప

అంగనామణి నీకు
దీర్ఘాయురస్తు పుత్రపౌత్రాభి వృద్ధి
సద్భోగరస్తు కీరవాణిరో
నీకు సత్కీర్తి రస్తు పుణ్యవతియైన పాంచాలి పుత్రి లేవే

ధర్మ మా

సుఖీభవ చల్లగా వర్ధిల్లవే కోమలీ

ద్రౌప మా

మహాప్రసాదము స్వామి

ధర్మరాజు – పాట – ఆట

నీవెట్లు గొలచేదవే పరులనుజేరి నీవెట్లు గొలచేదవే ॥నీవెట్లు॥
నీవెట్లు గొలచేద యోవారి జాక్షనీ భావింప
యా మత్స్యభూపాలు సతి జేరి ॥నీవెట్లు॥
ఇలలోన గల చుట్టముల నిండ్ల నెరుగాని
జలజాక్షి యా సుదేష్ణను జేరి యొంటిగా ॥నీవెట్లు॥
జననాదు సతులచే పనిగొనుదానవై పనిబూని
విరాట భూపాలుని సతిజేరి ॥నీవెట్లు॥
అందుజేరి దాస్యమొందెదు దానవై కుందుచు నొక
ఏదు కువల ఏసుని ఇంట ॥నీవెట్లు॥
వనిత కాంతలబాసి, జనులాకు కనరాక,
దురునాద్రీశుని మరువక చేపూనీ ॥నీవెట్లు॥

ధర్మ మా

వీరపత్నివై యుండి నౌకరివద్ద దాస్యంబు గొనుదానవు పరుల వద్ద ఎట్లు నీవు పనులు చేయగలవే ద్రౌపతి

ద్రౌపది - కందార్థం

భూవర విను సైరంధ్రీ
భావంబున బోయి విరటు భార్య సుదేష్ణా
దేవికడజేరి నిరతము సేవలు గావింతు భక్తి సాదుగుణాడ్యా
సాదుత్వమునను నక్షయ వలువలిచ్చిన
లక్ష్మి వల్లభుడు మన బాధమాన్పదే నేడు ॥సాదు॥

ద్రౌప మా

సైరంధ్రినై విరాటు భార్య చెంగట పనులు గావింతును ప్రాణేశా

ధర్మరాజు - కందార్థం

భూతలమునందు ద్రుపదుని
కూతురవై. పాండురాజు కోడలనంగ ప్ర
ఖ్యాతి గాంచిన దానవిప్పు
దే తెరగున పరుల గొల్తువు ॥రాకేందునీబాస్యాజెప్పవే రాకేందు
నీ బాస్యా॥ కామినిరో దుర్మార్గుల చేనేమి
నిందలునిక మీద పొందగలవో చెప్పు

ధర్మ మా

పరులచే నిందలు బొందక సుదేష్ణా చెంత ఏమి పనులు గావింతువో చెప్పుము దేవి

ద్రౌ ప పా

మాలినియను పేర మగువ చెంతనుజేరి
చాలగ పనులెన్నో వేళకు దీర్తు ॥మాలిని॥
పన్నీట జలకంబు పరగ నాడించియు చలువ
జేసినయట్టి వలువలు గట్టింతు ॥మాలి॥
బిగువైన గుబ్బలు పిక్కటిల్లగాను. రవి కె
దొడగించియు రంజింపజేతు ॥మాలి॥
కురులు. నున్నగ దువ్వి కొప్పుగట్టింతును.
విరులు గూర్చియు నిండవేడ్క చుట్టుదును ॥మా॥
తిలంబు దిద్దుదు మగువ మోము నాను
కనులందు కాటుక కాంతాకు దీర్తు ॥మాలి॥
వేణి భరణంబులు వెలదికి ధరియించి వేదుకతో
నామెతో గూడి చరింతున్ ॥మాలి॥
తడవు జేయక వేళ భుజియింప జేయించి

విరులా పాన్పుపైన విహరింపజేతూ ॥మా॥
ధరణిలో విచిత్ర దాముని దలచుచు
పదములొత్తి సేవ పణతికి జేతు ॥మాలి॥

ద్రౌప మా

మాలిని యను పేరు వహించి యా ఉదేష్ణా చెంత పనులు గావింతును స్వామి

సంవాదం-పాట-ఆది

ధర్మ పా

కోమలాంగిరో యంత కష్టము వాటిల్లెను
నీకు ఈయేడు అజ్ఞాతవాసమేరీతి గడుపగలవో ॥కోమ॥

ద్రౌప పా

ప్రాణేశ నాకొరకు పరితపింపగనేల.
మన పూర్వఖర్మము ననుభవింపక తీరునే ॥ప్రా॥

ధర్మ పా

రాణివాసమునందు రంజిల్లుచుంటివి
బాసురంబుగ దాసి పనులెట్లు జేతువే ॥కోమ॥

ద్రౌప పా

ధీరులైన మీరు నాతోడు యుండగాను
ఏరీతినైనాను తీరుతు ఈ వ్రతము ॥ప్రా॥

ధర్మ పా

దారుణి యలిగండ్ల దాముడే మనకు తోడు
కామిని మనమింకెట్లు గడతేర్తు మీవ్రతము ॥కోమ॥

ధర్మ మా

ప్రేయసి ఇంకెట్లు నిన్ను ఒంటరిగా విడచి జీవింతుము

ద్రౌప మా

మీరే ఇటువంటి పనులు గావింపుచుండ నేనెంతమాత్రము నాకొరకు భయంబు జెందవలదు ప్రాణేశ్వరా

ధర్మ మా

నీ ధైర్యంబునకు సంతసించితిని కాంత సహోదరులార ఈ ద్రౌపతి సమేతముగా విరాటుపట్టణంబునకు పోవుదము పదరయ్యా తమ్ములార

అందరుము

ఆలాగే పోవుదము అగ్రజా

పాట ఆది

మందరగిరిదారీ మురారీ

॥మందర గిరిదారీ మురారీ ॥మంద॥

కామిత దాయక కరుణాసాగర కరుణతో బ్రోవుము పరమపురుష నా ॥మంద॥

ఆనాడు ప్రహ్లాదు కభయంబిచ్చి, ఆదరించితివి ఆప్తశరణ్య ॥మంద॥

ద్రౌప మా

స్వామి యా విరాటు పట్టణంబింకా నెంతదూరంబున్నది మహాత్మా

సంవాదం–పాట–ఆట

ద్రౌప పా

నడువగా లేనూ యీ మార్గమున ॥నడు॥

నడువలేనడుగూలు తడబడ సాగేను

వొడలెల్లాచె మటాలు బొడమే యీ మార్గమున ॥నడు॥

ధర్మ పా

నడచి నడచి రావే ఈ మార్గమున ॥న॥

నడచి నడచి రావే సరవింద లోచనా.

అడవి విడచి మనము పురము జేరూదాము ॥నడ॥

ద్రౌప పా

రాల్లుతాకీ కాల్లగోల్లలో రక్తంబు వెల్లసాగెను త్రావ నీళ్ళు లేనీ త్రోవ ॥న॥

ధర్మ పా

ఆయాసపడబోకు అతివరో నీవును రాల్లు తాకీనాని గోలిదాబోకుము ॥నడ॥

ద్రౌప ధరణిలో నంభూరి ధాముడౌ శ్రీహరి సాక్షిగా నేను నవనిపైనిక మీద ॥న॥

ధర్మ పా

చెలియరో ఈ బాధ చేకూరే మనకూను ధరణిలో నంభూరి దాముదే గాపాడు ॥నడ॥

ధర్మ మా

ఆయాసం జెందక నిక కొంత దూరంబునడువుము కాంత

ద్రౌప మా

ఇంక కొంత దూరంబైనను నడువ జాలను ప్రాణేశ్వర

ధర్మ మా

అయ్యో దైవంబు నీకెంత కష్టంబు పెట్టెనే ద్రౌపతి

భీము మా

ఈ కష్టంబు నీవు పెట్టినది గాని దైవంబు పెట్టినదిగాదన్నా

ధర్మ మా

నేనెట్లు బెట్టితినో చెప్పవయ్యా భీమ

భీము మా

నీవు జూదంబాడి వోడినప్పుడు దుశ్శాసనుండీ ద్రౌపతిని సభామంటపంబున కీడ్చితెచ్చి మానభంగంబుగావింప వలువలు వూడదీయు వేల ఈ అర్జునుండు మహోదండ వేదండంబు నీయాజ్ఞకున్ జిక్కి నెదిరింప జాలక వెక్కసంబున పందల వలే నిందల కోర్చుకొని యుండితిమిగదా యట్లుగాకున్న నిజభుజాదండ మదీయగాండీవ వియుక్త ప్రచండ భాండంబు దుర్యోధనాది కురుకుమార మండ లంబుల కండకండలు గావించక విడుచునా ఈ ద్రౌపతి కష్టంబు గుడుచునా ఈ ఆపద లన్నియు యుపేక్ష వలన పుట్టినదేగాని దైవంబు బెట్టినదిగాదన్నా

ధర్మ మా

జరుగవలసిని జరుగక మానదు అని శాస్త్రంబులున్నవిగాని ఇందుకు కోపింపవలదు తమ్ముడా భీమా

భీము మా

నీ శాంతంబునకు ఈ ద్రౌపతి కష్టంబునకు నా వొడలంతయు వుడికిపోవుచున్నది గాన

పాట ఏక

నన్నూ పనుపు మన్న ధర్మజా కౌరవులనెల్లా నామ మనసివత్తునగ్రజా ॥నన్ను॥
నన్ను పనుపు మన్న ఈ క్షణములోనే బోయి
నేను మింటి సురులు నుతింప రిపుల ద్రుంచి వత్తువేగ ॥నన్ను॥
ఆర్తరక్షనులైన త్రిమూర్తులడ్డమైనగాని పూర్తిగా
కోపాగ్నికి ఆహుతి గావించి వత్తు॥ నన్ను॥
అడ్డవాక్కులేక తనదు బిడ్డలకును బుద్ధి జెప్పని
గుడ్డిరాజునుపట్టి గంద్ర గొడ్డలితో నరకి వత్తు ॥నన్ను॥
ఈ క్షణమున వేములపల్లె ఈశు కరుణతోడ
కౌరవపక్ష జనుల శకుని కర్ణుల భస్మము గావించి వత్తు ॥నన్ను॥

భీమ మా

అన్నా నాకానతిమ్ము వారిని బరిమార్చి వచ్చెదను అగ్రజా

అర్జు మా

అగ్రజా విను వినుమా మించిన పనికి యోచింపనేల అది యట్లుండ నిమ్ము ఇపుడైన నేమి ఈ భీమ బలోద్దాముండైన భీముండు తన చేతి గదా ఘాతంబుచే ధృతరాష్ట్ర తనూజాత వ్రాతంబుల హతాహతంబుగావించి వచ్చునన్నాడు అతని నైన బంపు లేదేని

పాట ఆది

శలవియ్యావన్నా ధర్మా తనయా నాకిప్పుడేని ॥శల॥

శలవొసంగుమా తులవ కౌరవుల బలిమి మార్చి
గుంపుల బడ గూల్చెద ॥శల॥
ఏల కౌర భూపాల సుతుల శరజాలంబుల. నిర్మూలము జేసెద ॥శల॥
దోషమనక దుశ్శాసనాదుల నాశరముచే నాశము జేసెద ॥శల॥
కాదనకా కాకోధర గిరి శ్రీనాధుడెరుగ దుర్యోధను జంపెద ॥శల॥

అర్జు మా

ఇప్పుడే శలవిమ్ము ఆ కౌరవ శుంఠులను కండలు కండలు గావించి కాక గూక ములకు యిందొనరించెద నన్నా

భీమ మా

ఓ అన్నా వినుము ఈ అర్జునుండాడిన మాటలు వింటివిగద దండి దండోప మాన గదాదండంబు మద్భుజ దండంబునకు వెడలిన ఈరేడు భువనంబులు వడవడవడంకవా భూమండలంబులు దిద్దరి తిరగవా దిగ్గజంబులు మ్రగ్గవా కుల పర్వతంబులు త్రగ్గవా కౌరవులు నన్నెదిరించి నిలతురా నన్ను గెలతురా ఇదిగో దుష్టకష్ట నికృష్టాత్ముండగు దుర్యోధనాది దుష్టచతుష్టయంబును నష్టసత్త్వుల గావించి ఈ నవకండ భూమండలంబునకు నిన్ను దిట్టంబుగా పట్టంబు గట్టి ఈ దుష్ట చతుష్టంబెల్లను నికృష్టంబు గావించెదను నాకు సెలవిమ్ము అగ్రజా

ధర్మరాజు – పాట-ఆట

వలదు తమ్ములార వాదు యిపుడు వైరమునకు
వేలగాదు అజ్ఞాత వాసంబుగడపి యావల
మీరు శత్రువులను బట్టి సంహరింతురుగాని ॥వలదు॥
ధర్మమే జయము నేడు దైవమందరికీ తోడు
ఆరు నెలలకొక్క ఆమడ నడచియు వూరు
ముందర పరువు వుచితంబు కాదయ్య ॥వలదు॥
దారుని సిరులాచే మీరు వెంగటం పల్లె శౌరి
సాక్షిగా మనల చేరు రాజలక్ష్మి ॥వ॥

ధర్మ మా

పగ సాధించను ఇది సమయముగాదు మీ కోపంబులు వీడి శాంతింపుడి సహోదరులార

భీమ అర్జు

మంచిదన్నయ్యా మీ ఇష్టం

నకులుడు – పాట-ఆట

నాకు శలవియ్యవయ్యా ధర్మరాజ ॥నాకు॥

నాకు శలవియ్యుము లోకాము లేకమై
వీకతో వచ్చిన జోకుతో కౌరవ నీకముల కం(డించి వారల నెత్తురును
తలమెదడు (క్రొవ్వును కాక గూక మృగంబులకు
నే కరుణ తోడుత విందు బెట్టెద ॥నాకు॥

సహ పా

వాటమౌ కత్తిచే వనపాలకుడు వేగతాటి కాయలు
కొట్టి ధరగూల్చుకైవాడి సూటిగ దుర్యోధనాదుల నూట
తలలొక వేటునకు తెగ మీటి ఈ భూమండలమునకు మిమ్ము పట్టము గట్టుదు
భళి ॥
నాకు శలవియ్యవయ్యా ధర్మరాజ ॥నాకు॥

సహ మా

అగ్రజా ఈ దుష్టాత్ములైన కౌరవుల నూర్వురను నాచేతి శరంబున తెగించి మిమ్ములపట్టంబు కట్టించి రాజ్యంబు పాలింప జేసెదము మాకు శలవిందు ధర్మరాజా

ధర్మరాజు-పాట-ఆది

యిపుడు వేలకాదు తమ్ముడా కోపంబు చేయ ॥యిపుడు॥
యిపుడు వేలకాదు కాదు యిమ్ము దప్పిన వేలాలందు
నిపునుడైన నవగిమనగి నేర్పుతోడ నుండవలయును ॥యిపుడు॥
ఘణత నాగుపాము మూషకమునకొదగి యున్నయట్లు
తనకు సమయామవుటవరకు తాల్మితోడ నుండవలయును ॥యి॥
ప్రగటితముగ గ్రహచ్చార వేదన ప్రాప్తించి యున్నయిపుడు
తనకు సమయమవుటకు తాల్మితోడ నుండవలయు ॥యి॥
భూమి శ్రీవేమూల పల్లె దాముని రాముని సాక్షిగా
తామసంబు నుండవలయు. దైవ బలము లేనియపుడు ॥యి॥

ధర్మ మా

తమ్ములార నామాటలాలకింపక తొరపడితిరేని మరలా మన మాట ప్రకారము పదమూడు వర్షంబులు ఈ విధంబున కాలంబు గడుపవలసినదేగాన

కంద పద్యం

ధనము గోలుపడిన తనయులు బిడ్డలు
నష్టమైన నెంత కష్టమైన
మానహీనమైన ప్రాణంబు పోయినా
ఆడి తప్పరాదు నవనిలోన

ధర్మ మా

నా మాట లాలకించి శాంతింపుడి తమ్ములార

ద్రౌపది - కందపద్యం

**అగ్రజుని మీద నెంతయు**
**ఆగ్రహమె నరింపనేల అజ్ఞాతంబున్**
**నిగ్రహమున తీర్చియతని య**
**నుగ్రహము వడశి శత్రువుల నుగ్గాడ తగున్.**

ద్రౌప మా

పిత్రు సమానులైన మీ అన్నపై అలుగవలదు ప్రాణేశులార

అందరు మా

అన్నా ఈ ద్రౌపతి కష్టంబు చూడలేక ఇట్లాడితిమిగాని మీపైన కోపంబుగాదు
మీ యాజ్ఞ మీరువారలమా అగ్రజా

ధర్మ మా

అర్జునా నీవు కొంత దూరంబు ఎత్తుకొనుము

ధర్మ పా

**లోక విరోదుల సృజియించి అతి భీకర వరములు హరియించి అంతయు జేసి**
**మరలా సృజింతువు వింతా నీలీలా అనంతాశయన హరి ॥గోవింద॥**

ధర్మ మా

భీమసేన అర్జునుడు అలసినాడు నీవు ఎత్తుకొనుము

ధర్మ పా

**గిరులై వెలసిన వెతలైన నీ కరుణను మారును మంచువలె హరి నీ కరుణా**
**మారిన వేళ సురనాదులైన శిరంబు లొంచవలె ॥గో॥**

ధర్మ మా

భీమసేనా ఇచట విడువుము ఇదిగో విరాటపురంబు సమీపంబు జేరితిమి
ఇచ్చట ఈ నిర్జన ప్రదేశమున మనము నిర్మించుకొన్న వేషంబులు ధరించి ఒకరి
వెనుక నొకరు బోయి యా విరాటు రాజు చెంత జేరుదము
మన యస్త్ర శస్త్రంబులు ఈ శమీ వృక్షంబుపై పెట్టి బోవుదము అన్నియు
మూడకట్టుడు

అంద మా

అలాగే కట్టితిమి మీరు ఈ వృక్షంబు నెక్కుడు మేము అందించెదము

ధర్మ మా

ఓ యస్త్రశస్త్రాధి దేవతలారా నాకును, ఈ అర్జునుని దక్క ఇతరుల చూడ్కులకు

చటుల పటుగటు సర్పంబులవలె గనుపించునట్లు వరంబొసంగరయ్యా తమ్ములార అచ్చట నొక పసరంబు బడియున్నది దాని చర్మంబు వలసి దెచ్చి దీనిమీద గప్పరయ్యా ఈ ప్రేత భూమిగల ఒక కళేబరమును దీనిమీద తెచ్చి పెట్టి కట్టరయ్య

అంద మా

ఆలాగే కట్టితిమన్నా

ధర్మ మా

ఎవరైన నీ తెరంగు అడిగిరేని నూరేండ్లు నిండిన మా తల్లి గతించిన మా కులాచార పద్ధతిని ఈ వృక్షంబుపై పెట్టి పోవుచున్నామని బలుకరయ్యా

అంద మా

ఆలాగే బలికెదమన్నా

ధర్మ మా

యింక వేషంబులు ధరించి పోవుదము సహదేవ – నీవు ఈ ద్రౌపతి వెంటనంటి ఆమె సుదేష్ణా మందిరంబు చేరిన వెంటనే ఇందొచ్చి జేరుము జాగ్రత్త

సహ మా

ఆలాగే వెళ్ళివచ్చెదను

ధర్మ మా

ద్రౌపతి జాగ్రత్తగా నీవు పోయి రాజస్థానంబున నలంకరింపుము

సైరంధ్రి వేషము-పాట-ఆది

బ్రోవా సమయం మిదేరా కరుణాలవాల నను ॥బ్రోవ॥
గజరాజ వరదూని గాసిన వాడావని.
భుజగ శయనా నను బ్రోవ సమయా మిదే ॥బ్రోవ॥

సైరం మా

కృష్ణదేవా ఏ విధమున ఈ వ్రతంబు భంగపడక కాపాడెదవో తండ్రీ

సైరం పా

చూపరారే సుదేష్ణా గృహము ॥చూప॥
చూపరే బ్రాహ్మణ సుందరాంగులార ఈ పట్ల
నెనరుంచి భూపాలు దేవి గృహము ॥చూప॥
రాజసౌధములా రంజిల్లు క్షత్రియ
రాజవదనులార రాజదేవి గృహము నాకు ॥చూ॥
మాటలు తేటలా నీటగు వైశ్యబో
టులార యా విరాటు దేవి గృహము ॥చూ॥

వేముల పల్లె హరి ప్రేమ గల్గినా శూ
ద్ర భామలార మత్స్య భూమీశు దేవి గృహము ॥చూప॥

సైరం మా

ఓ కొమ్మలార యా సుదేష్ణ గృహము యచ్చట నున్నదో దెల్పురమ్మా

పుర మా

ఈ దారినే పోయితివేని ఆ గృహంబు చెంతచేరుదువమ్మా

సుదేష్ణ–పాట–ఆది

పాలకడలి శయనా నారాయణ ॥పాల॥
దీనజనావన దిక్కు నీవేయని
మనమున దలతును మరువక బ్రోవుము ॥పాల॥

సుదే మా.

అమ్మా ఉత్తర ఈ పూజ ఫలహారంబులు మీ తండ్రిగారికి ఇచ్చి రమ్ము

ఉత్తర మా

అలాగే నమ్మా పంపించెదను

సుదే మా

కుమారీ యా వీధిని నా పేరరయుచు వచ్చునామె ఎవరుండవచ్చును

పాట ఆది

కంటిరే వోయమ్మలార వచ్చేటి దాని కంటికేనీ శక్తిధీర ॥కంటి॥
కంటిరే వోయమ్మ కలకంటులారా ఈ వీధిని
వెంట తోడెవ్వారు లేక వొంటిగా వచ్చేటి దాని ॥కంటి॥
రత్నకంకణములు డాలు నడలు వయ్యారద్యుతులు
రమణులార చెప్పతరమా రాయంచలకన్న మేలు ॥కంటి॥
రతియో రూపమందున బార్వతియో మత్సరమున
పార్వతియో శ్రీ విష్ణుదేవుని సతియో యిందొచ్చుదాని ॥కంటి॥
వాసుకి సైనేశ సుతుడు రాసి తీర్చిన రవల ప్రతిమను
చేసి పంపెనేమో ఇటకు వచ్చు దాని చూడరమ్మ ॥కంటి॥

సుదే మా

ఉత్తర అటు జూడవే దాని అందం

కందపద్యం

వనజాతనేత్రి యవరో
జనుచున్నది యటకు మీరు జని మరి ఇటకు
వినయముతోడ తెండిక
మనసయ్యాను దాని గలసి మాటాడుటకున్

సుదే మా

ఆమెను జూచుచుండ దానతో మాట్లాడవలయునని మనసున్నది గాన

పాట ఆది

అది యవ్వరో పిలువరమ్మా నా సదనంబులడుగుచు చనుదంచుచున్నది ॥అది॥
నిద్దమవుయా హేమ చెక్కు టద్దములలో నీడ
జూచియు వద్దికతో మోమునను తిలకము దిద్దవలెనని బుద్ధి పుట్టెనూ ॥అది॥
పూర్ణ శశి బింబముతో మోమును నిర్ణయింపగ వచ్చు
యా చెలి వర్ణమేమోగాని తనువు సువర్ణమునకును సాటి వచ్చును ॥అది॥
ధరణి వేముల పల్లె శ్రీహరి చరణయుగలంబాత్మ
నెప్పుడు మరువకెన్నడు రాజవీధిని మందగతిచే వచ్చుచున్నది ॥అది॥

సుదే మా

ఉత్తర నీవుపోయి ఆమెను తగు వినయముతో బిలుచుకు రమ్ము

ఉత్తర మా

అలాగే నమ్మా పోయి వచ్చెద

సైరం పా

దీనలోక శరణా జగదాభరణా ॥దీ॥
అనురాగమునా కానగలేవా శుజనావలిని బ్రోవగరావ ॥దీన॥

ఉత్తర మా

అమ్మా పదివేలు వందనములు

సైరం మా

సుఖీభవా నీ వెవరమ్మా

ఉత్తర మా

నేను ఈ రాజు కుమార్తెను ఉత్తరను నీవెవరమ్మా

సైరం మా

నేను ఒక విదేశి స్త్రీని దిక్కులేని దానను నా పేరు సైరంధ్రియని బిలతురు కుమారీ

ఉత్తర మా

అమ్మా మా తల్లిగారు నిన్ను పిలువనంపిరి గాన

ఆట పాట

ఇంటికిని పోదాము రావమ్మా బంగారు బొమ్మా ॥ఇంటి॥
ఇంటికిని పోదాము రావే ఇందుముఖి
మాయమ్మ నిన్నును వెంటబెట్టుక రమ్మటంచును

వెలదిరో నను బంపినది మా ॥ఇంటి॥
మందగామిని నిన్నుగని యానందముగ
సుదేష్ణాదేవి సందియంబు లేక ఇపుడు సఖియ నిన్ను కోరినది మా ॥ఇంటి॥
పూని వేములపల్లె నేలిన పుండరీక దళాక్షు సాక్షిగా
మానినీమణి నిన్ను మా దొరసాని రమ్మని బిలిచినది మా ॥ఇంటి॥

ఉత్తర మా

మా తల్లియగు సుదేష్ణాదేవి రమ్మనె రావమ్మా పోవుదము సైరంధ్రి

సైరం మా

అలాగే నడువుము కుమారి పోవుదము ఈ మందిరము ఎవరిదమ్మా

పాట ఆట

యంత సుందరము ఈ గృహము బోగడ యవ్వారి తరము ॥యంత॥
దంతపు తలుపూలు తలతలాతలులు స్వాంతమునకు ఎంతో వింతలై దోచెనూ ॥యంత॥
కొత్త సున్నపు గచ్చు గోడలయందు ఈ చిత్తర్వు రాసిన చిత్రమేమందు ॥యంత॥
నీలాలా స్తంబాలు సాలు పదశాల విశాలము జూచిన సంతోష మొదవెను ॥యం॥
ధరణి విచిత్ర పురాధీశుడిచ్చట క్రీడించునేమో ఈ మేడను జూడగా ॥యంత॥

సైరం మా

ఈ గృహములో మీ తల్లి యచ్చట నున్నదమ్మా

ఉత్తర మా

అంతఃపురమున నున్నదమ్మా

సైరం మా

అటులైన మీ తల్లి ఏమి ఉత్తరమిచ్చునో అడగి రావమ్మా ఉత్తర

ఉత్తర మా .

ఇచ్చటనే కూర్చొనుము అడగి వచ్చెదను

సుదే మా

ఉత్తర ఏది ఆమె వచ్చినదా

ఉత్తర మా

వచ్చినది గాని ఏమి ఉత్తరమిచ్చెదరమ్మ

సుదేష్ణ-పాట-ఆది

సుదే పా

మేదామీదికి రమ్మనవమ్మా ఆ చేడరో ఎవతో ॥మేడ॥
చేడ వినవే ఆ చేడతోడ జతగూడి మాటాడను వేడుక బుట్టెను ॥మేడ॥

**కోటి మన్మథుని కోటీ రతికి పైబోటియు ఇచటికి ఏటికి వచ్చును ॥మేడ॥**

**తల్లిరో వేములపల్లె శ్రీకృష్ణుని చెల్లెలు వలె రంజిల్లుచు నున్నది ॥మేడ॥**

సుదే మా

ఆమెను మేడ మీదకి రమ్మనవే

ఉత్తర మా

అలాగే నమ్మా అమ్మా సైరంధ్రీ మా తల్లి మేడ మీదికి రమ్మన్నారు రావమ్మా

సైరం మా

అమ్మా నేను చాలా దూరము ఉంచి నడచి అలసియున్నాను ఈ మేడ ఎక్కన్‌జాల మీ తల్లినే రమ్మనవమ్మా ఉత్తర

ఉత్తర మా

అమ్మా ఆమెకు చాల ఆయాసముగా నున్నదట నీవే రావమ్మా సుదేష్ణా

సుదే మా

అలాగే వచ్చెదనమ్మా

సైరంధ్రి-కంద పద్యం

**సక్కని మామిడి చిగురుల**

**నిక్కము గనెగ శక్యమాడు నీ పదము**

**లకున్ మ్రొక్కెదనిది గో నాదగు**

**మ్రొక్కులు గైకొనగదమ్మా ముద్ముల గుమ్మా**

సైరం మా

నీకు పది వేలు వందనములు తల్లీ

సుదే పద్యం

**ఆయుర్వృద్దికరం ఆనంద లీలాకరం**

**పుత్ర బ్రహ్మకరం వర్దిల్లు హేమాగ్రినీ దీనచింతామణి॥**

సుదే మా

చల్లగా వర్ధిల్లవమ్మా

సంవాదం-పాట-ఆది

సుదే పా

**యవనకుందన బొమ్మ యవరమ్మ నీవు**

**వివరింపవే యందు వెలది పొయ్యేవు ॥యవ॥**

సైరం పా

**తరుణి మాలిని జాతి దానను నేను య**

**న్వేసింపుచు కూటికై వచ్చినాను ॥తరు॥**

సుదే పా

వనిత ఇన్నాళ్ళు నీవున్నదే వూరు విన
కాంక్షాయెను జెప్పవేమి నీ పేరు ॥యవ॥

సైరం పా

వారిజనేత్రి నా పేరు సైరంధ్రి ఊరింద్రప్రస్తపురము ఓహోపురంధ్రీ ॥తరు॥

సుదే పా

లలనరో నీకు పెల్లాయన లేదా వలచినవాడు నీ కొద్దిగా గాదా ॥యవ॥

సైరం పా

ఇభరాజ గామిని ఏవురు మగలు నభమున గాతురు నను రాత్రి బగలు ॥తరు॥

సుదే పా

ఇరువంద ఇన్నాల్లు ఎవరింట నీవు పరికింప ఏమేమి పని నేర్చినావు ॥యవ॥

సైరం పా

ఏపు మీరగ పాండు వేముల యింట ద్రౌపతి దేవికి దాసినై యుంటి ॥తరు॥

సైరం మా

నా పేరు సైరంధ్రి మా ఊరు ఇంద్రప్రస్తపురంబు పాండవుల పత్నియగు ద్రౌపతి చెంగట నుంటి నా పతులు గంధర్వులు అయివురు గాన నీ వద్ద వ్రతంబు గడుప వచ్చితి తల్లి

సుదేష్ణ – కందపద్యం

నా వద్దనే యుండెదవని
నీవని యెద నేమి పనులు నెరు గుదు
నీవున్ వనజాతనే త్రి దెల్పవే
పావన చారిత్రి పద్మపత్ర సునేత్రి.

సుదే మా

నీవేమి పనులు గావింతువో చెప్పవే సైరంధ్రి

సైరంధ్రి – గీత పద్యం

చాన పరిమలముల గూర్చి చందనం
బు బూయ నేర్తును మిగుల గైసే య నేర్తు తిలక
మును దిద్ది కాటుక దీ యనేర్తు. కురులు దువ్వదు
జడవేతు కొప్పుదీర్తు॥

సైరం మా

అదియును గాక

గీతపద్యం

విరుల గట్టంగ నేర్తును వివిధ గతుల ఆ

**కు మదుపులు మదువంగ నతివనేర్తు వలువ క**
**ట్టింప రవికయు నలువరింప సొమ్ములను బెట్ట నేర్తు**
**నే సుందరాంగి॥**

సైరం మా

ఇట్టి పనులు జేయనెరుంగుదునమ్మా సుదేష్ణా

సుదే మా

అమ్మా ధర్మధర్మాత్ములు పాండవులు, ద్రౌపతిదేవి మహా పతీవ్రతయు దీనాత్ములయందు కరుణగలవారని విన్నాను అట్టి వారిని విడచి వచ్చుటకు ఏమి కారణము సైరంధ్రి

సైరంధ్రి - గీతపద్యం

**పతులు గంధర్వులేవురు పదతి వినుము. జూదమున నోటుబడిన నన్జూచి కలులు కొప్పు బట్టీండ్వంగ నవమానముప్పతిల్ల అడవులకు బోయి బ్రహ్మచర్యా వ్రతంబు॥**

సైరం మా

గైకొనియుండి నీ వద్ద వ్రతంబు గడుప వచ్చితినమ్మ

సుదే మా

పాండవులు ఏమయిరి

సైరం మా

వారును జూదంబున దుర్యోధనునకు వోడి రాజ్యంబు వీడి పంద్రెండు వత్సరంబులు నడవులకు బోవ వారిని బాసి యిందొచ్చితినమ్మా

సుదే మా

ఆహా వారికెంత కష్టము వాటిల్లెను విధి వ్రాతకు ఎవరేమి చేయగలరు నీవీవ్రతము ఎన్ని దినంబులు గడుపవలెను

సైరంధ్రి - గీత పద్యం

**పాండవులవనికేగి పంద్రెండు వత్సరములాయె**
**వత్తురొక ఏడు బాయక వారుమరల**
**నంతవరకుందు నిచ్చట. నవ్వల నుండబోను**
**ఇష్టమెయ్యేది దెల్పుమా యిందీవరాక్షి**

సైరం మా

వారు వచ్చునంత వరకుందుగాని

సంవాదం–పాట–ఆది

సైరం పా

ఇల నా వ్రతము నిండువరకు నిచట నుందునమ్మా నేను పణతి నవ్వల నుండబోను ఇష్టమెయ్యేది కొమ్మా ॥ఇల॥

సుదే పా

ఇందువదన ఏల కొదవ లెంచకొందవె
నీవెందుబోకను. నా మందిరంబందేయుండవే ॥ఇం॥

సైరం పా

మానినీ నా వ్రతము లాత్మమాన నోయమ్మా
నే హీనమైన పనులు చేయబూన నోయమ్మ ॥ఇల॥

సుదే పా

యెపుడు నీకు యెగ్గులు చేయించనోయమ్మా
అపకీర్తియైన పనులకు నంపనోయమ్మ ॥ఇం॥

సైరం పా

ఇరుగు పొరుగు వారిండ్ల కడకు పోవజాలనమ్మా
శేషశైల నాయకు నాత్మలోన మరువనోయమ్మా ॥ఇల॥

సైరం మా

అమ్మా హీనమైన పనులకు ఇరుగుపొరుగిండ్లకు పంపనని నాకు హోనతియ్యవమ్మా సుదేష్ణాదేవి

సుదే మా

అయిన నీ మనసు నొచ్చు నొక మాటనడిగెదను దెల్పవమ్మా సైరంధ్రీ

సైరం మా

అట్టి దేదియో నడుగవమ్మా

సుదేష్ణ – గీతపద్యం

అమ్మ నీ సక్కదనంబునకును మిక్కిలి మోహాంధుడై
నా మనోహరుండు నీ యందు
ప్రేమగల్గునోయని నా సందేహంబు నోదవె
నటుల గాంచిన నీవేమి చేయగలవు

సుదే మా

అమ్మా నీ రూపురేఖ విలాసంబులు జూసి నా విభుండు మోహించునేమోయని నా సందేహము ఇందులకు ఏమి జేతువు సైరంధ్రి

సైరం గీత పద్యం

అమ్మ వినవె సుదేష్ణ సత్యంబుగాను

అవని పతులకు సైరంధ్రి కుమార్తె
వరుసనవుదురేయు. నీ యాత్మ నెరుగు
సందియము మానియుండు మిత్తరుని నీవు

సైరం మా

రాజులకు సేవకురాండ్రు కూతురు వరుస గావలయుగాన నీ సందేహము మానుము తల్లి

సుదేష్ణ – కంద పద్యం

మగువా ఇప్పురమున గల
మగవారలు నీదు పొందు మరగియు తమలో
పగలోదవి తెగు
వ గైకొని శిగపట్లను అవుదురేమి సేయుదు తరుణి॥

సుదే మా

ఇప్పురంబున గల మగవారు నిన్నుచూజి మోహించి వారు వారు తగవు బడుదురేమోయని భయంబగుచున్నది

సైరంధ్రి – గీతపద్యం

చెలియ నా కొరకై చింతచేయనేల
తెలియకెవరయిన నను ముట్ట దలచిరేని దర్పమున
నాదు పతులు గంధర్వవరులు
పట్టి చంపదురాతని పద్మనేత్రి॥

సైరం మా

వారి వారి యపరాధంబులచే వారే చెడిపోవుదురుగాని మీరు మాత్రము

కంద పద్యం

ఎంగిలికి లోనుపనుపక అంగన పొరుగిండ్ల
పనులకనుపక యెపుడున్ సమ్మతితో దుత
మది నుప్పొంగుచు
నన్నేలవమ్మా పుత్తడి బొమ్మ

సైరం మా

కరుణ కటాక్షంబుంచి నాచే తగిన పనులు గైకొనవమ్మా సుదేష్ణా

సుదే మా

అయితే నెచ్చెలివై నీ ఇచ్చవచ్చినట్లు నా యింట నుండి నీ వ్రతంబు నెరవేర్చుకొనవమ్మా సైరంధ్రి

సైరం మా

చాలా సంతోషం బాయెనమ్మా సుదేష్ణా

విరాటరాజు - దర్బారు

పాట -

మత్స్యభపాలుడొచ్చెనూ యాస్థానమునకు ॥మత్స్య॥
మత్స్యభూపుడని మంత్రులు గొలువగ హెచ్చుమీర భటులెచ్చరికలు నిడ ॥మత్స్య॥
తారహారములు మీరి మెరయగను బేరి వాద్యములు బోరున మ్రోయగ ॥మత్స్య॥
వారకాంతలును సారెకు నాడగ బేరురమున మణి హారదారుడై ॥మత్స్య॥
భటవర్గంబులు మలసి కొలువగను కుటిల కుంతలు గొడుగులు బట్టగ ॥మత్స్య॥
దండశూకగిరి దాముని దలచుసు డెందములో ఆనందముగాను ॥మత్స్య॥

విరా మా

మంత్రీ మన అజారంబున గురుప్రదానహిత పురోహిత భటనటగాయ కాదకిల పరివార వర్గంబులందరూ ఆజరైయున్న వారల ఇంక రాజ్యక్షేమంబులు విచారింపవచ్చునా

పాట - రూపకం

విరా పా

మంత్రి శేఖరా పరరాజ ఛేదన. తంత్ర నిపున ॥మంత్రి॥

విరా మా

మంత్రి మన రాజ వార్తలు వినిపింపుము

మంత్రి పా

రాజచంద్రామా మనవి వినుమ వినయంబున వినిపించెద ॥రాజ॥

మంత్రి మా

మన రాజ వార్తలు వినిపించెద వినుడు

విరా పా

కరికయ రథములను బూని
శరచాపధురీనులగుచు నిరతము మన సైన్యమెల్ల
వరభీకరులై యుందురె పరరాజుల గుండెలదుర ॥మంత్రి॥

రాజు మా

వీరశూర పరాక్రములైన మన సైన్యంబుల జూచి భీతిచే మెలంగుదురా శచివా.

మంత్రి పా

శూరులైన మన సైన్యుల జూచి
పరా రాజులెల్లా నిరతము భయంబు చెంది
శరణాగత రక్షణులై సరగున మెలగుదురిలలో ॥రాజు॥

మంత్రి మా

మన సైన్యంబులను జూచి పరరాజులు భీతిచే మెలంగెదరు ప్రభు

రాజు పా

మానసమున భయభక్తులై మరువక మన
రాజప్రజలు కానుక లిచ్చుసు తప్పక కప్పంబులు గట్టువారే ।మంత్రి।।

రాజు మా

మన యాజ్ఞ మీరకుండా గప్పంబులు తప్పక చెల్లించు వారా దెల్పుము

మంత్రి పా

మీరు యాజ్ఞయందు నిలచి నిరతము మన రాజ్య ప్రజలు
కానుక లిచ్చును తప్పక కప్పంబులు గట్టువారు ।।రాజ।।

మంత్రి మా

మనకు కట్టవలసిన కానుకలు తప్పక కట్టుచున్న వారు మహారాజ

రాజు పా

సరగుణ మన గూఢచారులు పరరాజ్యమునను
నిరతము తిరుగుచు మర్మమంబులరయ
సరగున వారల చరితము ఎరిగింపుము వేగంబున ।।మంత్రి।

రాజు మా

గూఢచారులు నిత్యము పరరాజ్యంబుల జరుగు వార్తలు దెల్పుచున్న వారా

మంత్రి పా

నిరతము గూఢచారులు పరరాజ్యము
నందుజేరి నందు జరుగు వార్తలను
నిరతము దెల్పుచు వారలు మరువక చరియించెదరూ ।।రాజ।।

మంత్రి మా

మన గూఢచారులు పరరాష్ట్రములందు జరుగు వార్తలు తప్పక వినిపించుచున్నవారు మహాత్మా

రాజు పా

ఆలయములకెల్ల నిత్యకాలమందు
ప్రజలు చాలా పాలుమాలిక లేక బ్రాహ్మణ త్రికాలము పూజింతురే ।।మంత్రి।

రాజు మా

త్రికాల పూజలు దేవాలయంబులకు నిత్యమునడుపుదురా ఆమంత్రి

మంత్రి పా

కాలకాలమందు ప్రజలు ఆలయముల
కెల్లా వదలకా తప్పక పూజలు నిత్యము మెప్పుగ నడుపింతురు ।।రాజ।।

మంత్రి మా

బ్రాహ్మణులు త్రికాల పూజలు దేవాలయంబులలో నడుపుదురు స్వామి

రాజు మా

అటులైన నా పాలనంబున శుభిక్షుతులై ప్రజలు యున్న వారుగద సంతోషము

మంత్రి - గీతపద్యం

**స్వామి తమ పరిపాలనాశక్తి చేత భక్తి**
**యుక్తులచే ననురక్తి మెరయ విప్రవరులెల్ల**
**సంతోష విధుదులగుచు**
**సవనముల చేయుచుందురు సార్వభౌమా॥**

మంత్రి మా

మీ పాలనంబున ఏ కోరంతయును లేక బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర వర్ణస్తులందరు సుఖంబున మెలగుచున్నారు ప్రభు

రాజు - గీత పద్యం

**నెలకు మూడిష్ట వానలు నేలగురచి పొలము**
**సశ్యాభి వృద్ధియు బొంది నేడు వేడుకలర**
**ఫలియించునే గోవులను దినంబు మూడు**
**వేలల పాలు పితకునే మోదమలరా॥**

రాజు మా

నెలకు మూడు వరుషంబులు గురచి పాడి పంటలు సక్కగా పండి గోవులు ప్రజలు సుఖంబున యున్నవార

మంత్రి - కంద పద్యం

**అహహా తమ పరిపాలన**
**మహిమా తిశయంబు వలన మక్కువ తోడన్**
**విహితముగ పాడిపంటలు**
**మహీప్రభల మయ్యున్నదయ్య మన రాజ్యమునా॥**

మంత్రి మా

పంటలు పండి ప్రజలు సౌఖ్యంబున యున్నవారు స్వామి

రాజు మా

మంత్రీ అదిగో ఎవ్వరో మహాత్ములు, యోగీంద్రులు వచ్చుచున్నవారు నతని శీఘ్రంబుగా నిచటికి దీసుకొని రమ్ము

మంత్రి మా

తమ యాజ్ఞ అలాగే పిలుచుకొచ్చెదను

ధర్మరాజు మారువేషం-పాట-అట

సన్యాసియై వచ్చెను ధర్మజుదంత ॥స॥
సన్యాసియై వచ్చె శాస్త్ర పురాణముల

అన్యోన్యముగనూ తా నన్నియు జెప్పుచు ॥స॥
జపమాల ద్రిప్పుచు జనులెల్ల బొగడాగ
నిపునతతో మత్స్యనృపుడున్న చోటికి ॥స॥
అరుదు మీరగ వన సరములు యురమున
మెరయాగ పలుమారు హదిని స్మరింపుచు ॥స॥
వురగశయనేసుని చరనము లెన్నుచు
పరగ విరాటాభూవరుదున్న చోటకి ॥స॥

ధర్మ మా

కృష్ణ పరమాత్మ ఈ అజ్ఞాత వాసంబు భంగంబు గాకుండా రక్షించు భారము నీదేస్వామి

మంత్రి మా

యతీంద్రులకు పదివేలు వందనములు దయచేయండి రాజాజ్ఞ

ధర్మ మా

సుఖీభవ దీర్ఘాయువు అలాగే నడువుము

విరా పా

దండము తాపాసావర్య ॥దం॥
నాదుపుణ్య ఫలమునాను విన్నుజూడ
గోరితీని పండిత పోషణ నన్ను పాలన జేయారే ॥దం॥

ధర్మ పా

వర్థిల్లుమా రాజేంద్రా నీవు ॥వర్థి॥ వర్థిల్లుమా నీవు ఓ మత్స్యరాజేంద్రా సకల సంపదగల్గి చాలా కాలము భువిలో ॥వర్థి॥

ధర్మ మా

సకల సంపదలు గలిగి వర్థిల్లుము రాజేంద్రా

రాజు మా

ఈ కనక పీటంబున గూర్చొని మదీయ షోడశోపచారాది పూజలు గ్రహింపుము స్వామి

ధర్మ మా

అలాగే గ్రహించితినయ్యా రాజ

సంవాదం-పాట-ఆట

రాజు పా

యపరయ్యామీరు మహాత్మా నాకు ఎరిగింపుదయ్యా పుణ్యాత్మా మునినాథ మీరాక ముదుముతో నచ్చేను వినిపింపుమా నీవు యందుండి వచ్చితివి ॥మ॥

రాజు మా

నిన్ను చూడ దేవాంశ సంభూతినిగా దోచెను నీవెందుండి వచ్చుతివి స్వామి

ధర్మ పా

పంచ భూతాశ్రమామందూ నుండి పనిగల్గ వచ్చితి నిందు ॥పం॥

రాజు పా

విమలా భోగేంద్రుల వారు నాతో ఎరిగింపుడయ్యా నీ పేరూ ॥మ॥

ధర్మ పా

కంకుభట్లను పేరువాద. నేనిక్కము జెప్పితి నీతోడా ॥పం॥

రాజు పా

యేజాతి వాడవు నీవు గొప్ప రాజేంద్రుని బోలినావు ॥మ॥

ధర్మ పా

విప్రవంశమున నగ్రజుడ. శాస్త్రమెరిగింతు నీకు భూవరుడా ॥పం॥

రాజు పా

నీ రాక మాకు పదివేలు నిత్తు మేదిని తలము నీవేలు ॥మ॥

ధర్మ పా

యతులాకు రాజ్యమదేలా చెప్పనేటికో భూపరిపాల ॥పం॥

రాజు పా

ఇక ఏమి కావలెనయ్యా ఇప్పుడెరిగింపు తాపాస వర్య ॥మ॥

ధర్మ పా

భూమీశ నా కడుపు నొవ్వకుండ బ్రోవయే బెట్టించు భువ్వ ॥పం॥

రాజు పా

మీరేమి పనులు గావింతురు పరగ వినుపింపుడయ్యా నీతెరంగు ॥మ॥

ధర్మ పా

సకల శాస్త్రంబులు నేనూ యల్ల రాజులకును జెప్పినానూ ॥పం॥

రాజు పా

ఇన్నాలు ఎందుండినావు శాస్త్రమెవ్వరెవరికి జెప్పినావు ॥మ॥

ధర్మ పా

నాటి నుండియు శాస్త్రమేను పాండునందనులకు జెప్పిననూ ॥పం॥

రాజు పా

ఉరగ ధరాధరమందు యున్న హరితోడు యుందు నీ విందూ ॥మ॥

రాజు మా

స్వామి జీవితంబు నా వద్దనే యుండి మాకు బుద్ధులు గరపుచుందుము

ధర్మరాజు - గీత పద్యం

ఓ విరాట మహీశ నేనుండ మీకు
హర్షమొంది నొక్క సంవత్సరంబు
నుందు నిచ్చట నవ్వల నుండబోను
ఇష్టమెయ్యెది దెల్పుమా ఇపుడు వేగా॥

ధర్మ మా

ఒక్క సంవత్సరంబు నీ వద్ద నుండి వ్రతంబు గడిపి నాకిష్టమయిన చోటికిన్ బోదుమయ్యా విరాట భూపాలా

రాజు - గీత పద్యం

వినయ విజ్ఞాన గణ్యమో ముని శరన్య
తమకు చిత్తంబు ననువచ్చు. క్రమముగాను
యొక్క సంవత్సర కాలమే నుందు విచట
మాకు బుద్ధులు జెప్పుచు మౌనినాథ॥

రాజు మా

నంతవరకు నీ విచ్చటనే యుండుము మహాత్మా

ధర్మ మా

చాలా సంతోషము అలాగే నివసింతును రాజేంద్రా

భీముడు-పాట-ఆది

వంటలా వాడగుచు వచ్చేనూ భీముడు వేగ ॥వం॥
వండలావాడగుచు వచ్చె వైభవము మీర
వెనువెంటనంటి జనులరయ విరటుడున్న కొల్వుజేర ॥వంట॥
చల్లడాము నడుమున గట్టిసంకన గొడ్డాలిబెట్టి
గుట్టు తెలియలేక జనులు గుజగుజలు బోవుచుండ ॥వంట॥
యుల్లసమున వేములపల్లె హరిని దలచుసు
భూవల్లభుడు పెంచినట్టి మల్లుల కెల్లామేటీయాని మెచ్చగాను ॥వంట॥

భీముడు - కంద పద్యం

దండము నీకు రిపువేదం
డోగ్ర మృగేంద్ర శత్రు ధరదేవేంద్రా
దండము కరుణాసాంద్ర.
దండము. మత్స్యావనీంద్ర దండము నీకూ॥

భీము మా

పది వేలు దండంబులయ్యా విరాట భూపతి

రాజు - కంద పద్యం

నీయిరు భుజముల
మీదను కావడి కుందలను బెట్ట కారణ
మేమీ నీవెవ్వడు
బేరెయ్యేది నా వద్దకు ఏల వచ్చినావది జెప్పుమా.

రాజు మా

నీవెవుండవు నీ పేరు నీ ఊరు నీవే జాతివాడవు ఇటకు వచ్చిన కారణంబేమి వినిపింపుము,

భీముడు - కందార్థం

ఇలతలనాయక నేనును
గొలవంగ వచ్చినాడ గోరికమీర.
వలలుండను పేరు వాడను॥ కులమందు శూద్రువాడాను.
భూపతులా ఇండ్లగల వంటలు వండూ వాడాను
పులుసు పచ్చల్ల పప్పు భూరి విథ్థండ.
వడియము కాయగూర లెల్లావండి క్రమముగా నేచేయనేర్తు ॥కుల॥

భీము మా

నాల్గవ జాతియైన శూద్రువాడను వలలుండను నామధేయుండ రుచికరమైన వంటలు వందువాడనయ్యా విరాట భూపతి

రాజు - కందార్థం

నీవెక్కడ శూద్రుండవు
భూవలయమునేలు రాజు పుంగవు మాట్కిన్
భావమున దోచుసున్నది॥ నేలుము. నా రాజ్యమిచ్చెదను
కరుణించి నన్ను కావుమంతె సంతోషము
నీవు యచ్చాట నేర్చినావు పాకములు జేయ.
భావింపగాను మహానుభావునిగా దోచేను ॥నేలుము॥

రాజు మా

నీవు శూద్రుని వలె దోచలేదుగాన నీవు ఎక్కడ నుండి వచ్చితివయ్యా వంటలవాడా

భీము మా

అరణ్యంబు నుండి వచ్చితినయ్యా

రాజు మా

ఇదివరకెవరి వద్ద వంటలు గావింపుచుంటివో చెప్పవయ్యా వలలా

భీముడు - కందార్థం

మానుగ పాండవులిం

టను నే వంటలు వండువాడ నేర్పున వారు

కానలకేగగ దిక్కులు కానక వచ్చితినిందూ

వారు యిందుండ కానక పొయ్యేరోయందో॥

నేను నీబంటు నగుచు నిలతు

ఇందొక్క ఏడు మానవనాథ నన్ను మన్నించు వారందరూ॥

భీము మా

పాండవులు మాయాజూదంబున రాజ్యంబు దర్యోధనునకు వోడి వారు అడవులకు బోవ నేను దిక్కుదెలియక నీవు ధర్మాత్ముండవని విని ఒక వ్రతంబు గడుప వచ్చితినయ్యా విరాట భూపాలా

రాజు - కందార్థం

మానవ రూపము బూనిన

భానుండవో లేక పద్మభవుడో, శివుడో, దానవ మ

ర్దనుడవో॥ ధర మానవులిట్టులుందురా

నిజమైన రూపు మరుగిట్లు జేసుకుందురా॥

శ్రీనాథుడైన శేషచల నాయకు పాదమాన

నీ రూప మింక మానుము ఈ ధాత్రిలోన నీవు ॥మాన॥

రాజు మా

కారణవశాత్తుగా నీవీ రూపంబు బూనినట్లు దోచుచున్నది నీవేయాశ్రమము నడిపింతువోయి

భీము మా

గృహాశ్రమంబు నడిపెదనయ్యా మహారాజ

రాజు మా

అటులైన నీకేమి కావలయును నా రాజ్యంబైన నిచ్చెద గైకొనుము

భీము మా

నీ రాజ్యంబు నాకక్కరలేదు నీవు ధర్మాత్ముండవని వ్రతంబు గడుప వచ్చితినయ్యా

రాజు మా

అయితే నీవేమి వంటలు జేయ నేర్తువు

భీము మా

భక్ష్య భోజ్య లేహ్య చోష్య పానీయాది పదార్థంబులు షడ్రసోప యుక్తంబుగా దినదినంబునకు పెక్కు రుచులు మెక్కునటుల వంటలు గావింతునయ్యా విరాట భూపాలా

రాజు మా

అయితే నాకు మిత్రుండవై మత్స్య దృశ రాజ్యభోగంబు లనుభవింపవోయి వంటలవాడా

భీము మా

వంటలు జేసి బ్రతికెడు వానికి ఈ రాజ్య భోగంబులు ఎందుకయ్యా నాకు

రాజు మా

ఈ వ్రతంబు ఎన్ని దినంబులు గడుపవలయును వంటలవాడ

భీము మా

ఒక వత్సరంబు గడపి నా కిష్టమైన చోటికి పోయెదనయ్యా

రాజు మా

అటులైన నా యింట వంటలు జేయువారికెల్ల నధిపుడవై యుండవయ్యా

భీము మా

చాలా సంతోషము మహారాజా

అర్జునుడు–పాట–ఆది

వచ్చె నపుంసకుండై యపుడు పార్జన్య సుతుడు
ముచ్చట సుభద్రదేవి విభుడు ॥వ॥
వచ్చెను వెడుక వనిత రూపమున
నిచ్చల మోహిని విదమున మెల్లన ॥వ॥
అందెలందముగ పాదములందు
మెరయగను మెరయ చంద్రహారములు
యురమునందూ ముందు కేశవుడు
మోహిని రూపము నొందినగతి చెన్నొంది
వెలగుచును ॥వ॥
జంటా ముత్యముల చంపాసరులు
రానింపు మీర కీల్‌గంటు నమర్చిన దీర్ఘాకురులు
సంటిపూస జత సరములాడగ
కంటికి నింపుగ కాటుక దిద్ది ॥వ॥
వెలలేని సరిగె వలువగట్టి నడుమునకు
బిగవు గలుగు బంగారు డాబు పెట్టి చిలుక
వలెను మృదు పలుకులు బలుకుచు
లలనలు జూడగ లావన్యముతో ॥వ॥
శ్రీ మేగ శ్యామాంగుడైనట్టి యురగాద్రి

మందిరుని చాలగ వినుతి చేయుచూను
వాలుగంటి పురివనితలు జూడగ
నేలుమనుచు భూపాలుని కొల్వుకు ॥వ॥

అర్జునుడు - కంద పద్యం

జయజయ రవి సమతేజా
జయమా చకకల్పబూజ భయదీనౌఘా
జయదాన హస్తవిస్తుల
జయ జయశ్రీ మత్స్యరాజ జయవిభ్రాజ

అర్జు మా

జయ విజైభవ దిగ్విజయభవ

సంవాదం-పాట-ఆట

రాజు పా

యవరయ్య మీరూ ఏ కార్యార్థమిటు వచ్చినారు
అవనిలో మీవంటి అతిశయమగు రూపు
మెవరిని కానను మెరిగింపు పేరేమి ॥యవ॥

అర్జు పా

మనుజేస వినుము దెల్పెదనాదు
మనవి సేకొనుము నన్ను పిల్తురు
బృహన్నలయని జనులు
గుణమిచ్చి నన్ను పాలన జేయవలయును ॥మను॥

రాజు పా

చనువుగ నీవు ఇన్నాల్లు ఎచ్చట
నుండినావు పణిబూని నీవేమి పనులు
జేతువు నాతో వినిపింపు
మరుగేల విశదముగా నాతో ॥యవ॥

అర్జు పా

పాండవులింటా గీతాట తప్పక నేర్పుకుంట
ఉండితినిన్నాల్లు. వనరుగా ద్రౌపతి నందజేరి విద్యలమర నేర్పింపుచు ॥మను॥

సంవాదం-పాట-జుల్వ-ఆట

రాజు పా

యిల మీద ఈ విద్య నీవు ముందు ఎవ్వరెవరికి జెప్పినావు ॥ఇల॥

అర్జు పా

భద్రాముగా తొల్లినేను సుభద్రదేవికి జెప్పినాను ॥భద్రా॥

రాజు పా

భరత నాట్యము నీకు నెలవా కాలమెరిగి శ్రుతిని గూర్పగలవా ॥భర॥

అర్జు పా

కాలమెరిగి శ్రుతిని గూర్తు చెప్ప యొరులకైనను నేర్పింతు ॥కాల॥

రాజు పా

నీవంటి వారాలు కద్ద ఇట నెమ్మదియుందు నా వద్దా ॥నీ॥

అర్జు పా

సర్వాద్రి హరి సాక్షిగాను. ఏదు జరిగి తావల నుండబోను ॥సర్వా॥

రాజు మా

నీ విద్యలు ఏలాగు నేర్పుదువో చెప్పవయ్యా

అర్జు మా

సప్త తాలంబులున్ను, సప్త స్వరంబులున్ను, ముప్పది రెండు రాగంబులను, ముప్పది రెండు నాట్యంబులున్ను నేర్పగలను విరాట భూపాలా

రాజు మా

అయితే నాకు మిత్రుండవై మత్స్యద్రుశ భోగంబులనుభవింప వయ్యా

అర్జు మా

నాట్యం నభ్యసించెడు వానికి ఈ రాజ్యభోగంబులు నాకెందుకయ్యా నీకిష్టంబైనేని ఒక వత్సరంబు వ్రతంబు గడపి నా కిష్టమైన చోటికి బోదునయ్యా విరాట భూపాలా.

రాజు మా

అటులైన నా కుమార్తెకు నాట పాటలు నేర్పుచు నా యింట నుండవయ్య బృహన్నలా

అర్జు మా

మంచిది అలాగే నీ కుమార్తెను బిలువనంపుమయ్య

రాజు మా

మంత్రి నీవుబోయి నా కుమార్తెను ఇచ్చోటికి బిలువుము

మంత్రి మా

అలాగే మహాత్మా అమ్మా ఉత్తర రావమ్మా రాజాజ్ఞ

ఉత్తర-పాట-ఆది

మహనీయా రఘూవశ శిఖామణి గృహ
రాజాప్రియా కోదండ పాణీ ॥మహా॥
సహజగుణ రామా చంద్ర దయానిధె
వరము లొసాగు మభయ. వరమిచ్చి బ్రోవుమయ్య ॥మహా॥

ఉత్తర మా

అలాగే నడువుడు మంత్రి

ఉత్తర-పాట-రూపకం

**వందనంబిడెదన్ సుందారంబగు మీ పాదార విందములకు ॥వంద॥ పొందుగ**
**నాడెందాంబానందంబును గలిగించెను కన్నతండ్రి**
**నన్ను ఇచట తొందరగా బిలువనేమి ॥వంద॥**

ఉత్తర మా

పది వేలు వందనములు నాయనా

రాజు - గీత పద్యం

**నన్ను గన్నతల్లి నా ముద్దు కూతురా**
**నా తపఃఫలంబా నా తనూజ నాదు చిన్ని చిలుక**
**నాయమ్మ నా తల్లి రాగదమ్మ**
**మదన మరాలగమనా**

రాజు మా

అమ్మా ఉత్తర ఇటు నా తొడపై కూర్చుందువు రావమ్మా తల్లి

ఉత్తర మా

అలాగే కూర్చున్నాను నన్ను బిలచిన కార్యార్థంబేమి తండ్రి

రాజు - గీతపద్యం

**తల్లి వినుము నీదు లావన్యతకును తగిన**
**నృత్యగీత ప్రబంధంబు నేర్చుకొనిన**
**కనకమునకు వాసన గల్గినట్లు**
**చెరుకు పండు పండిన సందిగాదె॥**

రాజు మా

కావున ఈ బృహన్నల నాట పాటా గీతాది విద్యలు నేర్పగలడు నేర్చుకొనవమ్మా తల్లి

ఉత్తర మా

అలాగే నేర్చుకొనియదను తండ్రి

రాజు - కందపద్యం

**ఆకలి దప్పియు, నిదురయు**
**ప్రాకటముగ నిమషమైన పట్టగలేదీ**
**రాకేందు వదన స**
**త్కృప చేకొని నా మారుగాను శిక్షింపతగున్**

రాజు   మా

ఈ బాలిక చాలా సుకుమారి ఆకలిదప్పి నిదురల కోర్వని బాల గాన నీవలె నీమెను కాపాడుము

అర్జునుడు - కందపద్యం

**నీ పుత్రిగాదు ఈ చెలి**
**నా పుత్రికగాగనెంచి నయమొప్పారన్**
**కోపింపక, దండింపక,**
**భూపతి సత్కరుణతోడ పుత్రినరయుదున్॥**

అర్జు   మా

నా పుత్రివలె చూడగోరుదు సందేహింపకు విరాట భూపతి

రాజు - గీత పద్యం

**యెల్ల చుట్టములును తల్లియు తండ్రియు చెలియ**
**పరిజనంబు చెలయి నీకు గురువె**
**ఇంక యొక్క కొరతయు లేదిందు**
**చేరి(బతుకు బుద్ది గారబమున॥**

రాజు   మా

గురు వాక్యంబులు మీరక నయవినయమున నభ్యసింపుమా కుమారీ

ఉత్తర   మా

అలాగే కానిండు జనకా

రాజు   మా

ఓ యతీంద్రా నేటి దినంబున విద్యాభ్యాసమునకు లగ్నంబు నిర్మింపుము

ధర్మ   మా

సర్వశ్రేష్ఠంబైన లగ్నంబున్నది అలాగే బెట్టింపు

రాజు   మా

బృహన్నల ఈ ముహూర్తమున ఈమెకు విద్యనభ్యసింపుము

అర్జు   మా

అలాగే రావమ్మా ఉత్తర కుమారీ (నాట్యము)

ఉత్తర   మా

చిత్తము గురువుగారు పదండి

నకులుడు-పాట-ఆట

**నకులుడపుడువచ్చెను వేడుక మీర ॥న॥**
**నకులుడపుడు వచ్చె నయమొందగా మోము**
**వికసింపగా మత్స్య విభుదున్న చోటికి ॥న॥**

జౌరుతన్వంగి శృంగారించి మాద్రికుమారుడు
నడలు వయ్యారము మీరగా ॥న॥
అశ్వ హృదయంబుల నరసి వీక్షింపుచు
విశ్వబరుని రీతి వేడుక మీరగ ॥న॥
పన్నగ చెలముపై నున్నగ వెలసిన
వెన్నుని కరుణ నాకెన్నడూ యనుచును ॥న॥

కంద పద్యం

వందనములు మహోరా
జ ధరవల్లభులలో మేటి వనుచు వైఖరి
తోడన్ నల్లన కొలువన్
వచ్చితి చల్లగ ననుబ్రోవు మత్స్యధరనీనాథ॥

నకు మా

నీకు పదివేలు వందనములు విరాట భూపాలా

రాజు - కంద పద్యం

అనగాత్మ నీవెవదవు.
ననువుగా నావద్దకేల నరుదెంచితివో చె
య్యన దెల్పు పేరూరును
వినియెద దాచంగనేల విమల విచారా॥

రాజు మా

నిన్ను చూడ దేవాంశ సంభూతునిగా దోచెను నీవే కులంబు వాడవు

నకు మా

నేను శూద్ర కులంబు వాడనయ్య

రాజు మా

నీ నామధేయంబేమి

నకు మా

దామగ్రందియను నామధేయుడ

రాజు మా

నీ వెక్కడి ఉండి వచ్చితివయ్య

నకు మా

అరణ్యంబు నుండి వచ్చితినయ్య

రాజు మా

నీవేయాశ్రమంబు నడుపుదు

నకు మా

గృహాశ్రమంబు నడుపుదునయ్యా

రాజు మా

నీవిచ్చట రాకారణమేమి

నకు మా

నీవు ధర్మాత్ముండవని విని నీ వద్ద వ్రతంబు గడుప వచ్చితినయ్యా మహరాజ

రాజు మా

నీవేమి పనులు నేర్తువో చెప్పవయ్యా

నకులుడు-పాట-ఆట

**వినవయ్యా మత్స్యభూపాల నన్ను మరువాక బ్రోవు మీవేళ ॥విన॥**
**తురగ శిక్షలయందు నేనూ నేర్పుతో వాసికెక్కియున్నాను ॥విన॥**
**గొడిగె జాతులలోను దాని గుణములరసి జెప్పెదాను ॥విన॥**
**చెడ్డ గుణములు విడిపింతు వాటి జాడలెరిగి నడిపింతు ॥విన॥**
**నిను గొల్వ నిట వచ్చినాను నన్ను వలదంటే వెళ్లిపొయ్యేను ॥విన॥**

నకు మా

ఈ విధంబున అవిటి మర్మంబులు దెలసి శిక్షింతునయ్యా విరాట భూపాల

రాజు మా

ఏలాగు శిక్షింతువో దెల్పుము దామగ్రంది

నకు మా

అవయవ లక్షణంబులు, ఆయుర్లక్షణంబులు, ఆకార లక్షణంబులు, వయో మాన లక్షణంబులు, మంత్రాంతర లక్షణంబులు, ఆహార లక్షణంబులు, పోషణ లక్షణంబులు, వైద్య లక్షణంబులు మొదలగు లక్షణంబులు నెరుంగుదునయ్యా విరాట భూపాల

రాజు మా

నిన్ను జూడ మానవ మాత్రునిగా దోచలేదు గాన మదీయ రాజ్యభోగంబు లనుభవించుచు నుండవోయి ఈ వ్రతంబు ఎన్ని దినంబులు గడుపవలయునో జెప్పవయ్యా దామగ్రంది

నకు మా

ఒక వత్సరంబు గడపి నా కిష్టంబైన చోటికిన్ బోదునయ్యా

రాజు మా

అంతవరకు నా ఇంట అశ్వరక్షకులకు మేటివై యుండవయ్యా దామగ్రంధి

నకు మా

చాలా సంతోషము విరట భూపతి

సహదేవుడు-పాట-ఆట

వచ్చెను సహదేవుడు విరటుని గొల్వ॥
వచ్చెను సహదేవు దెచ్చుగ తలమీద కుచ్చుల
గొంగడి కులుకుచు తలమీద ॥వ॥
కక్షమూల తన చిక్కము దుత్త చేపట్టి
లక్షణమైన లాలటకము బెట్టి ॥వ॥
మురియుచు వేరొక్క కరమున
పశుకోలు మెదయబట్టి భూమీశుని గొలువగ ॥వ॥
వాసుకి శైలు నివాసుడు మున్ను
యాగోసమూహము గాచుకొన్న కోర్కెమీర ॥వ॥

కంద పద్యం

దండంబులు దండంబులు. దండంబులు.
ఘోర శతృదండిత పదివేల్
దండంబులు. దండంబులు దండంబులు
నీకు మత్స్యధరణీ నాథ॥

సహ మా

నీకు పదివేలు దండంబులు విరాట భూపాల

రాజు-పాట-ఆట

ఎవడవు నీవు నేడు ఎందుండి ఇట వచ్చినావు ॥ఎవ॥
జవమును నాత్మలోనుత్సాహ మొప్పగాను
భువనమునందు నీ బోటిపాపను నెరుగ ॥ఎవ॥
వివరింపవయ్యా నీ జాతియ బిక్కాము తెలియా.
వినియెద నేదునే విదమెల్ల తెలియాగ
పనులేమి చేతువో వివరింపు నాతోడ ॥ఎవ॥

రాజు మా

నీ పేరు నీ వూరు నీవే కులంబు వాడవు ఏమి పనులు జేతువో వివరింపుము

సహదేవుడు - గీతపద్యం

గొల్లవాడ నేను గోవుల ధర్మజు నింట
మేపుచుంటి నిన్నినాల్లు వారు కౌరవులకు
వసుధ జూదంబున నోడి
యడవులకేగిరో మహాత్మా

సహ  మా

గొల్ల కులంబువాడను తంత్రిపాలుండను నామాంకితుడను ధర్మరాజు చెంద గోవుల గాచుచుండ వారు జూదంబున నోడి ఎచట కేగిరో తెలియక నీ వద్ద ఒక వ్రతంబు గడుప వచ్చితినయ్యె

సంవాదం – పాట– ఆట

రాజు  పా

గొల్ల వాడవు గావు నీవు గొప్పకొన్న రాజును బోలినావు ॥గొల్ల॥

సహ  పా

ఎక్కువ కులము దాగేనా యొక్క ఏడు గడచిన మీదనైన ॥ఎవ॥

రాజు  పా

రాజ్య మిచ్చెదను పాలించు గోవు రక్షణ చింత చాలించు ॥గొల్ల॥

సహ  పా

గొల్లలాకేల రాజ్యంబు. గొప్ప కోరుని యేదు పుణ్యంబు ॥ఎవ॥

రాజు  పా

పశులు రేబగల పాలింప చిన్న పనులాకు నిన్నూ నే పంపా ॥గొల్ల॥

సహ  పా

పశులైతే మేప బూనెదను వేరే పనులైతే నేను బోయెదనూ ॥ఎవ॥

రాజు  పా

పశుల కాపరి వారికెల్ల దొడ్డ ప్రభుదావై యుండు నా వద్ద ॥గొల్ల॥

సహ  పా

అటులైన ఇవట నుండెదను నీ యాజ్ఞను నే పాలించెదనూ ॥ఎవ॥

రాజు  మా

నీవే విధంబున గోవుల పాలింతువో చెప్పుము

సహదేవుడు–పాట–ఆది

బ్రోవవే భూమీశ నన్నూ బ్రోవవే బ్రోవు బ్రోవు
ఏడయ్యే వరకు సేవకుడై నే గోవుల మేపెద ॥బ్రో॥
శూలు నిలువని పశులకు తగిన వనమూలిక
మందులు మొదవుల కిత్తును ॥బ్రో॥
మెకములు మన మందకు రానీయక
పటుతరగముగ మంత్రములు పటింతును ॥బ్రోవ॥
లేగలకును పాలియ్యక తన్నెడు
గోగణములను గుదురబరచెద ॥బ్రో॥

దందశూక గిరి దాముని కృప
నీమంద పశువులా పెంపొందజేసెదను ॥క్రో॥

సహ మా

గోవులకు నాకలి దప్పి నెరుంగి మేత నీరు వేయుదు తిక్క తెగులు, పాముకాటు లకు మందు మంత్రంబులు నెరుంగుదు పులులు శార్దూల మృగంబులచే బాధ రానీక బంధించుదును సూల నిలువకుండిన పాలుద్రావకుండిన వాటిని సక్కబరుపుదును నీ విధంబున గాతునయ్యా మత్స్యావనీంద్ర

రాజు మా

చాలా సంతోషంబాయెను నీ ఇష్టమొచ్చినట్లు నా వద్ద నుండవయ్యా తంత్రీపాల

సహ మా

మంచిది అలాగే నుండెదను మహాత్మా.

కీచకుడు రాకట - పాట - ఆట

కీచకుడరుదెంచేను వేడుక మీర ॥కీచ॥
కీచకుడరుదెంచె కిమ్మీర వైరీచే తాచచ్చు
టెరుగాక దైవపేరితమూన ॥కీ॥
పచ్చలు బొదవిన పదకాము లురమున
హెచ్చుగ దీప్తూలు వెలసి రాణింపగ ॥కీ॥
వెక్కసముగనూ శ్రీవేమూలపల్లె హరి
నిక్కాముగా నెగశక్యాము లాడుచు ॥కీ॥

కీచ నూ

ఒరే మంత్రులార ఏదిరా బ్రాంది, విస్కి మదత్తు కల్లు అపినీ సారాయి భంగ్యకు అన్ని సమకూర్చారా రా

పాట-జుల్వ

బ్రాందీ, శీషా, నీకేల గోషా రావేలనే.
నీ షోకుల్ జూప శీషా షోకుల్
జూప నీవే గదా మా కులదైవము
॥శీషా కులదైవము॥ ॥బ్రాం॥

పాట-ఆది

బ్రాందీ సమానమైన పానీయమీ ఇలగలదే
పానీయమీ ఇలగలదే వహ్వారే ఇపుడు నాదు వయ్యారంపు ఎన్నగతరమా ॥బ్రాం॥
అపినీ భంగ్యాకు కన్న మధురమైన దిలలోగలదే
॥మధు॥ ఇపుడు నాదు వయ్యారంబు వహ్వారే యన్నగ తరమా ॥బ్రాం॥

సారాయిలో సారములేదు బ్రాందీ ఒక బాటలు దేరా ఏరా సారాయి ||బ్రాం||
తాజ్‌మహల్ సిగరెట్టు త్రాగి తమాషగ
మనమేయుంటే ఏరా బ్రాంది ||బ్రాంది||
అబ్దుల్ కాదర్ జాడిబీడి త్రాగి రుచి చూడుము
భాయి వహ్వారే ఇపుడు నాదు వయ్యారంబు ఎన్నగ తరమా ||బ్రాం||

కీచ మా

మంత్రి కైపెక్కినది చాలా దినముల నుండి మా అక్కయగు సుదేష్ణాదేవిని చూడలేదుగాన అలా అలా పోయి వత్తము మీరు నాకు కావలయు సురాపానీయంబులు దీసుకొని రండిరా

మంత్రి మా

ఆలాగే పోయి వత్తము కీచక మహారాజ

కీచ మా

ఏదిరా ఇక ఒక డోసు కొట్టరా

కీచ పా

పదపద మంత్రి పోతాము వేగ ||పద|| పదపదనే నిదె నరుదెంచేద ||పద||

కీచ మా

ఏదిరా కైపు తగ్గినది ఇటు తెమ్మురా బ్రాంది

సైరంధ్రి-పాట-ఆది

గోవర్ధన దారీ మురారీ ||గో|| దేవకి
నందన దీనదయాతో, ప్రాపుగ మమ్ముల శ్రీపతి నేలుము ||గో||
దుష్టవిశిక్షణా సిష్టవిరక్షణ సృష్టిరహిత
సురలోకా వినుత హరి ||గో||

సైరం మా

పరమ పురుష వాసుదేవ ఏ విధమున రక్షించెదవో

కీచ మా

అక్కగారు అక్కగారు ఏమి మాటలాడరే అక్కయ్యా ఆహా ఇది ఏమి ఆశ్చర్యము ఈమె ఎవరు మెరపు తీగవలే నా కనులకు భ్రమించెను ఇది కలయా నిజమా దీనిజూడ నవరత్నములు జెక్కబడిన ప్రతిమగా యున్నది నా కొరకై దేవలోకము నుండి దిగిన నప్సరసగా యుండునా లేక నా కొరకు బ్రహ్మ సృష్టించెనా తిలకించెదా

పాట-ఆది

ఒహ్వారే ఈ చిన్నదెవతో బాగైయున్నది సైసై బాగున్నది ||ఒ||

కలువ రేకులాను గీరు కన్నుగవతీరు
మెరపగు నిలువుటద్దములు జోడు నెలత చెక్కిల్లు
విండ్లాకన్ బము లతివ బాహులు
విరతామర తుండు పూలచెండు పుట్టబెండ్లు బంగారుగుండ్లు ॥ఒ॥
తేమియారీ తీరునెల్లా చీమలబారు
ఈ మోముగోము జూడరాగా పూర్ణమ సోము ॥ఒ॥
సుదతి వేల్లు పెసరి గాయలు. సుఖ్ఖలు గోల్లు
ఈ మదువతి నూహింప పదములు లేత మామిడి చిగుల్లు ॥ఒ॥
యిలనూ శ్రీవేముల పల్లె యీశు కృపలేక
ఈ పొలతికి మగడానై పుట్టనైతిగా ॥ఒ॥

కీచ మా

మంత్రీ చూచావా దీని లావణ్య సక్కధనములు దీనిని సూస్తు వుంటే మదనుండు నన్ను నిలవ నింపడు దీనిని పొందాలే

మంత్రి మా

అవును దొర అవును ఇంతవరకు నేనును యందూ చూడలేదు పట్టు పట్టు సూత్తాము

కీచకుడు – గీత పద్యం

ఇంతి గాదిది. రత్నాల
దొంతి గాని దొంతిగాదిది మల్లె
పూబంతిగాని ఇయంతి కటువంటి లావణ్యమేర్పరించి
జేసినటువంటి యజునకు జెల్లు నహహా॥

కీచ మా

ఇది రత్నాల బొమ్మగాని మానవకన్నె గాదురా మంత్రి

మంత్రి మా

అవునవును అట్టి జ్యోతిలాగ మెరుస్తుంది నాకు ఈమెను సూత్తుంటే ఏమేమో అవుతుంది

కీచకుడు–పాట–ఆది

ఎంతటి సుందరిరా ఈవనితామణి ॥ఎం॥
ఎంతటి సుందరీ యందునుగానను కాంతునిచే విరిబంతిగా దోచేనూ ॥ఎం॥

కీచ మా

మంత్రి దీనితో మాటలాదవలయు పిలచిన పలుకునా లేక నలుగునా పలుకరింతునా హా హా

మంత్రి మా
నీ పనంత కానివయ్యా పోదాము ఇంద కొంచం నిషా ఎక్కించు ధైర్యము వస్తాది

కీచ మా
కైపెక్కినది నాతో మాటలాడునా లేక కోపించునా

మంత్రి మా
కోపమా మనమెవరు ఈ రాజాదిపతులము గదా మన కడ్డేది పలుకరించుము

కీచ మా
అయితే మాటలాడించెద చూడరా దాని రూపలావణ్యము (అని మంత్రిని కౌగలించుకొనును)

మంత్రి మా
దొరదొరా నేను నేనూ అటు అటు

కీచ మా
పొరపాటురా పొరపాటు అంతా పొరపాటు

మంత్రి మా
కాద్దొరా ఈలాటి రూపవంతులను పట్టితే మృత్యువు దప్పదన్నారు గాన ఈమె జోలి మనకెందుకు రా పోదాము మీ అక్క దగ్గరికి

కీచ మా
ఏమన్నావు మృత్యువా అది ఎవతిరా మనల జంపుట సింహబలుడ నా నా మాంకితము విన్నంతనే గడగడవడం కదా వెర్రివాడా

మంత్రి మా
అవును అది నిజమే దుష్టుల సావాసము దూరమన్నారు ఇట్లాంటి వారికి ఏమిరాదు వస్తే ఊరకపోదు నీ ఇష్టము

కీచ మా
భామా కామిని సుందరీ లలితా పలుకవా

పాట-ఆది
**మాటలాడవే మానిని నాతో ।।మాటలాడవే।।**
**మాటలాడవే మానిని యమృత తేటలూరగా తేరియ లొలుకగ ।।మాట।।**
**'ఎత్తి చూడవే నీ వాలుకన్నూ లెత్తి చూడవే**
**ఎత్తిచూడవే బిత్తర సొగసగు నెత్తంబున బిగి. హత్తిన కన్ను ।।మా।।**
**నవ్వు నవ్వవే సొగసైనా చిరునవ్వూ నవ్వవే।।**

నవ్వు నవ్వవే జవ్వని నీదగు నవ్వు వెన్నలా నల్దిశలరయా ॥మా॥
చెంతా చేర్చవే ఓ కొమ్మరో నను నీ ॥చెం॥
చెంత చేర్చవే చలవేముల పల్లె కాంతుడు
మనకును కాంత మొసంగును ॥మా॥

కీచ మా

కాంతామణి ఒక మాట మాటాడుము సిరునవ్వు విసరి నన్ను దేలించుము
తరుణి సింహబలుండ కీచకుండనే భామ

సైరంధ్రి-పాట-ఆది

అకటా నేనేమి జేతు అదిగో కీచకుడొచ్చె.
వెయ్యేలా వాని హృదయ మియ్యెడా యున్నట్లుంది ॥అకటా॥
చూపులూ మనసెల్లా నాపైన జేర్చినాడు
ఈ పట్ల నెనరుంచి కాపాదేవారెవరు ॥అ॥
దండిగా వాని యుద్దండము జూచితే కండితంబుగా
నా గుండె జల్లు జల్లు మనె ॥అ॥
వదలక వీడు కామవశుడై యున్నాడు నేడు
సదయాత వేములపల్లె స్వామి ఎట్లు రక్షించునో ॥అక॥

సైరం మా

ఓ కృష్ణదేవా యీ కీచకుడు నా మీద కాంక్షగోరినాడు ఇక నాకేగతి దిక్కెవరూ స్వామి

కీచకుడు - ద్విపద

యందుండి వచ్చితివి వెలయల నాగయిందెన్నడును
గాన యీ ఇంటిలోన నీకదు విశ్రాంతి నీ ముఖకాంతి
నీకుచముల పెంపు, నీ కనుసొంపు నీ కచముల బారు
నీ నాభితీరు నీ కరమందంబు నెరయు చెందంబు
నిలకాంతుల మీరు నీదు నూగారు వాలు జూపుల రీవి
వనరైన తావి చెక్కుటద్దంబులు నిల్చెరుకైన బొమలు
ముక్కు శృంగారంబు మోవి నాణ్యంబు
మందమౌ నడలు రంభను మీరు. తొలు సుందరాంగంబు విస్పుటము కర్నంబు
కంటి దేహదృఢము జక్కని సన్ననడుము కుటిలాలకములు
కుంద దంతములు నీ విలాసమును నీ జవ్వతనము
భావింపగా భువిపణతులెందెరుగ నావంటి వానికి

నాతిగా ఇపుడు నీవుగల్గిన చాలు నీరజానేత్రి నిను జూచిమోహము
నిలుపంగనేర నను గూడి సుఖియింపు నాతి వేడ్కగనూ
ఈయెడ నౌకరింట ఇట్లుండనేల నా యింటికి పెద్ద నాయకి వగుమా

కీచ మా

కాంతా నీవెవరు ఎన్నడు చూడలేదు నీ వెందుండి వచ్చితివి ఈ మాసిన చీర మాసిన దేహంబుచే నీ సుఖుమార వదనంబు నేల ఈ రీతి మైలు గావించెదవు నీ పేరు నీ వూరు నీవే జాతిదానవు ఇందు ఏమి పనులు జేతువు రమ్ము నాతో సుఖం బొందుదువు నిన్ను నా రాణీగా జేతునే భామ

కీచ మా

మంత్రీ మాట మాత్రంబున మాయంబాయెను

పాట-ఆది

ఎక్కడి కేగెనురా మంత్రీ వర్య ॥ఎ॥
ఎక్కడికేగెను సక్కని చుక్కలాంటి
సుందరంబైనట్టి సుదతియిచ్చాట నుండి ॥ఎ॥

కీచ మా

కాంతా నిలువుము ఎక్కడి కేగెదవు

గీత పద్యం

చూడ నేటికి కన్నెత్తి సొగసు మీర అకట
నీ రూపు బంగారునయ్యో నోక్కో
వేడుకల రంగమరుమాట లాడితేను
బాల నీ నోటి ముత్యముల్ రాల్ నటవే.

కీచ మా

నాతో మాటలాడిన నీ నోటి ముత్యబులు రాలునా కోమలీ

సంవాదం-పాట-ఆట

సైరం పా

తగునేమన్నా కీచకవోరీ ॥త॥
తగునేమన్నా పరామగువల జూచియు
మగవారు నీలాగు. పొగరు మాటలు నాడ ॥త॥

కీచ పా

మానిని కన్నెత్తి చూడవె నన్ను మరువాక రతికేళి కూడవే మానిశాజుడు ఫణి భూనిన యద నొవ్వగా నేయ సాగెను పుష్పశరములు బూని ॥మా॥

సైరం పా

రాజకులమున బుట్టినావూ

గొప్ప రాజులై విలసిల్లినావు భుజనులెవరైన
పూజితంబుగ విన్న. నీచుడానుచు
నిన్ను యోచింపకుందురే ॥త॥

కీచ పా

వలపూనే నిలుపాగ జాలా
నాతో పలుకావె ఓ ముద్దుబాలా యలుకూల
వేణీని యధర బింబునందు
లొలుక తేనియలిచ్చి అలుక తీర్చవే నన్ను ॥మా॥

సైరం పా

పరసతుల గోరూట తగదురా నన్ను
పరిహాసమాడుట విడవరా నీ తోబుట్టిన యట్టి తోబుట్టువని నమ్ము.
నీచ వాక్యములాడ ఇది నీకు తగదూర ॥త॥

కీచ పా

నెనరూ నా మీదను నుంచవే
కోప మనచి నీ విభుడాని ఎంచవే. వనితాయజాక్షిణీ వలసి వచ్చితినిన్నూ
మనసిజునిష బాధ క్షణమోర్వజాలనే ॥మా॥

సైరం పా

చలమేల నా మీద. వలదురా
నీకు చేటుకాలము వచ్చు తొలగురా వాసి
మీరగ. చింతగుంట పురమున వెలయు
శ్రీసుదైనను నిన్ను శిక్షింపకుందునే ॥త॥

కీచ పా

పన్నగా చలముపై నిలచిన ప్రసనుని
మదిలోన దలచిన. నిన్ను పాలన జేయనేరాదు నావంటి
మన్నె దొరని గూడుకున్న మేలొందేవు ॥మా॥

కీచ మా

కాంతా నీపై వలపుచే నాకు తాపము కలిగినది కోపింపక నా కోర్కె తీర్చుము.

సంవాదం-పాట-ఆట

కీచ పా

సుదతిరో నీవంటి. దివ్య స్వరూపంబు
ఎందెందు వెదకిన లేదుగద నీ అందా చందాలింక నావేగద ॥సు॥

సైరం పా

ఏలరా మొగినాలిరా నన్నీట్లాడ ॥ఏ॥

ఏలర పరులు తలతో ముదచిన.
పూలకాసింపాగా బోలునే ట్లాడ ॥ఏ॥

కీచ పా

చంద్రుని సమబోలు నీ ముఖారబింబము గని
డెందంబునకు. ఆనందంబు గలిగెను ॥సుద॥

సైరం పా

పరగ భుజించియు పరిహరించిన
యట్టి. పరుల ఎంగిలి కూడు భక్షింపగా నీకు ॥ఏ॥

కీచ పా

సుందారి ననుగూడ సుఖియింతు
విటురావె మందగమన నీ పొందు గోరితి నేడు ॥సు॥

సైరం పా

భువని వేముల పల్లె ధవుని భక్తులు నమలి.
అవని మూసిన తమ్మ. ఆసింపగా నేల ॥ఏల॥

కీచ పా

యిలలోన అన్యాపుదేశుడు మనలాను
చెలియారో సుఖియింప జతగూడి యున్నాడు.

సైరం మా

మగనాలినైన నన్నిట్లాడుట తగునేమన్నా కీచక.

కీచ మా

మగ నాలి ననుసున్నావు భీ మగండెవ్వడే భామ

సైరం మా

గందర్వులన్నా కీచక

కీచ మా

గందర్వులనగా ఎందరే భామ

సైరం మా

అయిదుగురన్నా కీచక

కీచ మా

నీ కులంబేమి భామ

సైరం మా

సైరంధ్రి కులంబు దాననన్నా

కీచ మా

నీ నామదేయం బేమె భామ

సైరం మా

మాలిని యను నామధేయంబు దాననన్నా

కీచ మా

నీ విచ్చట నేమి చేయుదువే తరుణి

సైరం మా

సుదేష్ణాదేవి చెంత పనులాచరింతునన్నా

కీచ మా

నేనెవరనునది తెలుసా

కీచకుడు – కందార్థం

**కొమ్మా సుదేష్ణా దేవికి**

**తమ్ముడనే సింహబలుడ దయ తోడుతనీ**

కెమ్మోవి ముద్దొసంగియు॥

కొమ్మా బంటుగ నేలుకొమ్మా నన్నూ బంటుగ నేలుకొమ్మా దొమ్మిజేసి యాకమ్మ

**విల్తుడు విరి దొమ్మిశరంబులు రొమ్ముదూరగనేసె కొమ్మా నన్నూ ॥బంటు॥**

కీచ మా

యా సుదేష్ణాదేవికి తమ్ముడను నన్ను ఆలింగనము జేసుకొనవే సైరంధ్రి

సైరంధ్రి – కందార్థం

**వేడుకతో నాడు వారల**

**తోడన్ బుట్టియును ఇట్టి తుచ్ఛతనమున**

పోడిమి చెడు పరకాంతల

**గూడిన పాపంబు గాదె గురుతర తేజా పరకాంతలా పొందు**

**పాపమనకముందు పరిహసించినవాడు**

**పరతత్వ వేదియా॥ గురుతర తేజా ॥పాప॥**

సైరం మా

ఆడ వారితో బుట్టియు యిట్లు పరకాంతల గోరుటుచితమేనన్నా

కీచకుడు – కందార్థం

**నా వంటి పురుషుడబ్బిన**

**నీ విధి విడనాడుటెల్ల ఇంతిరో నాకు దేవివై యుందు వింటికి॥**

రావే పోదము వేగ రత

నాపు బొమ్మా పోదమురావే పోదాము రావే రతనాపు బొమ్మా రతనాపు

బొమ్మయో రాత్రి

పగలు మనము రతి సౌఖ్యమునను సమ్మతిగూడి యందాము ॥రత॥

కీచ మా
తగిన పురుషుండు దొరకినప్పుడు విడనాడుట తరుణులకు తగునా సైరంధ్రీ
సైరంధ్రి - కందార్థం
అన్నా నా బుద్ధులు విన
వన్నా పరసతుల గోరుట న్యాయంబౌ అన్నా
నను చెల్లెలుగా మన్ననాతో జూడుమన్నా మదులే
లాన్న నాపై ఇంత మరులేలానన్నా మరులేలానన్న
నా మాటలు వినవన్న నా వరులు
విని నిన్ను వధియించి పొయ్యేరు ॥మరు॥
సైరం మా
నీకు చెల్లెలునగు నన్ను గోరుట తగునేయన్న
కీచ మా
చెల్లెలు వరుస చేర్చుకోవచ్చునే భామా
సైరం మా
యాలాగు చేర్చుకోవచ్చునో చెప్పవన్నా
కీచకుడు - కందార్థం
చెల్లెలు చెల్లెలు వనుచును
చెల్లని మాటలను నాడ చెల్లునే నీకున్
యుల్లమునకు దెలసె నిపుడు॥ చెల్లెలువా నాడు బావ చెల్లెలువ
భళా. నాకును బావా చెల్లెలువ భళా చెల్లెలు వరుసయ్యె చలగి రుక్మిణి. దేవి నల్లకృష్ణుడు
పెండియాడు టెరుంగవే ॥చె॥
కీచ మా
శ్రీకృష్ణుం యా రుక్మిణీ దేవిని భార్యగా గైకొనియుండ లేదా సైరంధ్రి
సైరం మా
యా రుక్మిణిదేవి యా శ్రీకృష్ణునకు ఏలాగు చెల్లెలో జెప్పవయ్యా కీచకా
కీచ మా
తన మేనత్త కుమారుడు శిశుపాలుడు వరించిన రుక్మిణిదేవి చెల్లెలు గాదా మాలిని
సైరంధ్రి - కందార్థం
కాయం బెరుగక యతనుని
మాయో పరవశము నొంది మదిగానకనున్

డాయుచు నందుని మ్రాకుల కోయం
బోయెదవు పండ్లు కూతురేనన్నా నీకును నేను
కూతురేనన్నా కూతురు పొందినా పాతకుడా
యముని దూతల చేజిక్కి దుర్గతి నొందేరు ॥కూ॥

సైరం మా
నీకు కూతరు గావలెనన్నా

కీచ మా
కూతరు వరుస కూడుకోవచ్చునే బామా సైరంధ్రి

ససైరం మా
యాలాగు కూడుకోవచ్చునన్నా కీచకా

కీచకుడు – కందార్థం
కూతురు కూతురు వనుచును
ఏతువలేనట్టి మాట నిట్లాండంగా నీతి యగునే నీ కిప్పుడు
కూతురావా నీవు పెండ్లి కూతురే వబలా నీకును పెండ్లి
కూతురే వబలా నీతిని విడచి జలజాత బావుడు తన
కూతురు పొంది ప్రఖ్యాతి గాంచదే తొల్లి ॥కూ॥

కీచ మా
బ్రహ్మదేవుడు తన కుమార్తెయగు సరస్వతి దేవుని భార్యగా గైకొని యుండలేదా
కామిని

సైరంధ్రి – కందార్థం
నన్నిటు బల్కుట తగు నట
రన్నా. నీకేల చెదు యహంబు విడచి నీ
వున్న యదకేగు యూరకే।
చిన్నెలు జేయుచును వద్ద జేరకూ మట్టుమర్యాద మీరకు
మన్నె విరాటుని మరదివి తక్కువ లెన్నికగొని లేకున్న విరహమున జేరకూ. మట్టు
మర్యాద మీరకూ.

సైరం మా
నా పతులు విన్న నిన్ను పొట్ట క్రోవండంచెదరు పోరా దుర్మతీ

కీచకుడు – కందార్థం
పతులేవురు గలరనుచును
యతివరో బెదిరింపనేల నవనిలోగల భూపతులకు నేనంతకుడను
వ్రతధృతి సంపన్నులటె నీ

భర్తలు నింకేల నాతో వార్తలు రతికి నిన్ను బలుగతులు వేద
సమ్మతి బడలిక నిమ్మహిగనులటే నీ భర్తలు ॥నింకేల నాతో వార్తలు॥

కీచ మా

నీ పతులు నన్నేమి చేయగలరు బెదరించిన వెరతునా చెలి

సైరంధ్రి - కందార్థం

శుంఠా విను సొగసుల రేడా
కంఠీరవ. మధ్యములను గడిసిన చెడరే
కుంఠితమతి సీతను దశ
కంఠుదు కామించి చెడుట కానరా నీవీ దుర్బుద్ధి మానరా.
యంటరాని వాల్గంటు వలనంటియు మంటగలియుదుర్మార్గులచావు ॥గానరా॥

కీచకుడు - కందార్థం

బాలేందురేక గల్గిన
బాలికరో భాగ్యములను బాసియు గుందన్
ఈలీల నిచటి నేటికి. నాలస్యము రావే.
నాకిల్లాలుగా బ్రోచెద నిన్ను మేలుగా. వాలుగంటి
నా వనితలలో నిను మేలు బంతిగా మెచ్చెద నాకిల్లాలుగా

కీచ మా

నా మాటలు విని వచ్చితివేని ఈ రాజ్యంబునకు నిన్ను రాణిగా జేతునే సుందరి

సైరంధ్రి-పాట-ఆట

విన్నవో లేదో యీ కథలు
ఓరన్నా ఏలర యిట్టి వెతలూ ॥విన్న॥
అన్న ఊషుదు ఇంద్రాని మోహించియు. పన్నుగ.
భీకర పన్నగామ వుటాయు ॥విన్న॥
పురుహూతుదాహల్య. పొందుగోరి
యామునివరు శాపమునను తా విరహితుడవుటాయు ॥విన్న॥
కావరమున సీతదేవిని చెరబట్టి రావణాసురుదు
శ్రీరాముచే బదుటాయు ॥విన్న॥
పరకాంతలా పొందుగోరి పరిహరింపాకున్న
ధరణి వేములపల్లె దాము దోర్వదూ నిన్నూ ॥విన్న॥

సైరం మా

పరస్త్రీల పొందుగోరి రావణాసురుండాదిగా వారందరు చెడుట నెరుగ వేమిర కీచకా

కీచ మా

ఈ గొంటు మాటలు విడచి నీ కుచంబు లంట నీయవే సైరంధ్రీ

సైరంధ్రి - శ్లోకం

**పతివ్రతా ఖుచకుంభయుగ్మం అత్యుగ్ర శార్దూల నకావళిచా లుబ్ధశ్య విత్తంరణ**
**శూరశస్త్రం చత్వారి దత్తం మరణాంతకాలే**

సైరం మా

పతీవ్రతల కుచంబులున్ను పెద్దపులి గోళ్లున్ను లుబ్ధునిచేతి ద్రవ్యమున్ను రణశూరుని చేతి ఆయుధమున్ను వారి ప్రాణములున్నంత వరకు పరుల నంట నివ్వరురా దుర్మార్గా

కీచ మా

నీ వంట వలదన్నను బలాత్కరంబున నంటెదెనె భామా సైరంధ్రీ

సైరం మా

ఇదిగో నా పతులు వచ్చుచున్న వారు నీ పొట్ట క్రోవడంచెదరు పోపోరా కీచకా

కీచ మా

నీ పతులను బంధించినైనను నిన్ను పొందక మాననే సైరంధ్రి

సైరంధ్రి - గీతపద్యం

**వినర కీచక నీకేల ఇట్టి బుద్ధి దోష మొచ్చును**
**సత్తువు నిజముగాను యొరుల సతులగోరి**
**నీవు ఈ ధరణిలోన ఖ్యాతిచెడి**
**నీల్గుటెరుగవె కర్మ చిత్తా॥**

సైరం మా

ఛీ నీచుడా నా చెయ్యి విడువుమురా ద్రోహి

కీచ మా

నీవెంత తిట్టినా విడువనే భామ సైరంధ్రి

సంవాదం-పాట-ఆట

సైరం పా

**పాపాత్మ నీవెంత మోహిరా నన్ను**
**బట్ట వచ్చెద వెట్టి ద్రోహిరా నా**
**పతులదిగోరా నీవు నవ్వలబోరా**
**భూపాలుడై పుట్టి ఈ పాటు బడనేలా ॥పా॥**

కీచ పా

**పాపాత్ముదని నన్నూ తిట్టకే నీ ప్రాయమెల్లను**
**దాచి పెట్టకే నీ పతులననేల**

నఖిల లోకములేలు భూపతులైనాను
పురిగొందు యవనీలో ॥పా॥

సైరం పా

పతి భక్తి గలిగిన దానరా. లిట్టి పరుషము లాడుట మానరా
క్షితిలోన గల పతివ్రతులా మోహించి
నా భూపతులాకునైన దుర్గతి రాక మానాదు ॥పా॥

కీచ పా

పతివ్రతా నీవైతే మెత్తురే దాది పడుచు.
నీవని గూడ వత్తురే యతివలు మగవారి జతలేక యుండిన
పతి తాము లపుడే తప్పక వచ్చు తిరుగావే ॥పా॥

సైరం పా

జననాదు భార్యకు దాసిరా నన్ను జతగూడి.
మోహింప తగదురా వినరా దురాత్మ నీవనితలతో సౌఖ్యమనుభవింపా
లేక నను గూడి చెడనేల ॥పా॥

కీచ పా

చెదుదు నీవని బల్కనేల శేషశైలవాసుని కెరువజాల
పదలిరో. మదనూని బాణాగ్నజాలకు
నోర్వక నీ పంచ పడి తపించెదు నన్నూ ॥పా॥

కీచ మా

కాంతామణి నీ వెన్ని తిట్టిన కొట్టినా మాటలాడిన నింక విడువనే భామ

సైరంధ్రి-పాట-ఆది

తగదూ తగదూ పోవన్నా. దుర్బుద్దినీకు ॥తగదూ॥
తగదు తగదు నీకు తరితీవు లెదగొని వగటు
మీరంగ నా వద్దకు వచ్చూట ॥త॥
భూతలాధిపుడావు ఖ్యాతిని పోనాడి.
నీతియె సైరంధ్రీ జాతిని వలచుట ॥త॥
భూ నాయకులను బానిసలను పనిబూని
వేదుచు రతి బొందదలంచుటా ॥త॥
ధరను ధర్వీకర గిరిమీద వసియించు
హరిభక్తులకు నేను తరుణి నయ్యిన దాన ॥త॥

సైరం మా

ఛీ నీచుడా దుర్మార్గుడా చండాలుడ విడునా చేయి విడు నా వెంట రావలదు
మర్యాదగా వెడలి పొమ్ము క్రూరుడా

కీచ మా

సైరంధ్రీ సైరంధ్రీ

సైరం మా

అమ్మా సుదేష్ణా సుదేష్ణా దేవి రక్షింపుము రక్షింపుము

(సుదేష్ణా అడ్డము వచ్చును)

కీచ మా

సైరంధ్రీ (అని పట్టును)

మంత్రి మా

పట్టుకోరా కొడకా అక్కని పట్టే నాకొడుకు పట్టరా పట్టు

సుదే మా

తమ్ముడా విడర నేనురా మీ అక్కనురా తులవా నీకు కన్నులు గూడ కనబడదు తుంరా

కీచ మా

అక్కా నే వచ్చునపుడు నీవెందుకు అడ్డము వచ్చితివి సైరంధ్రినని పట్టితి మన్నించుము

పాట ఆది

దండము దండాము నీకు తల్లి

సుదేష్ణా నీ అండ జేరితీని నన్ను ఆదరించుమా ॥దం॥

వారిజాక్షి నాదు బ్రతుకు వాంచించి

యుంటె యా సైరంధ్రిని నన్నీవేళా సమకూర్చవమ్మా ॥దం॥

యిలను శ్రీవేములాపల్లె యీశు సాక్షిగాను

యా కొమ్మను నా సొమ్ము జేయవమ్మా ॥దం॥

కీచ మా

అక్కా పదివేలు వందనములు యా తరుణి ఎక్కడికెల్లెనూ

సుదే మా

ఆశీర్వాదము తమ్ముడా పెక్కు దినములు నుండి కానరావు ఎందేగి యుంటివి క్షేమమా ఇటు కూర్చొనుము

కీచకుడు-పాట-ఆట

అక్కరో వినవే దెల్పెద నాదు మనవి గైకొనవే ॥అక్కరో॥

నిక్కముగా నేను నిన్ను చూడ గోరి

మక్కువ వచ్చితి మరులయ్యే నా మీద ॥అక్క॥

నీ యింట నున్నట్టి నెలత సైరంధ్రిని జూచి

సప్పటినుండి చోద్యమాయెను నాకు ॥అ॥
దానిపై నామది. కాంక్షింపనాయెను
నా కోర్కె దీర్చియు నన్నూ మన్నింపుము ॥అ॥
అవనిలో వెలసిన అన్యపురీశుడు. సవరిలంబుగ
నాకు జత గూర్చదాయేను ॥అ॥

కీచ మా

అక్కగారు ఈ సైరంధ్రిని ఏ విదమునైన నాకు ఎకూర్చుము తల్లి సుదేష్ణా

సుదేష్ణ-పాట-ఏక

**సోదరా నా మాటలు వినుము**
**ఈ నాతిని గోరంగ నీకు న్యాయంబు గాదురా ॥సో॥**
**దాని పతులేవురు గంధర్వ పరులట**
**పోనీక నిను పట్టి బొలి యివ్వగలరయ్య ॥సో॥**
**సురకాంతల కన్న సౌందర్యవతులైన**
**భార్యలు పదునారు మగువలు నీకుండా ॥సో॥**
**కూటికై మన యింట దాసి పనులు జేయు**
**నాతిని కోరుటా నీతియే మనకింక ॥సో॥**
**అవనిలో అన్యాలపురి హరి మదిని దలచూను**
**చరియింపుచున్నట్టి. సాధ్వీని గోరుట ॥సో॥**

సుదే మా

సోదరా నా మాటలు వినుము యీ పతివ్రత యగు మాలినిపై కాంక్షవీడి నీ భార్యలతో గూడి సుఖియింపుము లేకున్న దీని పతులు గంధర్వులు నిన్ను వధింతురని భయంబగుచున్నదిరా నా మాట వినుము

కీచకుడు - కంద పద్యం

**అక్కా ఎందరు సతులున్నను.**
**ఈ సుందరికిని బోలునట్టి సుదతులు గలరే.**
**యంద్జైన జూచియుంటివే**
**అందంబగు. నిట్టి. యువతి అవనిలో నీవు.**

కీచ మా

ఇలాంటి అందకత్తెను, ఎన్నడైన జూచియుంటివా దీని బొందని ద్రేహంబు ఎందులకు గాన ఎటులైన దాని నా పొందు జేర్చుము అక్కయ్యా

సంవాదం-పాట-ఆది

సుదే పా

సుఖము గాదన్నా పరసతిని గోరుట

సుఖము గాదన్నా ॥సు॥

సుఖము గాదన్నా ఓ సుందరాంగ

పరసఖియలతో పొందు పరమేశుకైనాను ॥సు॥

కీచ పా

సుదతి పరసతి పొందుకన్నా

సుఖము లేదమ్మా మదనా కదనామునను

ఇరువురి మనసు మనసు కలిసి యుంటె ॥సు॥

సుదే పా

దాని పతులకు దెలసినేని నిన్ను మృతియు

జేతురాని మదికి దోసినట్టి కాయం మతి చంచలము గల్గు ॥సు॥

కీచ పా

కంటికి ఇంపైన వాల్ గంటు లెవ్వరైన

గాని వంటిగాను పరులు లేని యింటిలో వంటీగ దొరకతే ॥సు॥

సుదే పా

కులము వారెరగిన చలమున కులములో

వెలిపెట్టెదరను భీతి కలిగి తొందరబుట్టు

కీచ పా

మొగుడులేని వేళ అత్తను మోసగించి

విటుని తగలు కోరి సురతకేలికీని తగిన చోటికి మగువ వచ్చితే ॥సు॥

సుదే పా

దారుని సిరులాచే మీరు వేములపల్లె

శౌరీసాక్షిగా పరనారీ మనుల పొందు ॥సు॥

కీచ పా

బాసిల్లు వేములపల్లె పద్మాక్షు సాక్షిగాను

బాసురాంగులైనట్టి భార్యలెందరైన గాని ॥సు॥

కీచ మా

పరసతి పొందుగోరని పురుషుడెందుకమ్మా

సుదే మా

పరసతుల పొందు గోరిన వారెందరో మృతిపొందిరన్నా

కీచ మా

ఇహ సుఖంబులలో పరకాంత పొందుకు మించినది లేదమ్మా

సుదే మా

దాని పతులు విన్నా హాని గల్గునురా సోదరా

కీచ మా

దాని పతుల బంధించినైనను దాని బొందక విడువ నమ్మా

సుదే మా

రాజదండనకు లోబడుదు వన్నా

కీచ మా

రాజనగా వాడెవడమ్మా

సుదే మా

విరాటుండు రాజుగాడా సోదరా

కీచ మా

నేను పెట్టిన వాడేగద ఇప్పుడే సింహాసనంబు దిగమన్నను దిగవలసినదే

సుదేష్ణ - గీతపద్యం

**ఎంతజెప్పిన వినవు నేనేమి జేతు దైవకృతములు**

**దప్పింపతరముగాదు దాని పతుల చేనైన మదనాగ్ని వతతినైన**

**నీకు మృతి గల్గెనని దోచె నిక్కముగనూ॥**

సుదే మా

నీదగు పరితాపంబు జూడజాల నేట ఇపగలు ఏ విధమునైనా నీ మందిరంబునకు బంపుచున్నాను నిక్కముగా నా మాట విని నీ ఇంటికిని బోవుము తమ్ముడు

కీచ మా

నీ మాట నమ్మి పోవుచున్నాను మరువక పంపవలయును లేకున్న మరల నీవే నెరుంగుదువు పోయి వచ్చెద నా చేతిలో చేయి వేయుము

## (విరాట రాజు సభ)

రాజు మా

మహాత్మా మీ వలన పుణ్యకథలు వినగోరితిని వినిపింపుము

ధర్మ మా

అలాగే వినుము మనునీతి దప్పని రాజ్యపాలనమున్ను శాస్త్రనీతి దప్పని వేద పురాణమున్ను చెప్పుచున్నాను సావదాన చిత్తుండవై ఆలకింపుము

రాజు మా

నా సిరసావహించెదను చెప్పుడి మహాత్మా

జెట్టివాడు రాకట-పాట-ఆట

**జెట్టివాడు వచ్చెను విరటుని సభకు ॥జె॥**

**జెట్టి వాడూ వచ్చె జనులెల్లా బొగడాగ**

దిట్టాముగా నడుము దట్టీని బిగియించి ॥జె॥
మనమూనా అన్యాపురీశుని దలచుచు చెనువు మీరగ
పాండు తనయూల వెదకూచు ॥జె॥

కంద పద్యం

దండము. నీ సత్కీర్తికీ
దండము నీ దైనయట్టి దాతృత్వముకున్
దండము నీదైరతకును
దండంబులు నీకు మత్స్య ధరణీనాథ॥

జెట్టి మా

మీకు పది వేలు దండంబులు విరాట భూపాలా

రాజు మా

దండంబు బెట్టుచున్నావు నీ వెవ్వండు ఓయీ

జెట్టి మా

జగజట్టియను నామంబుగల వాడనయ్యా విరాట భూపాలా

రాజు మా

నీవు వచ్చిన కార్యంబేమి జెప్పవోయి జెట్టివాడ

జట్టివాడు - యాలలు

రాజ రాజ వినుము నేనూ దేశ దేశములకు వెల్లి మల్లయుద్ధము చేయువాడను
ఓ విరాట భూపాల చాల మల్లుర గెలచి యున్నాను ॥రాజ॥
యాబది యార్ దేశములలో యందు గెలియునట్టి
మల్లులెవరు కానరారైరీ ఓ మత్స్యావనీంద్రా.
నీ వద్దయున్న నాకు దెల్పుడీ ॥రా॥

జట్టి మా

యాబది యార్ దేశములలో మల్లురు నా చల్లడంబు క్రింద దూరని వారు లేరు
గాన నీ వద్ద నుండిన జెప్పుము లేకుండిన వెల్లెదను

రాజ మా

ఓహో యతీంద్రా ఈ జట్టివానితో పోరునట్టి వీరులు మన జట్టీలలో లేరుగద

ధర్మ మా

ఇట్టివానితో పోరువాడు ధర్మరాజు చెంతయొక బలవంతుడుండెను అతడు ఇ
మీ ఇంట వంటశాలయందు వలలుండను వాడు వీనిని గెలచును బి
నంపుడు

రాజు మా

నీవేగి వలలుని బిలుచుక రమ్ము

మంత్రి మా

చిత్తము మహారాజ ఓహో వంటలవాడా రాజాజ్ఞ రమ్ము

భీము మా

ఆలాగే నడువుము

భీముడు - కందపద్యం

**దండము నీకు రిపువేదండోగ్ర**
**మృగేంద్ర శతృధర దేవేంద్రా దండము కరుణాసాంద్రా**
**దండము మత్స్యావనీంద్రా. దండము నీకున్.**

భీము మా

పది వేలు దండంబులు మహాత్మా

రాజు మా

సుఖీభవ ఇంత తడవేలజేసితివి వంటలవాడ

భీము మా

ఏడు పుట్ల బియ్యంబు ఎసట వేసి యుంటిని ముప్పొందూము కందిపప్పు ముద్ద కూడుకు వేసియుంటిని పుట్టెడు సెనగపప్పు పూర్ణిమనకు వేసియుంటిని పందూము సజ్జ పరమాన్నమునకు వేసియుంటిని గాన అర క్షణంబు ఆలస్యంబాయెను విరాట మహీపాలా

రాజు మా

చాలా సంతోషముగాని ఈ జట్టివాడు మల్లయుద్ధము గోరి వచ్చియున్నవాడు నీ వృత్తాంతంబు ఈ యతీంద్రులచే విని నిన్ను బిలచాను వీనితో బోరుము

భీము మా

మీ సెలవైతే ఆలాగే బోరెదను మేలు మేలు నా శరీరము దురద తీరునట్లు మల్లయుద్ధంబు జేయవచ్చితి నీ పేరేమో జెప్పవోయి

జట్టి మా

నా పేరు జగజ్జట్టి యందురు నీ పేరేమిటోయి

భీము మా

భూమండలంబునగల జట్టీ తండంబుల గుండె గాలంబై యున్నవాడ వలలుండను నామధేయుండ విరటు నింట వంటలు చేయువాడనోయి

జట్టి మా

వారేవ్వా వంటలవాడ తెలిసె తుంటవంట ఇంటనుండక బల్ బంటువలే మినమింటి గొంటుపోతు మాటలు వెంటనే పల్కుచున్నావు నీ కంటి క్రోవడంచెద యించుకసేపు చంచలింపక యుండరావోరీ మసిబానసట్టి

భీము మా

ఓరీ పట్టపు రాజు ఎదుట వట్టి కూతలు గూయనేల నాదగు గట్టల్కకు బిట్టల్కగా దట్టంబుగా నిలిచితివేని నిన్ను జగజ్జట్టి యను పేరు పెట్టెదను లేకున్న నీ పేరు తీసివేసి నిన్ను బలసిన సూకరంబని పేరు పెట్టుచున్నానురా కట్టడి

జట్టి మా

అట్టి కట్టడి గనుకనే విరాటు నింట వంటలు జేయుచు కంటికింపైన అత్తిరసంబులు పిండి వంటలు, అప్పడంబులు, మండిగెలు, సండిగెలు, గారెలు, బూరెలు, పేణీలు, వడలు, హోళిగలు నప్పచ్చులు, కుప్పలు కుప్పలు నేతిని అద్ది సప్పరించుకమ్రింగి దొడ్డకాగవలె కడుపు పెంచుకొని నిండు చూల బర్రెలాగ బుసకొట్టుచు మట్టుమీరి ఇట్టి కూతలు గూసిన నే బిట్టల్కుదునా తిండిపోతు రండా

భీము మా

అట్టి రండవు గనుకనే కండలు బెంచుకొని ఉండబట్టలేక యనుబోతువలె దిరుగుచు కండక్రొవ్వున నా బోటి దండి మగల్లతో బండనంబునకు వచ్చితివి భళిభళి నిన్ను మెచ్చితి ఇది గచ్చుకూతలుగావు ఈ ముష్టియుద్ధంబులో నా అరచేతిన తట్టివేతునా

జట్టి మా

తట్టివేయను రొట్టెలా

భీము మా

ఓరీ నిన్ను మెత్తగా నొత్తి మడచి వేతునా

జట్టి మా

మడచి వేయను హోళిగెలా

భీము మా

ఓరీ నిన్ను కాలన్ దన్ని నేలన్ పొర్లింతునా

జట్టి మా

పొర్లించను పూర్ణమ కుడుములా

భీము మా

ఓరీ నిన్ను బండతో మెదపి ముద్దజేతునా

జట్టి మా

ముద్దుజేయను గోధుమ పిండియా

భీము మా

నీ కండ్ల రక్తముదింతునా

జట్టి మా

దించను కూటికుండలా

భీము మా

నీ కండ్ల క్రొవ్వు కరిగింతునా

జట్టి మా

కరిగించను నేతి కడవలా

భీము మా

నీ కాల్లు చేతులు విరతునా

జట్టి మా

విరువను వంట కట్టెలా

భీము మా

ఓరీ వట్టి మాటలతో కాలహరనంబేల మన తారతమ్యంబులు ఈరాజు సభికులు జూడ మల్లయుద్దము చేయుదము రారా జట్టి

జట్టి మా

అలాగే గావింతము రారా

సంవాదం- పాట

భీము పా

ఓరీ నీ కరములు రెండొక్కచేత బట్టితీని

ధీరుడావైతేను పట్టు విడిపించుకోరా ॥ఓరీ॥

జట్టి పా

నీ పట్టు విడపించుకోని నిష్టుర నా ముష్టినిదిగో

కోపించి నీ బరులు విరగగొట్టితి పోరా ॥నీ ప॥

భీము పా

కొట్టితే విడతూనే నీదు కొన వెంట్రుకల్

ఒడసిపట్టి మట్టుమారులేక నిన్నుపట్టి త్రోక్కితి ॥కొ॥

జట్టి పా

త్రోక్కితే విడతూనే నీదు తొడలు రెండు జేర్చిపట్టి

మట్టుమారు లేక నిన్ను మర్దించితిపోరా ॥త్రొ॥

భీము మా

వరె పందిలాగ తిని ఏనుగులాగ బలసిన ప్రయోజన మేమున్నది పట్టుపట్టి యుద్దము చేయుము

భీము పా

అదమూదా వేమూలపల్లె హరిసాక్షిగాను

నిన్ను సభికులందరు జూడ సంపివేసితి ॥అద॥

భీము మా

మసిబానము సట్టి మట్టులోతున బెట్టిన శుంఠ॥ ఓ విరాట భూపాల వీనిని వధించితిని నింక నాకు సెలవా

రాజు మా

చాలా సంతోషము నిన్ను మెచ్చి ఈ బహుమతిలిచ్చితి గైకొనుము

భీము మా

వంటల వానికెందుకయ్యు ఈ బహుమతులు పేదలకు పంచి పెట్టుము యతీంద్రా మీ కృపచే వీనిని చంపితిని నాకు సెలవా

ధర్మ మా

ఆ భగవంతుని కృపచే గెలచినందుకు సంతోషము జాగ్రత్తగా వెళ్లిరమ్ము వలలా

(సుదేష్ణ - సైరంధ్రి)

సుదే మా

ఓ చెలి సైరంధ్రి నిచటికి రావే అబ్బా దప్పి నొప్పి శీగ్రముగా రమ్ము భరింపలేను

సైరం మా

ఏమమ్మా ఏమి ఏలమ్మ ఇట్లు బాధపడెదవు ఏమయినదమ్మా

సుదేష్ణ-పాట-ఆది

**ఏమి జేతునే సైరంధ్రీ ఇంకేమి జేతునే సైరంధ్రి ॥ఏమి॥**

**ఏమి జేతునే యిల వేముల పల్లె ధాముని సాక్షిగా దప్పి బుట్టెను ॥ఏమి॥**

**మందగమన ఏ మందు దీనికి మందొసంగియు మాన్పకున్ననూ ॥ఏమి॥**

సుదే మా

అబ్బా బాధ దప్పి మందు ఇవ్వవే సైరంధ్రి నేను బ్రతుకజాల

సైరం మా

ఇందులకేమి ఉపశమనంబు జేయవలయునో చెప్పరమ్మా

సుదే మా

ఒక అవుషధము జెప్పుచున్నాను సమకూర్చెదవమ్మా

సైరం మా

నా యత్నమున్నంతలో సమకూర్చెదను

సుదే మా

అయితే చెప్పుచున్నాను వినుము

కందపద్యం

**కీచకుని ఇంట నెప్పుడు**

వాసవియగుబహు విధంబు వాసన గల్గున్
దీసుక రమ్ము నీవు
అచటికి తీవ్రముగ వెల్లగదమ్మ ఇప్పుడున్

సుదే మా

కీచకుని ఇంట పరిమళోదకంబైన కల్లు దెచ్చి నా దప్పి దీర్చుము సైరంధ్రి

సైరం మా

ఈ నీచపు పనికి నే బోవజాల మరినెవరినైనా బంపుము

సుదే మా

కల్లు త్రాగుట హీనంబుగాన మరి ఎవరికైన దెలసిన గుట్టు బైట బెట్టుదురని నిన్నే వేడితిని

సైరంధ్రి–పాట–ఆట

న్యాయమే నమ్మా నీ విటు బలుక ॥న్యా॥
న్యాయమేనమ్మా ఓ తోయజదళనేత్రి
పాయక పొరుగిండ్ల పనులాకు నను బంప ॥న్యా॥
పరుల ఇంటికి నన్ను బంపనని మాట మరచి
కీచకుని మందిరమున కనుప ॥న్యా॥
మగవారులుండేటి మందిరమున కొంటిగా
మగువలపోయి రమ్మని చెప్పనొంటిగా ॥న్యా॥
పనిబూని ఈ పని కనుపగ నీ వద్ద
వనితలు లేరే నా వద్ద ఇట్లాడుట ॥న్యా॥
వాసిగ శేషాశైలేసుడెరుగు నాకు బాసయిచ్చిన
మాట యోచింపకాను ॥న్యా॥

సైరం మా

నాడు నాకు ఇచ్చిన మాట మరచి ఈనాడు పరాగృహంబున కనుప న్యాయమా తల్లి సుదేష్ణా

సుదేష్ణ– ఉత్పల పద్యం

న్యాయము దప్పినాననుచు నాతిరోనన్నిట్లు బలుక నేలనే
నా యనుజుండు కీచకుడు నమ్మిక నీ యనుజుండు గాదటే
న్యాయము నిను నేనటకు నంపుట బోవుట నీకు
న్యాయమో తోయజనేత్రి ఈ పలుకు తోచగ బల్కుటగాదే యంచగన్

సుదే మా

అది పరాగృహంబు గాదు నీ గృహంబని పోయి రావమ్మా మాలిని

సైరం మా

అయితే నీతో పెక్కు మాటలేలా నొక పాత్ర నొసంగుము దేవి

సుదే మా

ఇదిగో ఈ కనక మయమైన పాత్రగొనిపోయి రావమ్మా పోయిన పని సక్కబెట్టుకొని రావమ్మా సైరంధ్రి

సైరంధ్రి-పాట-ఆది

సైరం సాకి

హే ప్రభో రావా నా మొర వినవా నీ కన్న దిక్కెవరు ఓ రాధారమన

సైరం పా

**పూజింతును నా మదిలోనా. నను దిగనాడగ వలదన్నా**

**ఈ నాటికిని ఈ విపరీతము పొసెగెను ఇక నాకే గతిదేవా ॥హే ప్రభో॥**

**మోసకారియై యా సుదేష్ణయు మోసముచే**

**నను బంపించే యా కీచకుని పాలబడక నను గాసి రక్షింపుము స్వామీ ॥ప్రభో॥**

సైరం మా

అన్నా కృష్ణదేవా ఆపద్బాంధవా, అనాద రక్షకా, రుక్మిణీ వల్లభా కాపాడు బారము నీదేగదా తండ్రి యా కీచకునిచే నా వ్రతంబు చెడకుండా కాపాడుము స్వామీ

సైరంధ్రి-పాట-ఆది

**బాస్కరా భవ్యచరిత నను బ్రోవుము. వేడెద పరమ పావనా ॥బా॥**

**పతివ్రత నగునా పరగవ్రతంబును క్షితిలముగాకను సతతము బ్రోవుము ॥బా॥**

**నిను నమ్మియును నీచపు పనికిని పోయెద కీచకు పాలబడక నను ॥బా॥**

**నీవే గతినాకు నిలలో నన్యాపురదాస పోష రవి తేజో పద్మాక్షా ॥భా॥**

సైరం మా

ఓ సూర్యదేవా. నిన్ను నమ్మి పోవుచున్నాను యా కీచకునిచే భంగపడకుండ బ్రోచి రక్షింపుము

(కీచకుడు - మంత్రి)

కీచ మా

రే మంత్రీ ఏమిరా మా అక్కగారు ఇంకనూ యా సైరంధ్రిని పంపలేదు విరహ వేదనకు బరింప జాలకున్న వాడ అది వచ్చునో రాదో గదరా

మంత్రి మా

రాక ఎక్కడికి వెల్లును మీరు మందు కొట్టండి దొరా

కీచకుడు-పాట-ఆది

ఒహ్వోరే ఈ బ్రాందీ బల్ భేషుగున్నాది

వహ్వారే సారాయీ వద్దు పొమ్మనాది ॥ఒ॥
అపినీ బంగ్యాకుతో ఆడుకోమన్నది
అసలైన కల్లుతో కూడుకోమన్నది ॥ఒ॥
రమ్ము మదత్తుతో రమియింపమన్నది
కోమలి వచ్చితే కోర్కె తీర్చునన్నది ॥ఒ॥

కీచ మా

బలే బలే ఉన్నది రా డ్రింక్ బ్రదర్

సైరం మా

అన్నా కీచకాగ్రజా

కీచ మా

ఆహా ఎవరూ ఆఆ నీవా కోమలీ సుస్వాగతం సుస్వాగతం ఏలా అలా
నిలచావు రమ్ము లోపల సిగ్గా ఈ మంచము పైకి రమ్ము సుందరీ రమ్ము

సంవాదం – యాలలు

సైరం పా

కల్లుద్రావా బుద్ధిపుట్టి కలకంఠియైన
సుదేష్ణా కల్లుదెమ్మనీ నన్నూ బనచేనూ
ఓ. ఓ కీచకా కల్లుబోసి ఇమ్ము పొయ్యేనూ ॥క॥

కీచ పా

కల్లూ బంపించేను గానీ కమ్మనీ
వాసానగల్లు కల్లుద్రావి కైపుచే మీరి ఓ. ఓ
సైరంధ్రీ కాంక్షదీర, భోగింతము రావే ॥కల్లూ॥

సైరం పా

పరమాత్మునీ సాక్షిగానూ, మధ్యపానము
చేయకుందానూ ఓ రన్న కీచకా. పరగ వ్రతము జల్పుచున్నారా ॥క॥

కీచ పా

కొమ్మరో సుదేష్ణాదేవీ కోర్కె దీర్చ వచ్చితీవి
కొమ్మకూ తమ్ముదా గానటే.. ఓ. ఓ సైరంధ్రీ సమ్మతి నా కోర్కె దీర్చావే ॥కల్లూ॥

సైరం పా

మగనాలినీ. నన్నూ ఇట్లు నగుబాటూలు
జేయనీకు తగదురా గంధర్వు లేపురూ ఓ ఓ కీచకా.
మగలు గలరూ నిన్ను జంపేరూ ॥క॥

కీచ పా

బెట్టుగా గంధర్వులనుచు బెదరించెదవు

నీదు రెట్ట బట్టీలే గంధర్వులేరీ
ఓ ఓ భామా సైరంధ్రీ ఓ లలనా సైరంధ్రీ
పాన్పు మీదికి పోదాము రావే ॥కల్లూ॥

కీచ మా
కాంతామణి ఎందులకు భయంబు జెందెదవు రమ్ము నీవెన్నాడు మగవారి
పొందెరుంగవా నీ మగల్లు నన్నేమి జేయజాలరు మర్యాదగా రమ్ము

సైరంధ్రి-పాట-ఆది
తగునేమిరా కీచకాగ్రజ నీకు ॥త॥ తగని మాటలాడి అగడు జేయనీకూ ॥త॥

కీచ మా
సొగసు కీల్ జడదాన సోగ కన్నులదాన

సైరం పా
పరకాంతలాను పొందగోరి మదిని సిరియు నాయుకీర్తి ధరణి గూలి పోవు ॥త॥

సైరం మా
ఓరీ దురాత్మా నా చెయ్యి విడువుమురా దుర్మార్గా

సంవాదం-పాట-ఆట

కీచ పా
వారిజముఖి నీపై వాంచ లెచ్చాయను.
కోరిక ధీర్చవటే సైరంధ్రీ నా కోరిక ధీర్చావటే ॥వా॥

సైరం పా
కోరిక ధీర్చా నీకున్న యింతులు గాక వేరేల
తలచేవురా అగ్రజ నీ వేరేల తలచేవురా ॥కో॥

కీచ పా
వేరే కాంతల జప్పనేల నాకును వక్క సారైన
ముద్దియ్యవే ఓ సైరంధ్రీ ఒక్కసారైన ముద్దియ్యవే ॥వే॥

సైరం పా
ముద్దు పెట్టామాని హద్దుమీరిట రాకు
బుద్దిగైకొని బ్రతుకారా రాజేంద్రా. బుద్దిగైకొని బ్రతుకరా ॥ము॥

కీచ పా
జలజాక్షి నిన్నూ కన్నుల జూచినంతానే వలపూలు
మెండాయెనే సైరంధ్రీ నా వలపూలు మెండాయెనే ॥జ॥

సైరం పా
వలపు లూరే నసుచు వచ్చేవు దూరాన నిలచి
విచారింపరా కీచక వోరీ॥ నిలిచి విచారింపరా ॥వ॥

కీచ పా

వాలుగంటిరో నీవు వచ్చి పోయెదవంటే
ఏలాగు తాలుదునే సైరంధ్రినే నేలాగు తాలుదునే ॥వాలు॥

సైరం పా

యాలానాపై వాంచ చాలించు పనిశైల పాలుని
మధిదలచరా రాజేంద్రా శ్రీహరిని ధ్యానించరా ॥యా॥

సైరం మా

ఓరీ నీచుడా పతివ్రతయగు నన్ను నీ విలాగున బాదించుట మర్యాదగాదు నారెట్ట విడువుమురా

కీచకుడు-ఉత్పల పద్యం

మోహము దీర చేయగదే మొన్నటి రాతిరి. నీవు నాకలన్ వచ్చియు
లేవ నెత్తుకొని వత్రున గుబ్బలు నాదు రొమ్మునన్ గృచ్చియు
కౌగలించుకొని కోరికదీర రమించునట్లుగా కలగని
మేలుకొంటి నినుగానక నే పరితాప మొందితిన్.

కీచ మా

కాంతా ఏల నన్ను జేలచేసెదవు నా మోహము దీర్చుము

సంవాదం-పాట-ఆట

సైరం పా

వోరోరి తుంట నను రెట్టబట్ట చాలు
పోపోరా నికచాలు పోపోరా ॥ఓరో॥

కీచ పా

రావేల భామా హేమాల లామా
కోర్కె దీర్చగదే నా కోర్కె దీర్చగదే ॥రా॥

సైరం పా

ఛీ ఛీ క్రూరా ఇది నీకు మేరా
చాలు పోపోరా నిక చాలు పోపోరా ॥ఛీ॥

కీచ పా

హహ్హహ్హా బాలా నిను విడజాలా
జాలమేలానే నాపై జాలమేలానే ॥హ॥

సైరం పా

ఇక్కడ నీ సెయ్యి చిక్కుదునా

కీచ పా-

చిక్కక నీ వెందు బోయెదవే

సైరం పా

వద్దురా ఈ పద్దులు చాలించు ఇక నీ సుద్దులూ ॥వ॥

కీచ పా

యేలవే నన్నేలవే ఇక తాలనే నవమోహిని ॥రావేల॥

సైరం మా

ఓరీ దుష్టా నావెంట నంటి రావలదు వెడలిపొమ్ము

కీచకుడు – కందార్థం

కలకంఠి వినవే భువిలో

గల సైరంధ్రి జాతి కాంతలకును చెలువంబు లన్ని జూడగా॥

కలికీ. ఇటు బలికెద వేమే కామినీ నిను

వలచిన నే బామినీ॥ తులవ మరుడు నను పలు మరు విరి

శిరముల నాయద ప్రయ్యలముగ వేసేనే కామినీ.

కీచ మా

మన్మదుని బాద కోర్వ జాలరమ్ము నను కౌగలిమ్ము తరుణి

సైరంధ్రి – సీసపద్యం

పూర్వంబు నందు భూ పుత్రిని చెరబట్టి రాముచే జావడే రావనుండు॥

మునిపత్ని అహల్యను మోహించి ఇంద్రుండు యొదలెల్ల యోనులై బరగెతొల్లి॥

శరరుండు నలమహీశ్వరుని బార్యను గోరి శాపనలంబున సమసిపోడె॥

నేడు నను గోరి నీవు నీ ప్రాణముల్ బాపుకోనేల నా పతుల చేత॥

గీత పద్యం

మంచి తనమున జని బుద్ది నెంచి య

దను నీ సతుల గూడి సుఖియించు నెమ్మదిగనూ

చెనటి నీకేల నిప్పుడీ చెడు తలంపు

తరులు వేవేగ కీచకాధముడనవలా॥

సైరం మా

రావణాసురుండు, ఇంద్రుండు, శరబుండు, పరస్త్రీల గోరి చెడుట ఎరింగియు

నన్నుగోరి నీవేల నా పతులచే హతంభయ్యెదవు ఊరకేల మర్యాదగా కీచకా

కీచకుడు – కందార్థం

ఈ మహిలో పన్నగగిరి దాముని పలుమారు నాత్మదలచంగ మేలేమి

తరుణంబు నీకిది॥ కోమలీ. చనునిచ్చి నన్ను గూడవే

నెనరూన మాటలాడవే॥ లేమరో నీ దగు మోము గనుంగొని

కాముడు ఇక బ్రతుకంగ నీదు నను గూడవే॥ నెనరూన మాటలాడవే॥

కీచ మా

నీ వెన్ని జెప్పి నను నీపై మోహాతిశయంబు మారలేదు గాన ఏమైనను సరే నీతో పొందకిడువనే తరునీ

సైరంధ్రి – కందార్థం

ఓరన్న రాజశేఖరా సైరంధ్రి హీనజాతి సతియగు నన్నన్
మారుంక్రీడకు రమ్మని॥ పోరాడగనేల నీకీ
భువినింద గాదా నీ కులము పెంపున నారిపోదా॥
దారుణిలోయ వనారి మనులను నాడు తీరున నిట్లాడ మేరగాదు నీకు ॥భువి॥

సైరం మా

ఓరీ దుర్మార్గుడా పరస్త్రీలను కోరిన నీ కులము నాశనంబై పోక మానునా ద్రోహి

కీచకుడు – కందార్థం

వనితా నా వద్దకు వచ్చిన దానవు. మరలిబోవ జల్లునటె యో
వనరుహాలోచన నను రతి బెనగి సుఖించకను ఇంత బిగుతనమేలా
నేర్వనేమందు నీ బెడదీకి వేలా యనలేని సంతోషమున
నను దేలించ కను ప్రార్థన లెక్క గొనగ దేనీకింత బిగు తనమేలా॥

కీచ మా

నే నిన్ను జూచి వచ్చినప్పటి నుండి నీవే నా కలలో కండ్లలో నా పాన్పులో మెలగుచు నన్ను ప్రాణంబు తీయుచున్నావు రమ్ము రతి దేలించుము లేకున్న నిన్ను బలత్కారంబు చేతనైన పొందక విడువనే సైరంధ్రి

కందపద్యం

చిక్కితి వెక్కడ బోయెద వక్కట నీ
పతుల మీద యాశ విడచియున్ మక్కువ
తోడుత నీ దగు చెక్కెర కెమ్మోవి ముద్దొసంగ
వే తరుణీ॥

కీచ మా

నాకొక ముద్దివ్వు రమ్ము ఈ పాన్పు మీదకి నా కోర్కె దీర్చవే సుందరీ।

సంవాదం–పాట–ఆట

సైరం పా

విడువరా నన్ను కీచక వోరీ ॥వి॥
విడువిడు విడు నన్ను వీధిలో జడబట్టి
కడువడితో నన్ను గాచి పెట్టగ నేల
నిడుద మంటలు బగ్గుబగ్గున వెడల నగ్నిలో బడగ

దుమికెదు మీదత చందంబు
నను నిటు మిట బదగానేలరా ॥వి॥

కీచ పా

విదువానే నిన్నూ సైరంధ్రీ నే ॥విదు॥
విదువనే నను వేయు విదముల వేడిన
పదటి రాత్రుల నిన్ను బోగింపకా
తదయకను నా కోర్కెదీర్చిన తామరస దళనేత్రి నా
మెదన యుండిన చంద్రహారము
మెచ్చియును నీ మెదను వేతునే ॥వి॥

సైరం పా

అక్కజముగ నన్ను అరడి బొందించి నిక్కముగను
పట్టి నిందలు బడనేల దిక్కు లేదన బోకు నాకును
ధిక్కు హరి గలదుక్కు బాద్బల జెక్కి నీదగు కండలెల్లను
కుక్కలకు వేయింతురా ॥విదు॥

కీచ పా

చిక్కితి విదె నాకు దక్కితి విప్పుదు
చెక్కెర కెమ్మోవి నొక్కి ముద్దాదగ పెక్కుమాటలు
విదచి నను నీ పక్క జేర్చితి వేని మెరపగు చొక్కటం బౌరవలు
జెక్కిన సొగసు పదకం బిత్తు నీకు ॥విదు॥

సైరం మా

ఓరీ ద్రోహి నా కరంబు విడువుము నా వెంట రావలదు చెండాలుడా॥

(విరాటుడు - ధర్మరాజు - భీముదు)

రాజు మా

మహాత్మా ఈ పుణ్య కథలు విన్నాను చాలా ఆయాసంబుగా నున్నది కొంత తడవు పగడాడుదము రమ్ము

ధర్మ మా

అలాగే నాడుదము

రాజు మా

వలలా నీవును ఇందు ఆసీనుండవు గమ్ము

భీము మా

అలాగే కూర్చున్నాను

సైరం పా

క్షితిని వేములపల్లె శ్రీ సు సాక్షిగాను నా పతులు వినన నిన్ను హతము గావించేరు

క్షితి తలంబున పెక్కు దినములు బ్రతుకవలెనని యుండినను పరసతుల నెల్లను
నీ తల్లులుగ మదిని దలచర దుర్మతీ ॥విడు॥

కీచ పాట

క్షితిని వేములపల్లె శ్రీసుదు వచ్చిన అతివరో
నీ గుబ్బలధిమి చేపట్టకా ప్రతి దినంబును నన్ను
సమయుపరతుల నీవును దేలనిచ్చిన రత్నముల్
కీల్ కడియముల్ సమ్మతముతో నీ కిత్తునే ॥వి॥

సైరం మా

ఓ సభికులార ఈ కీచకుదు నన్నుపట్టి అవుమతింప బూని యుండుట గని
మీరు

పాట

కంటిరే వో సభికులారా కన్నులలర ॥కంటి॥
కంటిరే వో సభికు లార కటినుదైన
కీచకుందు వెంటనంటి వచ్చినాదు వేణిబట్టీడ్చీన విదము ॥కం॥
కల్ల గాదివేళా మత్స్యవల్లభూని దేవి పనుపున
కల్లుకనుచు పోతే వీడు కటకటా ననిట్లు జేసె ॥కం॥
భలవంతు లేవురు నా పతుల గల్గి నే
నిట్లయితి ఒక్క చెలువుదున్న సతులీ పురిలో
జేతురె సంసారంబు ॥కం॥
నా పతుల కిపుడు వీనిభట్టి హతము చేయ వేళకాదు
సతతము వేమూలపల్లె స్వామి ఎట్లు రక్షించునో ॥కం॥

సైరం మా

ఓ విరాట భూపాలా నీవు పరమ ధయాలుందని వింటిని అట్టి నీవు ఈ కీచకుని
ఏలదండింపనైతివో రాజ నీవెంత పాతకుదవు

రాజు మా

ఈ దుష్టాత్ముదైన కీచకుని దండించు సామర్థ్యంబు నాకు చాలదు నన్ను
నిందిపవలదమ్మా సైరంధ్రి

సైరంధ్రి–పాట–ఆట

అమరూల వలె మీరు ఆకాశమున నుండి నాదులార॥
నేదు సమయ మేర్పడక మీరెచ్చట నున్నారో ॥నాధులార॥ ॥అ॥
తనయాలి నొకదు దుర్దశ బెట్టుచుందాగా నాదులారా
మీర దండింప కూరకే యుండట తెలియాదు నాదులారా ॥అ॥

ఈతల కీచకు డిట్లు గావింపాగా నాదులార
శేషశైల వాసుదు మీకు చెయ్యాడనివ్వదు ॥నాదులార॥ ॥అ॥

సైరం మా

ఓ ప్రాణ నాధులార గంధర్వ వరులార యెందుపోయితిరి మీరైన వీని చిత్రవధ గావించి నా శర విడిపించరా స్వామి స్వామి

(భీముడు మాను పెరుకవలెనూ)

ధర్మరాజు - కంద పద్యం

ఇల జనుల కెల్ల నీడగ
గల వృక్షము బెరుకనేల. కట్టెల కొరకై వలసిన
స్తలములు దొరకద వలలా ఇక
సాలు పొమ్ము వచ్చిన త్రోవన్॥

ధర్మ మా

వంటల వాడ ఫల పుష్పభరితంబై యొప్పు ఈ రస్నవారలకు యోగ్యంబే ఈ వృక్షంబు బెరికిన లాబమేమున్నది నీకు కావలయునన్న వేరు స్తలములు లేవా పొమ్ము

భీము మా

వంట కట్టెలకై విరువబూనితి నీ వలదన్న విడచితి నింక బోయి వచ్చెదను యతీంద్రా

సైరంధ్రి - గీత పద్యం

వినుడి సభా మధ్యనున్న వో పెద్దలార
సాధ్వియని యంచకను నిట్లు కీచకుండు నన్ను
బట్టి యాడ్చినది నెరిగియు పాతకునకు తగిన దం
డన జేయకుంట ధర్మమగునే॥

సైరం మా

మీరందరుండియు ఈ దుర్మార్గునికి వెరువతగునా పెద్దలార

ధర్మరాజు-పాట-ఆది

ధర్మ పా

తగునటే ఇటు లాడగ ఓ మగువరో ॥తగు॥
పతివ్రత నీవై యుండి పరుల నెరుంగగా
రావచ్చునా ఇట్టి రాజ సన్నిదికి ॥త॥
చాలును చెనుమింక భూపాలుని సతికడకు
ఏలను నీవు సకాలము నెరుగక ॥త॥

ధర్మ మా

ఓ యింతీ పతివ్రతయై యుండి నీవు యీ రాజస్థానంబునకు రాతగునా సైరంధ్రి

సైరం మా

ఈ రాజ సభకు వచ్చుటన్ జేసి కీచకునిచే బంగపడక బ్రతికితిని గదా యతీంద్రా

ధర్మ మా

అటు గాక వచ్చితి వేణి మానంబు విడచి యింత తడవుండ తగునా సైరంధ్రి

సైరం మా

జూదరి వాని భార్యకు మానం బెక్కడదయ్యా యతీంద్రా

ధర్మ మా

నాట్యం బభ్యసించు దానివలె ఎంత బాగ నడుగులిడుచున్నావే సైరంధ్రి

సైరం మా

నాట్యం బభ్యసించెడు వాని భార్యకు నాట్యంబభ్యసించుట సహజంబే గదా యతీంద్రా

ధర్మ మా

నీ పతులగు గందర్వులకు నిది సమయంబుగాదు వారిని నిందించక నీ మందిరమునకు బోవే సైరంధ్రి

సైరం మా

మంచి బుద్ది వెల్లి వచ్చెద యతీంద్రా

సైరంధ్రి - పాట

**శ్రీ దుక్మిణీ లోలా బ్రోవారా నన్ను ॥శ్రీ॥**
**సారస నయనా సరగుణ బ్రోవు ॥శ్రీ॥**
**అభలను నేనూ ఆపద పాలైతి కృ**
**పతోడ గావరా నెనరుంచి నా తండ్రి ॥శ్రీ॥**
**ఆనాడు సభలోన ఆదరించావు ఈనాడు కీచకు నీచే నవమాన మొందక నన్నూ ॥శ్రీ॥**

సైరం మా

అన్నా కృష్ణదేవా నీకన్న వేరు అన్యులెవరున్నారు కాపాడుము స్వామి

కీచకుడు-పాట-ఆది

కీచ పా

**చిక్కితి విప్పూడు ఎక్కడ బోయేవు సక్కని కోమాలీ**
**నొక్కి ముద్దాడగా ॥చి॥**

నీ పతులేమైరీ నవనీసుదేమానె
సభికులందారు నన్ను సాధించిరా ఏమీ ॥చి॥

కీచ మా

నిలువుము ఇంక నా వద్ద నుండి తప్పి పోజాలవు తరుణి

సైరంధ్రి - శూర్ఢ

ఓం నమోణారాయణాయ భాస్కరాయ భవ్య చరిత
పరమ పావనా పాపవినాశనా రక్షింపుము రక్షింపుము. సూర్యదేవా.

రక్కసుడు-పాట-ఆట

రక్కసుడరుదెంచేనూ ఆర్భాటమున ॥రక్క॥
రక్కాసుడరుదెంచె రయమూనా కీచకు బెదరించి
సైరంధ్రి విడపింప తాగోరీ ॥కీచ॥
గొప్ప నిప్పులు కన్ను రెప్పాలు తప్పాక
గుప్పుగుప్పున రాల బెబ్బిరింపుచు వేగ ॥ర॥
పట్టుగా వేములా పల్లె శ్రీహరి తోడు గొట్టి
కీచకు నేల తట్టున బడవేయ ॥రక్క॥

(కీచకుని కొట్టుట - వాడు క్రిందబడుట - సైరంధ్రి పారిపోవుట)

కీచ మా

అబ్బా ఇది ఏమిరా ఈ ఆడది ఎంత దెబ్బ కొట్టినదిరా

మంత్రి మా

దొరా దొరా ఏమిదొర మన్ను తింటున్నావు లెమ్ము లెమ్ము (అని కొట్టును)

కీచకుడు - పాట - ఆది

కీచ పా

బోంకించి పోతివే సైరంధ్రీ నన్నూ బోలనూకి పోతివే సైరంధ్రి ॥బోం॥
ఎంత వోంత కారివే సైరంధ్రీ నీవెంత నేర్పుదానవే సైరంధ్రి ॥బో॥
ముద్దు పెట్టనిమ్మంటె సైరంధ్రి ఇంత మూర్ఖమూన బోతివే సైరంధ్రి ॥బో॥
వేములాపల్లె శౌరీ సైరంధ్రి నీవెంట తోడై వచ్చెగదవే ॥సైరంధ్రి॥ బో॥

కీచ మా

ఓసీ నాచే తప్పి ఎక్కడికేగెదవు

సీసపద్యం

భూభువర్లోకాలా పురములో ఎందైన తాలమేసిన యింట దాసనిమ్ము॥
సొర్గలోకములోన దుర్గమందున నిల్పి గట్టి బందోబస్తు పెట్టనిమ్ము॥
పూర్దలోకములోన ఊహించగా రాని ఎచ్చోటనైన బంధించనిమ్ము

అతల వితల సుతల తలాతల రసాతల పాతాలాది లోతు లోకము
బోవనిమ్ము॥
కటిక యమ్ముల కాపాలా గాయనిమ్ము తరుణి పదునాల్గు భువనాలు తిరగ
కలుసు కొందును నిను నేను తెలుసుకొనుమా॥

కీచ మా

మాయలాడి నీవెందు దాగినను నిన్ను పొందక విడువనే బామా సైరంధ్రీ సై

(సుదేష్ణా సైరంధ్రి)

సంవాదం-పాట-ఆట

సుదే పా

ఎవ్వరేమనిరేవో ఇంతి సైరంధ్రీ జవ్వాని నాతో నిజము చెప్పవేమో ॥ఎ॥

సైరం పా

తెలియదేమీ నీకు ఓ సుదేష్ణా చెలియా తెలిసి
తెలియని దాని తెరగున నడిగేవు ॥తె॥

సుదే పా

కలికి ద్రేహము దూలికప్పిన దేమే
అలుకేల పలుకావే అరవింద నయనా ॥తె॥

సైరం పా

కపటాముతో నన్నూ కల్లాకు బొమ్మాని
నెపమూన కీచకు కొప్పించితీవయ్యో ॥తె॥

సుదే పా

చెలియా నీ నెరకోప్పు చెదరినదేమే
పొలతి మోమున చెమట పట్టినదేమే॥

సైరం పా

వేగిరపడనేల వెలదిరో యిక మీద కాగల
పనులాకు గంధర్వులున్నారు ॥తె॥

సుదే పా

చెప్పవే నిన్నిట్లు జేసిన వాడెంత గొప్పవాడైనాను
ఇప్పుడే దండింతు ॥ఎ॥

సైరం పా

అట్టి వేముల పల్లె హరికృప కలిగితే
పట్టి సంపుదురు నా పతులు నీ తమ్మునీ ॥తె॥

సుదే పా

తల్లివేముల పల్లె దాముని సాక్షి
నీ వల్లభులకు జెప్పవలదమ్మ యా మాట ॥ఎవ్వ॥

సుదే మా

ఇట్లు గాసిపెట్టిన వాడెవడో జప్పుము వానిని దండితును తరుని

సైరం మా

నీ తమ్ముడగు కీచకుడు నా పతులు గంధర్వులకు లోభడక నీకు లోబడునేమమ్మా సుదేష్ణా

సుదే మా

వాని యపరాదంబులతో వాడే చెడును గాని నీవు పోయిన పని ఎరిగింపవమ్మా

సైరం మా

నీ సెలవొంది పోయిన కీచకుడు కల్లు నివ్వక నన్నూ బలత్కరింప తప్పి రాజ వీధిని వచ్చిన వెంటనంటి నాకరంబుబట్ట దైవాదీనంబున తప్పి వచ్చితి నమ్మా సైరంధ్రీ॥

సుదే మా

చాల ఆగాసిపడి యున్నావు ఈ మజ్జన్న బోజనంబులు గావింతువు రావమ్మా సైరంధ్రి॥

సైరం మా

నీ తమ్మునింటా చాలా బోజనం బెట్టించితివి నాకక్కరలేదమ్మా

సుదే మా

అయితే ఇంకేమి కావలయునమ్మా

సైరం మా

కావలసిన దంతయు దీర్చితివి నాకు చాలా నాయాసంబుగా నున్నది నాసెయ్యా గృహంబునకు పోయెద సెలవియ్యవమ్మా సుదేష్ణా

సుదే మా

ఆలాగే పోయి రావమ్మా

(భీముడు నిదిరించును)

సైరంధ్రి-పాట-ఆది)

నిదుర పట్టేనా నీకు నిదుర పట్టెనా నిదుర పట్టెనా
నీ కీచకుడు నిదుర లేక కడు నిర్వేదనబడ ॥నిదు॥
నడువీదిలో నను బడదన్నెను యా చెడుగు

ప్రాణములుచే బ్రతికుండగ ॥నిదు॥
యిల వేములపల్లె యీశుని కృపచే
చలము దీరకను చల్లగ నీకు ॥నిదు॥

సైరం మా
తన బార్య మానభంగంబు
చేగుందుచున్న నీవీ విదంబున నిదిరించుటకు హేతువేమి స్వామి

భీము మా
ఎవరు కాంతా ద్రౌపతి ఇది ఏమి అర్ధరాత్రి సమయంబున

సంవాదం-పాట-ఆట

భీము పా
వచ్చినా పణీ ఏమి లలనా
నాతో వచియింపు బిసరుహనయన ॥వ॥
మచ్చకంటిరో రాజ మందిరమెడ బాసి
యిచ్చలో గుందుచు యీ అరనిశవేళా ॥వ॥

సైరం పా
ఎరుగనట్లిగెద వేలా సర్వమెరిగిన
రాజా భూపాలా నరనాదులెదుట నా
కురులు కీచకు డీడ్చి ధరణిపై త్రోచిన
ఎరిగియు యీ వేళా ॥ఎరు॥

భీము పా
పొలతి కీచకునింటి కేలా నీవు పోతివే ఓ ముద్దుబాలా
ఖలుని దగ్గర గొంటిగా బోవా మర్యాద కలదటే.
మదిలోన దెలసియు యీ వేళా ॥వచ్చి॥

సైరం పా
కల్లుకై కీచకు కడకు నన్ను పంపేను
మరుగునా పణికి నను నేలు రాణియు
తరుణి సుదేష్ణకు వెరచి నే
వానింట కరుదేర కలిగేను ॥ఎరు॥

సైరం మా
నన్ను పరాభవింప బూనిన తప్పి రాజస్థానంబున చేరవాడు మీనెదుట నన్ను
పెట్టు బాధలజూచి మీరేల ఊరకుంటిరి స్వామి

భీము పా

నిను బెట్టు బాధా నేగంటి
కీచకుని జంపగా బూనుగొంటి కనుసంజ్ఞచే
ధర్మ తనయూడు సమయాము గనుమాని
వారించే నను వలలాయాని ॥వచ్చి॥

భీము మా

అటు కాకున్న వానిన్ ప్రాణంబులతో పోవనిత్తునా ద్రౌపతి

సైరం పా

అకటా మిమ్ము పెల్లాదుట మొదలుగా అగచాట్లు పాలైతిగా
ప్రాణేశా ॥అ॥ నిక్కముగా నా సరి వారిలోన
వట్టి నిందలు బొందితిగా ప్రాణేశా ॥అ॥
అనాదు దుర్యోధనుని కొల్వుకూటమున మానభంగమైతిగా ప్రాణేశా ॥అ॥
క్రూరుడౌ దుశ్శాసనుని చేత నేనునూ చీరలోలుపబడితిగా ప్రాణేశా ॥అ॥
నీచుడౌ సైందవునకు పట్టుపడితొల్లి నేశరబోయాతిగా ప్రాణేశా ॥అ॥
రాచకూటములోన రట్టగునట్లుగా కీచకు డిటు జేసెగా ప్రాణేశా ॥అ॥
అల్ల వేములపల్లె హరికంత దయలేక ఆరడి పాలైతిగా ప్రాణేశా ॥అ॥

గీత పద్యం

భీమసేన నాయభిప్రాయ మెల్ల యింపుతోడ వినుము.
యిన్ని కష్టములకు ధర్మరాజు మూలకారనంబని
దోచె నాదు మదికి దాచనేలా.

సైరం మా

ఈ కష్టంబులంతయు ధర్మరాజు వల్లనే గధ కలిగినది భీమసేనా

భీముడు–పాట–ఆట

ఏలా ద్రుపద బాలా ధర్మజుదూల ఏలా పుణ్యశీలా ॥ఏ॥
చాలు సద్గున జాలుకీర్తి విశాలు త్రిజగము నేలు
యింద్రుని బోలురిపు భూపాలుడను
నిర్జించి యా ధర నాల్గు పాదము లవనీల నేలిన పుణ్యునీ ॥ఏ॥
పతుల దూషించినా సతులాకు యిహపరగతులు
లేవని మౌని సుతులు దెల్పగ వినవే క్షితి తలంబున చాల వర్షము లతులితంబుగ
గురచి పంటలు లతిశయంబుగ పండుటెల్లను సతని ధర్మము వల్లనే గద ॥ఏ॥
దాయలాడిన యట్టి మాయజూదములోడి పోయెననుచు
నింద చేయనేలనే తొల్లి న్యాయధన మార్చించి రాజ సుయాగము

వేద్కంగజేసియు వేయు విధముల భూమి
జనులతో వినుత గాంచుట ఎరుగవటవే ॥ఏ॥
కల్లగాదీతాని సల్లని సత్రుప్పవల్లగా దేమన మెల్లరు బ్రతుకూట
ఓ ఫల్లవాదరి వినివే వేములపల్లె శ్రీహరి సాక్షిగా
భూవల్లభుని నింధింప నీకును చెల్లునటవే ద్రౌపతీ ॥ఏల॥

భీము మా

ఆ ధర్మరాజు వల్లనే గద యిన్ని కష్టంబులు బడినను అజ్ఞాతవాసంబు భంగము గాకుండ తీర్చుసున్నాము అతని నిందింప వలదే ద్రౌపతి

సైరంధ్రి-గీత పద్యం

చేతగాని వాని చెలువున నన్నపై తప్పుబెట్టి
బలుక తగునే నీకు మానహీనమైన మరినాడు
బ్రతుకేల పొందు వేయ నాడుప్రతిన వినుము॥

గీత పద్యం

వాని తెగ జూడవైతేను వాయు పుత్ర నీవు
కనుగొన నురినైన నీళ్ళ నైన
అగ్నినైన విషంబునైన నేను మేను
దొరగుదు నెట్లు నీ యాన వినుము

సైరం మా

ఆప్పాపత్ముండంటిన ద్రేహంబేమిటికి నా నెరవేణిచే నురివైచుకొని ప్రాణంబులు విడుచుసున్నాను కన్నులార జూచి నీవును నీ అన్నదమ్ములు సుఖంబున నుండుడీ భీమసేన

భీముడు-పాట-ఆది

యింత తెగవు చేచునేలనే ఓ ద్రౌపతీ ॥యింత॥
యింత తెగవు చేయనేల యిందు ముఖిరో సింహోభలుని॥
పంతమునను నీవు కనుగోన కృతాంతు పురికి పంపుదు రేపు ॥యిం॥
నిన్ను వాడు బట్టి జూచితీ వృక్షంబు పెరకి
తన్నివానీ సంపబూనితి సన్నుతాంగి యిపుడు దృంప సమయము గాదనుచు
మాయన్న కన్నున్న వదన్న యూరక విదచితీని ॥యిం॥
యిలను వేములపల్లే వాసుని కృపగలిగి యుంటె లలన వాని జంపుటెంత పని
అలగ వలదు. మా యన్న యాన ॥యింత॥

భీము మా

కాంతామణి వినుము

గీత పద్యం

మగువరో సుదేష్ణా నగరు కేతెంచుము
వాడు రేపోమాపో వచ్చి నిన్నూ
రతికి బిలచెనేని రాజీగా నొడబండి
జరుపు రేపటంచు సరసిజాక్షి॥

భీము మా

అదియున్ గాక

కంద పద్యం

మరునాడు వచ్చినేనియు
మర్యదగ నటనశాల మందిరమునకున్
త్వరలో బొమ్మని వానితో
నెరిగింపుము బోయి వాని నిలబదగూల్తు

భీము మా

వానిని నీ నేర్పు మాటలచే నమ్మించి నొంటరిగా నాట్యమందిరమునకు బంపింతివేని వాని పొట్టక్రోవదంచేదనే ద్రౌపతి

సైరంధ్రి – కంద పద్యం

పుట్టితివి వాయు వశమున
పట్టితివి భీము గధయు భవరము తోన
గొట్టితివి భక యిడింబుల
నిట్టి బలాద్యుడవు వయ్యు నిప్పుదు నీవూ॥

సైరం మా

పర్వన్యాధి నిర్జురులేకీ భవంచి వచ్చినను వెనుదీయని నీవు యిపుడు రహస్యంబుగా నాట్యశాలకు రమ్మనుటకు హేతువేమి భీమసేన

భీము మా

అట్లుగాక బయల్ పడితిమేని అజ్ఞాత వాసంబు బంగంబగును గాన నా మాట విని యీ విదంబున వాని రప్పించుము దేవి

సైరం మా

ఔనౌను నాదగు నేర్పు మాటలచే వాని మనసు కరిగించి రేపే రప్పించెద నిక సెలవా స్వామి

భీము మా

ఇదిగో ప్రభాతంబగుచున్నది నీ శయ్యాగృహంబునకు బొమ్ము రేపు మరువక రమ్ము జాగ్రత సుమా

సైరం మా

మంచిది స్వామి వెళ్లి వచ్చెద

(కీచకుడు - సైరంధ్రి)

సైరం పా

ముచికుంద మాదవా మొరయాలకింపవా
కరుణించి మమ్ము బ్రోవరా మాదవా॥
కరుణించి మమ్ము బ్రోవరా ॥ము॥
అబలను నేనూ ఆనాదనైతి
ఆదరించి బ్రోవుము అప్తశరణ్యా ॥ము॥

కీచకుడు-పాట-ఆది

కోమలీ నన్నూ నేలవే మదనూనీ
బాదకింక తాలాజాలానే ॥కో॥ గారబమున కౌగలించవే
నీవు కోరినట్టి మనిహారమూలు నేను నిత్తూనే ॥కో॥
ముద్దుబెట్టి వద్ద జేర్చావే
నీ పతియని నన్ను మనమునందు సంతచించావే ॥కో॥ అవనిలో అన్యాలపురి
హరికృప
లెస్సయుంటే అవనికి నిను రాణీ జేతునే ॥కో॥

కీచ మా

కాంతామణి ఏల నాపైన నీకింత బిగవు నన్ను ఎందులకు నిద్రాహారంబులు లేక
ఈ విరహవేదనలో బడవేయుదువు రమ్ము నన్ను కౌగలిమ్ము

సైరం మా

ఆగు ఆగు రాజా అప్పుడే

సైరం ఉత్పల

పరసతి సంగమంబులకు పాల్పడు వారలు రాత్రులందు నెవ్వరు
నొరులు లేనిచోటు కటు వచ్చిన నా పని సెల్లుగాని ఈ
తెరగుణ యింతులున్నయడ ప్రపడన్ దగునే. రహస్య చోటరయగ లేక గీచక
ధరాధిప జెప్పెద నాలకింపవే॥

సైరం మా

రాజా యింత తొందరపడిన కార్యంబు ఏలాగు జరుగు మనసు దెలసి గద
నడచుకొనవలయు పనతులు పగటి వేల లేద్దైన పరులు చూచునట్లు వత్తుర
రాత్రులందు రహస్యపు చోటులకు వచ్చిన కార్యము జరుప తగును నా పతులు
విన్న ప్రాణహాని గధ

కీచ మా

అవును రాణి అవును నీ మనసు దెలియక నిన్ను బాదించితిని క్షమింపుము మరువక రాత్రి కెక్కడికి రావలయునో చెప్పుము నీ మనసు కరిగినందుకు కేమి బహుమతులు కావలయునో కోరుకొమ్ము

సైరం మా

ఆహా అంత తొందరపడిన లాభమేమి ఏదో బహుమతులంటివి ఏమిత్తువు

కీచకుడు - కందపద్యం

**దేవి నను పొందు విరటుని**
**దేవి మొదల్ యిప్పురమున తెరువలు నిన్నున్**
**సేవింపగ నా రా**
**జ్య విభవముల నుభవింపవే తరుణీ**

కీచ మా

దేవి యీ విరాటు రాజ్యంబున యుండు ప్రజలు సుదేష్ణాదేవి మొదలు నీ సేవలు గావింప నియమింతునే అబలా

సైరం మా

యీ మత్స్య రాజ్యంబునకు విరాటుండు రాజై యుండ నీకెక్కడివోయి రాజబోగంబులు

కీచకుడు - కందపద్యం

**రాజులను గెలచి ధరణి రాజుగ జేసితిని**
**మత్స్యరాజ్యంబునకున్ భూజనులు మెచ్చ**
**ధరకున్ రాజును గానటవే నేను రాజీవాక్షీ**

కీచ మా

ఈ యాబది యార్ రాజ్యంబుల రాజులను గెలసి ఈ విరాటుని రాజుగా జేసితిని గాన నేను రాజు గాదటవే సైరంద్రి

సైరం మా

అట్లనా నాకు తెలియదే

పాట

నిన్నే నమ్మితిరా కీచక నీదాననైతిరా
ఇక మీద నీ మాట జవదాటలేను ఒక సారి
నిను గూడ మదినెంచి నాను
నా మాట వినరా యీవేల పోరా రారాజ జాగేలరా ॥నిన్నే॥

పాట ఆట

రట్టు సేయవలదోయి ఈ రాత్రి కోత్తువు పోవోయి ॥ర॥
రెట్టబట్టి యిట్లు రట్టేల జేసేవు వట్టి నిందాలట్లే గట్టేరు జనులెట్లు ॥ర॥
మనసు నీపై యున్న దోయి అనుమానము
వలదూ పోవోయి మనసిజకార కోమల
సుఖుమార నా మనవి శేకోర యీ మాట నిక్కమురా ॥ర॥
వేగిర పడవలదోయి నా విభులు వినిన
మోసమోయి బాగైన వేముల పల్లె శ్రీహరితోడు
జాగు జేయక రాత్రి జాము పోయిరమ్ము ॥ర॥

సైరం మా

ఓ రాజా యీ రాత్రికి మరువక వొంటరిగా నాట్యమందిరమునకు కావలయు
వస్తువులు తీసుకొని రమ్ము ఇపుడు పొమ్ము

కీచ మా

నా యింట పట్టు పాన్పులుండ నాట్యమందిరమున కెందుకే తరుని

సైరంధ్రి - కంద పద్యం

పగలెల్ల నాట్యగృహమున
మగువలు గవగూడి నృత్య మర్మంబులు
నభ్యసింపుచుండియు తగుబోదురు
పొద్దుగృంక తమ గృహములకున్.

సైరం మా

పగటివేళ నాట్యంబులు నభ్యసింపుచుండియు తరునులు రాత్రులందుండరు గాన
మనకిచ్చవచ్చినట్లు వినోదముగా విహరింతము గాన

సంవాదం-పాట-ఆట

సైరం పా

రాజేంద్రా నా మాట నమ్ము అర్ధ రాత్రికి నచటికి రమ్ము ॥రా॥

కీచ పా

నీ మాట నెరనమ్మినాను. అర్ధనిశవేల నచటికొచ్చేనూ ॥నీ॥

సైరం పా

వంటిగా నను పొందు కోరు వారు వెంటనే స్వర్గమొందేరూ ॥రా॥

కీచ పా

సంతోషమాయేనే యింతి నా యంత రంగమున పూభంతి ॥సం॥

సైరం పా

అ నర్తనశాలకు రమ్ము నీ ఆశలన్నియు తీర్చుకొమ్ము ॥ఆ॥

కీచ పా

కొమ్మ నీవు జెప్పురీతి. నేడు నమ్మి వచ్చెదనే పోనాతి ॥కొ॥

సైరం పా

రాత్రులందెవ్వారు రారు. మన రహస్యమెవ్వారెరుగ లేరు ॥రా॥

కీచ పా

యెవ్వారు లేనట్టి యింట వచ్చి నా యిచ్చనటు ఖాపుకుంటా ॥య॥

సైరం పా

నను జూచి మోహించు వారు తనునాతులాగలియాగ బోరు ॥న॥

కీచ పా

నిను ముట్టినా నాకు సాలు నింక నెలతారో మరవా నీ మేలు ॥ని॥

సైరం పా

పెనగి నా సిగపట్టు వారు తన వనితాలు పట్టాగా పోరు ॥పె॥

కీచ పా

అనుబావ మాయేనే యింతి. నన్ను ఆదరించావే పూభంతి ॥అను॥

సైరం పా

సరసమున నను పొందు వారు ఏ వనితాల జోలికి పోరు ॥స॥

కీచ పా

శేష శైలేసుని సాక్షి చేరెద నిన్ను పద్మాక్షి ॥శే॥

సైరం మా

నే జప్పిన రీతిగా వెంట నెవ్వరిని గొనక నొంటరిగా రమ్ము వెర్రిరాజా

కీచకుడు – గీత పద్యం

నిక్కమే గద యీ మాట నీరజాక్షి యొంటినరుదెంతు
పరులను జంట గొనక బంటుగను
నేలు కొనుము నీ పాదములకు
మ్రొక్కెదను నాదు జేతులు మోడ్చి యిపుడు॥

కీచ మా

నీ మాట ప్రకారంబున రాత్రి రెండు జాములు గడచి రాగలను నీ మాట నమ్మ వచ్చునా కాంతా

సైరం మా

ఇంకనూ నాపైన సందేహమా అయినను నేను చెప్పు వస్తువులు మరువక తీసుక రావలెను

కీచ మా

ఏమి కావలయునో జెప్పుము

సైరం పా

వచ్చితే వచ్చేవు గాని ఓయి కీచకా ఎదురు బంబులు రెండూ తేర ఓయి కీచకా।

కీచకుడు-పాట-ఆది

ఎంత సంతోష మాయెనే నా మనసుకిపుడు ॥ఎం॥

ఎంతో సంతోషమాయె చింతలెల్లా

వీడిపోయె. యంతరంగమందు చాల కాంతూని కేళిలో గళియా ॥ఎం।

సుందరీ నన్ను నాట్య మందిరంబులోనికి

రమ్మంటివంతే చాల్ నీ వాక్యము విన్నాంతానే ॥ఎం।

వెంట నెవ్వారు లేక వొంటిగా రాత్రిలో రమ్మంటి

వంతే చాల్ వాల్‌గంటి ఈ వేలాలో ॥ఎం॥

కీచ మా

ఈ నాటికి నా చింత వీడినది యీ పగు ఎట్లు బరింతును రాత్రి ఎపుడు వచ్చునూ కాంత

సైరం మా

నెమ్మదిగా వెల్లిరము జెప్పిన వన్నియు మరువక తేవలయును సుమా

భీముడు – సైరంధ్రి

సైరం మా

పోయిన పని సక్క బెట్టుకొని వచ్చితిని గద స్వామి

భీము మా

ఏలాగు సక్కబెట్టుకొని వచ్చితిదో చెప్పుము తరుని

సైరంధ్రి – గీతపద్యం

మారు తాత్మజ నీతోడ మాటలాడిబోవు తరి తూర్పు ధిక్కునా

పొద్దు బొడచే నంత కీచకుడేతెంచి నచట

నన్నూ గాంచి మోహాంధుడై కన్నుగాన రాక।

సైరం మా

నేను పోవునంతలో తెల్లవారినది కీచకుడు వచ్చి నమజూచి మాటలాడించిన వానిని నమ్మించి మోహాంధములో బడవేసితి నా మాటలను నమ్మి తప్పక నాట్యసాలకు వచ్చెదనని బాసజేసి వెల్లాడు ప్రాణ నాయకా

భీముడు – గీత పద్యం

కాంత దుర్ఘటమైన కార్యమిపుడు సంగటించితి

వెంతటి జాన వహహో మదమనంచియు
వానిని సంహరించి
ధర్మసుతునకు నీకు నా తమ్ములకునూ।

భీము మా

ఎంత కార్యము సఫలంబుజేసి వచ్చితివి సభాష్ యింక వాని వధించి నీకు నా అన్నదమ్ములకు సంతోష బరెచెద నీవుపోయి సూర్య హస్తమయంబైన వెంటనే రమ్ము కాంత

సైరం మా

మంచిది స్వామి భీమసేనా

పాట ఆది

**నా మది నమ్మితిరా మోహాన కృష్ణ॥**
**నా॥ దేవా దీనయాలో ॥నా।**
**పూతకి జంపి క్యాతిని బొంది నాతులతోడ నాడినకృష్ణ ॥నా॥**
**ముల్లోకాలను తల్లికి జూపి ముక్తి వహించిన మోహన శౌరీ ॥నా॥**

సైరం మా

ఇదిగో సూరస్తమయంబాను నానాథుని చెందకరిగెద ॥నాద నాద।

కంద పద్యం

**పవమాన పుత్ర వినుమా**
**అవరల మిగరవియు పశ్చమాంబుది గుంకెన్**
**భువి యల్ల నిండె**
**తిమిరము ధివిపైన నక్షత్రములును దీపత్తంబయ్యెన్।**

సైరం మా

సమస్త జనంబులు బోజానాది కృత్యంబులు గావించి నిధిరించిరి చీకట్లు గ్రమ్మె. యింక లెమ్ము పోవుదము భీమసేనా

భీము మా

అవునవును గుత్తంబుగా నా వెంట రావే ద్రౌపతి
కాంతామణి యీ నాట్య మందిరంబు ఎంత గాడాందకారంబుగా నున్నదో చూడుము

సైరం మా

చూసితిని ప్రాణేశ్వరా

భీము మా

నేను విరాటు పుత్రి పవలించు పాన్పుపై నుండెద నీవునొక మూల నుండి మా తార్యతమ్యంబులు గ్రహింపుము దేవి

సైరం మా

అటులనే కానిమ్ము

కీచకుడు - నర్తనశాల

కీచ మా

ఆహా రాత్రి రెండు జాములు కావచ్చె నా కొరకు సైరంధ్రి కాచియుండును వెల్లెద

పాట ఆది

కేకయా పుత్రూడు వెడలేను సైరంధ్రిని జేర ॥కేక॥
వాసనా గంధాము బూసి వల్లెవాటు వేసి పరిమల
వాసనాయు క్రైవు మించి మీసము ధీటూచు వేగ ॥కేక॥
కనక రత్న వలులు మెరయు కిరీటము సిరమందు దాల్చి
దండిగా నవరత్న సొమ్ములు మెండుగా వొడలందు దాల్చి ॥కే॥
అవనిలో అన్యాలాపురి హరిని నిందజేయుచూను
సవిరలముగ నాట్యశాలకు సంభరముగా కానుకలు గొని ॥కే॥

కీచ మా

ఆహా ఎంత గాడాందకార గృహము ఇందు యా సుందరి ఎందునుండునో పిలచెద సైరంధ్రీ సైరంధ్రీ కాంతా మాటాడవా

యాలలు

కొమ్మరో నీవెందున్నావే
గాడాందకారంబైన గృహములో పలుకరించి
చెంతజేర్చావే ఓ ఓ సైరంధ్రీ. అలకు లేలా అంభుజాక్షిరో ॥కొ॥

భీము మా

ప్రాణ సకుడా నేనిచ్చాట పాన్పుపైన ఫవలించాను తిన్నగాను యిటకు రావోయీ॥
ఓ ఓ కీచాక రాజా నేడు నీ కోరీక దీర్చేనూ ॥ప్రా॥

కీచ మా

కాంతరో నీకు నేను కానుకలనూ దెచ్చినాను కంభుకంఠిరో గైకొనవే నీవూ ఓ
ఓ సుందరాంగీ ఇకనైనా భ్రమము దీర్చావే ॥కొ॥

భీము మా

కొంత తడవు నాలాసించు కోర్కెలన్ని దీర్చెదాను సంతోషమున యిటు కొర్చొనవోయి॥ ఓ ఓ వైరిరాజా కంతుకేళీలో గలియానిచ్చెదా ॥ప్రా॥

భీము మా

యిటు కూర్చొనుము
ఏమి బహుమతులు దెచ్చావు యిటు దెమ్ము

కీచకుడు - కంద పద్యం

వనితామణి నీ మీదను బ్రమ

గొని దెచ్చితిని పుష్ప ఫలములు గొనవే

నను చేకొనవే వేగమే

ఆలస్యము వలువ దింక అభూజ నేత్రీ॥

కీచ మా

యిదిగో మంచ ఇపరిమలోదకంబైన

ఫలపుష్పగంద తైలంబులు

మణిహారంబులు భక్షణ్యా బోజనంబులు

యిదిగో గైకొనవే కోమలీ



కీచకవధ వీధినాటకం
నాట్యగృహంలో సైరంధ్రి వేషంలో భీమున్ని (డా॥బిట్టు వెంకటేశ్వర్లు) అంగాంగాలు చేతులతో తడుముతున్న కీచకుడు (డా॥ చిగిచర్ల కృష్ణారెడ్డి)

సంవాదం-పాట-ఆది

కీచ పా

బామామణి యిదె వచ్చితిపుడు

నా బ్రమ నీ వియ్యెడ

దీర్చు నాయద దాపాగ్ని సల్లార్చు ॥బా॥

భీము పా

నీవు కోరినటు నేనిచ్చుటనే నిన్నును పెనగొన నేర్తూ

యీనిసిలోపల కడతేర్తూ ॥నీ॥

కీచ పా

ఆలస్యంబిక యేలనే యీతరి అంగజు పట్టపు

దంతీ మేలారిన విరిపూబంతీ ॥బా॥

భీము పా

యింక కొంత తడ పూరకుండు

నీ యిష్టమెల్లా నీడేర్తు నేనియ్యదనిను వీడిపోనూ ॥యిం॥

కీచ పా

వేడుక పడి నీ వడిగిన దిచ్చెద.

విడియము చేయవే కొమ్మా పుటమేసినా బంగారు బొమ్మా ॥వే॥

భీము పా

బ్రమగొని యిపుడు పదరకు

తాలుము బ్రఫల విడియ మేసేను నీ పని సక్కన జేసేనూ ॥బ్ర॥

కీచ పా

తదవు వోర్చుమని బలికెద నిప్పుడు

తాలిమితో యటులుండు మరుతాపాగ్నికి ఏమందూ ॥త॥

భీము పా

ఇంతలోనే త్వరితము పడనేటికి
శాంతమాత్మలోబూను నీ సంతాపము మాన్పేనూ ॥యిం॥

కీచ పా

మరుకేలిని నను గలయక కాలము జరిపెద
వది నీ వేల నీ జాగులేల విరిగోలా ॥మ॥

భీము పా

సరసము లాడక రతిలో గలియుట
సమ్మత మగునే రాజ యిక పాలించుము నీ మోజా ॥స॥

భీము మా

కొంత తడవు సరసంబు లాడి రమింతము రాజా నా మోజా

కీచ మా

అటులైన యీ ఫలహారంబులు గొనుము

భీము మా

చాలా రుచికరముగా యున్నవోయి

కీచ మా

ఈ ఫరిమల గందంబులు నలందుకొనవే బామా

భీము మా

చాలా సల్లదనంబుగా ఉన్నదోయి

కీచ మా

ఈ పుష్పంబులు ధరించవే తరుని

భీము మా

ఆలాగే ధరించితి చాల ఆపరిమలోదకంబుగా ఉన్నదోయి కీచక

కీచ మా

యీ తాంబూలంబులు వేసుకొనవే చిలుక

భీము మా

ఆలాగే వేసుకొంటిని చాలా కమ్మధనంబుగా నున్నదోయి

కీచ మా

సుదేష్ణ దక్క యిప్పురంబులోగల బామలచే లంచంబులు గొన్న నాతో లంచంబులు గొంటివి నీవెంత హోంతకారివే సైరంధ్రి

భీము మా

లంచంబులు నిచ్చుట నట్లుండనిమ్ము నిక కొంతసేపటిలో నీ ప్రాణంబులే నర్పింతువోయి కీచకా

కీచ మా

యిట్టి మాటలతో కాలహరణం బేల నీ అగంగాగంబులంట నీయమే బామ

భీము మా

అంట నిచ్చెదను గాని

గీత పద్యం

**రాజవర్య నీ గర్వంబున నన్ను ముందు**
**నీ సరసముష్టి బోదువు సంభ్రమమున నవ**
**ల నిన్ను ముట్టి అస్తంబుపై బెట్టి సరస దె**
**బ్బ వేతు సడి దెలియక**

భీము మా

నీ సరసపు దెబ్బ నా మీద వేయుము

కీచ· మా

అట్లనే సరసంబున కొట్టితినే ముద్దుగుమ్మా

భీము మా

యింక నే వేయుచున్నాను చూడుము

కీచ మా

(మూర్ఛిలి) అబ్బా యిధి ఆడదాని దెబ్బగాదురా యబ్బ నిన్న కొట్టిన వాడే గందర్వుడు ఉండును ఓరీ గందర్వా

సంవాదం – పాట

కీచ పా

**ఎవదూరా యిందున్న వాడు.**
**నాతో ఎదిరి నిలచి పోట్లాడు**
**యీ యవనీలోగల యట్టి**
**యసుర సూరులనైన**
**కరము లొడసిపట్టి సంపుదు నిమిషాన ॥ఎ॥**



కీచకవధ వీధినాటకంలో ఒక సన్నివేశం

భీము పా

నేనిందు వచ్చినా దెందూకు
నిను బట్టి బోరి గొనెటందుకు.
పూని యీ వేలా నీ ప్రాణములను దీసి నీ
నాంశకుని పాలికంపెదనిది జూడు ॥నే॥

కీచ పా

నీ శక్తి నింక చాలించరా.
నన్ను కీచకాగ్రజుడాని యంచరా
యిక్కడ చాలా పెక్కు లాడకు
నిన్ను పీచమడించియు పేరు మాయచేతా ॥నీ॥

భీమ పా

యిక్కడ కరుదెంచి నీవు చేత జిక్కితి వెందుబొయ్యేవు
రక్కసి కొడుకా. ఇంకెక్కడా దాగేవు
నొక్కిబట్టి గొంతు డొక్కాలే జేర్చెదా ॥నేనిందు॥

భీము మా

యింక క్షణంబులో నీ ప్రాణంబులు దీతును చూడరా దగడి

సంవాదం - పాట

కీచ పా

వద్దు పరాక్రమము మాను. ఒక గుద్దుకు నిన్ను జంపేను ॥వ॥

భీము పా

మిట్టి పడకు రోరి నేడు నిన్ను పట్టి వధించేద చూడు ॥మి॥

కీచ పా

వచ్చితివా నిన్ను విదనూ. నీ వారికైనా బయపడనూ ॥వ॥

భీము పా

పిడికిట యదమాదీ బొడతు నీ పీచమవనీలో నదతు ॥పి॥

కీచ పా

జగడాము చేయుడి కొందు పో జననీ యనిను బోరికొందు ॥జ॥

భీము పా

శేషగిరి మందిరుడు నాచల నూతనాత్మనే మరుదు ॥శే॥

కీచ పా

హరియైన నిన్ను పోనివనూ. పురహరునికైనా బయపడను ॥హ॥

కీచ మా

యిదిగో నా ముష్టిచే నీ వీపు విరిగె చూడరా గందర్వా

భీము పా

ఓరీ నీ కరములు రెండొక్క చేత పట్టి

బందీంచితిని ధీరుడానైతేను పట్టు విడపించుకోర ॥ఓ॥

కీచ పా

నీ పట్టు విడపించుకోని నిష్టురాముష్టిచే

నిదిగో కోపించి నీ బరులు విరగగొట్టితి పోరా ॥నీ॥

భీము పా

కొట్టితే విడతూనే నీదు కొన వెంట్రుకల్ వొడసి పట్టి

నట్టిట్టు పోనీక నేల పట్టి త్రొక్కితి ॥కొ॥

కీచ పా

త్రొక్కితే విడతూనే నీదు తొడలు రెండు జేర్చి

పట్టి మట్టుమారు లేక నిన్ను మర్దించితి పోరో

॥త్రొ॥



కీచకవధ వీధినాటకంలో యుద్ధ సన్నివేశం

భీము పా

అధమూడా వేమూల పల్లె హరిసాక్షి గాను

యిపుడు పెట్టునా నీ ప్రాణములు పోయె

కీచకా ॥అ॥

భీము మా

రమ్మురా ఒక పట్టు పట్టి సూతము

(తాం తాం యుద్ధము)

భీము మా

ఓ ద్రౌపతి యీ కీచకుని గతి ఏమయినదో

చూడు దీపము వెలిగించి తెచ్చితి

సైరం మా

చూచితిని వీని కాల్లు చేతులు ఎక్కడబోయెను స్వామి

భీము మా

వీని వధించి తనివి తీరక వీని కాల్లు చేతులు తల డొక్కలో దూర్చితినే బామా

సైరంధ్రి – గీత పద్యం

తులవ నీ ఇట్లు సావంగ

వలదె యాడు వారుపై గల్లు మోహంబు

తీరెనుగద పొట్టక్రొవ్వున నను రెట్టబట్టు
ఫలము గంటివి పోర నీవు పాప వృదయా॥

సైరం మా

ఛీ నీచుడా ఈ నాటికి యీ ఊరి పీడ తొలగినది దుర్మార్గుడా

భీముడు - కందపద్యం

గడపితి వచ్చిన ఫణి యిక్కడ తడ
వుండగ జనదు కావలి వారీ నడిగన్న విన్న
మన నడికన్ బంగము కల్గు వారిజ నేత్రీ॥

భీము మా

నింక నేను నా యాస్థానంబునకు వెల్లెదను నీ నివాసంబునకు జెనుము

సైరం మా

మంచిది సెలవా స్వామి

తలవ మా

పారావుషార్ పారా వుషార్ అమ్మా నీ వెవరు యీ నిశవేలలో ఎక్కడికెల్లెదవమ్మా

సైరం మా

నేను సుదేష్ణా వద్ద పనులు గావించెడు సైరంధ్రిని

కంద పద్యం

తులువ తనంబున నన్నును తలబట్టీ
డ్చిన ఫళంబు తాగైకొనియన్తలవరులార యి
దిగో కలుదగు కీచకుని సావు గంటిరే మీరల్॥

సైరం మా

నా పతులు గంధర్వులు ఈ కీచకుని వధించిరి చూదరయ్యా

తలవ మా

ఆహా ఎంత విచిత్రమైన వద్ద గావించిరమ్మా సైరంధ్రీ

ఉపకీచకులు - పాట

సందదేమో తెలుపరోరీ ఓ తలవరులార ॥సం॥
సందదేమో దెలపరే మీరు సందేహము
మాని నాట్యమందిరంబు చెంత బల్ మంది కూడి యున్నరోయి ॥సం॥
వదలక మాయన్నా తనదు సధనమూన లేదు
నేదు మదమూన సైరంధ్రి ఏమి మోసము జేసెనేమో ॥సం॥
దాత్రిశ్రీ వేములపల్లె దాముద్రైన పద్మాపత్రి నేత్రూని
సాక్షిగా అర్ధరాత్రి సమయమునను యీ ॥సం॥

ఉప మా

ఈ నాట్య మందిరంబున యింత ప ది జేరుటకు కారనంబేమి తలవరులారా

తలవ మా

ఇదిగో మీ యన్నను గందర్వులు వధించినారు చూడరయ్యా

ఉపకీచకులు - గీత పద్యం

అన్న నీవెన్నదెరుగవు యపజయంబు
దోసమెంచక సైరంధ్రి మోసగించి యొంటి
రమ్మని ఈ చీకటింటిలోన నిన్ను జంపించెనే తండ్రి నేర్పు మీరా॥

పాట

అన్నా కీచక పోతివే ఓరన్నా కీచక
పోతివే అన్నయా మమ్మాల నందారి కృపతోడా
కన్న తండ్రివలె కాపాడుచుంటివీ ॥అ॥
లేశమైనను కృపలేక అయ్యయ్యో మా ఆశాలన్నియు
నిరాశాలు గావించే ॥అ॥
పన్నుగ వేముల పల్లె శ్రీహరి తోడ నిన్ను
బాయలేము నీ వెంట వచ్చేమూ ॥అ॥

ఉప మా

అన్నా అన్నా పోతివా ఇంక మాకెవరు ధిక్కు అగ్రజా

సుదేష్ణ-పాట-ఆది

సుదే పా

సోదరా సోదరా ఇటు సావగను నీకెటుల నోచెరా పటుతరముగ యా పాపి చేతనూ ॥సోదా॥
తమ్ముడా నిన్ను మేమెన్నడు జూతుము కన్నులల సావుగంటిమి ఈ వేళ ॥సో॥
వలదన్న నా మాట యోచింపలేకాను కలికిచే నీ రీతి గతినైతి వటర ॥సో॥
నీ పరాక్రమము నే రీతి మరతుము దారుణి మాకింక కాపాడేవారెవరు ॥సో॥
అనువుగ నన్యాల పురమున వెలసిన వనజాక్షుని కృప వదలెను నీ మీద ॥సో॥

సుదే మా

తమ్ముడా నా మాట వినక దాని కోరీతి సావు నొందితివా మాకేది గతి ఇంకెవు దిక్కు తమ్ముడా కీచకా ॥కీచకా॥

ఉప కీ మా

అక్కా దుఃఖింపవలదు ఇంతటికి యా సైరంధ్రి కారణము దానిని మన అన్న శవముపై గట్టి దహనంబు గావింతము నూరడిల్లుము

సుదే మా

వలదు తమ్ములార ఆ గంధర్వులు బలాఢ్యులు ఇట్టి వానినే తెగటార్చిరి మీరెంత వారికి నా మాట వినుదు

ఉప కీ మా

అక్కా వారు అయివురు మేము నూర్వురము మాతో బోరాడ వారికి శక్యమా దాని విడువము

పాట

పట్టూడి పట్టూడీ పట్టూడీ సైరంధ్రిని వేగ ॥ప॥
పట్టూడీ సైరంధ్రీని గట్టిగాను కట్టి దాని
దిట్టముగ మాయన్నతో కాంష్టమందు నుంచుదాము ॥ప॥

ఉ కీ మా

తమ్ములార పట్టండి కట్టండి ధీనిని వదలకూడదు

సైరంధ్రి – పాట

విడిపింపారయ్యా యీశెర నన్ను ॥విడి॥
విడిపింపుడీ ప్రాణ విభలారా ఇదిగో ఈ చెడు
గూలు నను బట్టి చెరగోని పొయ్యేరు ॥విడి॥
సూతులూ ప్రబలోపేతులూ తమయన్న ప్రేతాముపై
నన్నూ పెట్టుకా బొయ్యేరు ॥విడి॥
పాటించి వేమూల పల్లె శ్రీహరి సాటివారిలో
నగు పాటు జేసెనయ్యో ॥విడి॥

పాట ఆది

అదృశ్య పతులార ఆదార భూతులార
నా వద్ద జేరి యీ శెర విడిపింపరారే మీరు ॥అ॥
కీచకు శవముపై వేసి నన్ను ఉపకీచకులు గాసి
పెట్టుచున్న వారు యోచన జేసియు మీరు ॥అ॥
యీవేల నన్నూ మీధు విడిపింపరైతిరేని
పాతకూలు నన్ను పట్టి రుద్రభూమి జేర్పగలరూ ॥అ॥
ధరణిలో నంభూరిపురి దాముని కృప నాపై దప్పె
పదరాని యిదుములు నే పదనైతి పుడమినందు ॥అ॥

సైరం మా

ఓ గంధర్వ పతులారా యీ ఉపకీచకులు యీ చండాలుని కళేభరముపై నన్ను గట్టి గొని పోవుచున్న వారు విడిపింపరారయ్యా నాదులార

సంవాదం- పాట

భీము పాట

భయము నీకేల ఓ బాలా వచ్చితి నేనూ ॥భయ॥
భయము నీకేలా ఓ బాలా వచ్చితిని రయమూన
వీరిని బట్టి బరిమార్తు నీవేళ ॥భ॥

ఉప కీ పా

గంధర్వుడదిగో వచ్చె గనుడి ఇంకే గతి
యవరు బ్రోచువారు మనల ఏమి జేయగవలయు నేడు॥

భీము పా

మా బలము తెల్లవీరు
మోదమూన దెలియలేక బాధబెట్టు నిన్ను
రీతి రోదనంబు జేయుట జూచి ।భయ।

ఉ కీ పా

పన్నుగా నంబూరి పురిపాలు కరుణ
మనపై దప్పె యీరీతి చావగా మనల నొసట వ్రాసెనేమో బ్రహ్మ ॥గం।

భీము పా

ధరణిలో నంభూరీ దాముని సాక్షిగాను
వీరి నందరిని బట్టి యముని మందిరమున యుండబనిచెద ॥భ।

భీము మా

బామా సైరంధ్రి యిదిగో నీ పతి వచ్చితి వీరిని హతంబార్చి నిన్ను రక్షించెద భయంబు చెందవలదూ॥ ఓరీ మానవాదములార నిలువుడి మా పరాక్రమంబులు దెలియక యీలాగు జేసితిరా నిలువుడి

పాట

నిలువుడి యుపకీచకులార నిలు నిలు
వుడి మీరాలు నిమషమ్ముల యమ సదనము
జేరగా సమయము వచ్చెను ॥నిలు॥
కలులగు మిమ్ముల కరుణింపను నేతుల పతనంబులు తొలగగజేసెద ॥నిలు॥
పనుపుగ నంభూరీ పణిగిరి నిలయుని పాదములాననే పట్టి వధించేదా ॥నిలు॥

భీము మా

ఓరీ మీరెందు దాగినను విడువను నిలువుడి

(అందరిని జంపును)

ఓ బామా యీ నూర్వురను జంపితి నిక నిశ్చంకచే నీ మందిరమునకు పొమ్ము

సైరం మా

మంచిది స్వామి ప్రాణేశ్వరా

భీము మా

జాగ్రత్తగా వెల్లుము

సైరం మా

తల్లీ సుదేష్ణాదేవి తలుపు దీయుము దేవి

సుదే మా

ఎవరూ సైరంధ్రివా

సంవాదం-పాట-ఆట

సుదే పా

విరటూడు సెలవిచ్చె వెలది నిను బొమ్మా
నీ పురము విడచి నీవు బోవమ్మా నీవు బోవమ్మా ॥వి॥

సైరం పా

గడువు దీరిన దనుక గణవేని నీ యిల్లు
విడువను నా మాట వినవమ్మా నీవు వినవమ్మా ॥గ॥

సుదే పా

యెన్ని దినములు యింక నున్నదో నీగడువు
తిన్నగాను నాతో దెల్పవమ్మా నాతో దెల్పవమ్మా ॥యె॥

సైరం పా

పదమూడు వర్షములాకు పదమూడు దినములు.
కొదువ యున్నది గాదె కోమలీ ఓ కోమలీ॥

సుదే పా

గడువున్నదనుకాను కదలిపోకుంటేను దుడుకునా
మెడబట్టి దోయింతునే నే దోయింతునే ॥గ॥

సైరం పా

దోయించితేను నీ తోబుట్టువుల పాటు
తోయజాక్షి నీకు దొరకునే నీకు దొరకునే ॥దో॥

సుదే పా

దొరకకున్నను నాకు తరుణి తమ్ములకన్న ఇరువంద
నేనేమి ఎక్కువే నేనెక్కువే ॥దొ॥

సైరం పా
ఎక్కువనుచు నన్ను ధిక్కరించితేనూ నేనెక్కడ
బోదునే నిప్పుడు నేనిప్పుడు ॥ఎ॥
సుదే పా
గూబవలెను వచ్చి కొంపలెల్లను గూల్చ మాబాగా
యుందునే మాలిని ఓసి మాలిని ॥గూ॥
సైరం పా
కొంపలు గూల్చేటి రంపితలను బట్టి
గుంటించి పంద్లూద గొట్టేనే నేను గొట్టేనే ॥కొం॥
సుదే పా
పంద్లూద గొట్టితే పట్నాము వెదలింతు
కంద్లజూదవే కడగంద్లమారీ॥ ఓ కడగంద్ల మారి ॥పం॥
సైరం పా
కడగంద్ల మారీవై కల్లుదెమ్మని నన్ను చెడుగు
కీచకు పాలుజేసితివే నీవు జేసితివే ॥క॥
సుదే పా
జేసినందుకు ఫలము చేజేత గదువంగ జేసితి
వింకేమి జేసెదవే నీవు జేసెదావే ॥జే॥
సైరం పా
జేసేద వెంతైన చేతగాదు గాని ఓసి ఓసి
నోరుమూసుకోవే నీవు మూసుకోవే ।జే।
సుదే పా
అప్పుడు కూతాలు ఇప్పుడు గూసితే కొప్పు
బట్టీడ్చింతు కోమలీ ఓ కోమలీ ॥అ॥
సైరం పా
కొప్పు బట్టీడ్చాను గుండె గలిగితే రమ్ము తెప్పున
నీ బగసి దెలసేనే ఇపుడు దెలసేనే ॥కొ॥
సుదే పా
తలకాయి ద్రిప్పేవు తాటికాయిలాగ
నలినాక్షి నినుజూచి నవ్వేరే జూచి నవ్వేరే ॥త॥
సైరం పా
నవ్వితే వారాల నయమైన పలువరుస
గవ్వలవలె గనుపించునే ఇప్పుడు గనిపించునే ॥న॥

సుదే పా

గనుపించి యుండె యిక్కరణి నాకెదరించి

అనగూడదనుమాట అనె యాదవా నీ వనియాదావా ॥గ॥

సైరం పా

ఆడితే ఏమి యీ అవని వేమూల పల్లె

క్రీడించు శ్రీహరి కృప గలిగితే హరి కృప గలిగితే ॥ఆ॥

సైరం మా

రావే ఒక పట్టుపట్టి సూతము

సుదే మా

భలవంతులైన గంధర్వుల భలంబుచే నిట్లు మాటాడుచున్నావు నిన్ను భలకరింప వెరతు కరుణ కటాక్షంబుంచి నాకు పురుషభిక్ష పుత్రభిక్ష పెట్టవమ్మా సైరంధ్రి

సైరం మా

నా పతులకు జెప్పి నీ భర్తకు అభీష్టంబు లొనగూర్చెదను యిమ్మాటలు ముమ్మాటికి నమ్మవమ్మా సుదేష్ణా

సుదే మా

చాలా సంతోషము రావమ్మా హంతఃపురమునకు పోవుదము

మంగళం–పాట–ఆది

మంగళాంబిదె మాదవా మురారీ ॥మంగ॥

కెన్నకేశవా చేరి గొలతు నిన్ను

సన్నుతించి నన్నా సరగూన నేలు ॥మంగ॥

బాలులంత గూడి పూలతోట జేరి

పూలుగోసి నిన్నా పూజజేతుమయ్య ॥మంగ॥

సుభమస్తు

సంపూర్ణం

# అయిదో అధ్యాయం

# వీధి నాటకాలు - కంగుంది ప్రత్యేకశైలి

## 5.1. ప్రవేశిక

చిత్తూరుకి పడమర 90 కిలోమీటర్ల దూరంలో 'కంగుంది' అను గ్రామం ఉంది ఇది కుప్పం మండలానికి చేరింది చరిత్రపుటల్లో కెక్కిన ప్రదేశాలు, ప్రసిద్ధమైన కట్టడాలు, దేవాలయాలు ఈ ప్రాంతంలో ఎన్నో ఉన్నాయి ఒకప్పుడు కంగుంది పాళెగాళ్ళ పరిపాలనలో వైభవోపేతంగా వెలిగిన ఆనాటి కట్టడాలు నేడు శిధిలావస్థకు చేరుకున్నాయి ఈ కంగుందికి వెయ్యేళ్ళ చరిత్ర ఉంది వారి పాలనలో శాస్త్రీయ సంగీతానికి ఆదరణ లేనట్లు తెలుస్తోంది [1] అయినా కదలు, నాటకాలు, చెక్క భజనలు, వీధి భాగవతాలు మొదలగు జానపద కళారూపాలు ఆనాటి ప్రజలను ఎంతగానో ఆకర్షించేవి అప్పటి జానపద కళా సంస్కృతులకు పట్టుకొమ్మలుగా ప్రసిద్ధి కెక్కిన కంగుంది కుప్పంలో నేటికీ ఆ జానపద కళాగంధం వీధినాటకాల రూపంలో సువాసనలను వెదజల్లుతోంది మహాభారత కథలోని 18 పర్వాలను 18 వీధి నాటకాలుగా రాసి 18 రాత్రులు నాటకాలుగా ప్రదర్శించడం కంగుంది వారి ప్రత్యేకత

## 5-2. కంగుంది నామౌచిత్యం:

చిత్తూరు జిల్లాలోని కుప్పం, రామ కుప్పం మండలాలకు మధ్యగల ప్రాంతం ఒకప్పుడు దట్టమైన అరణ్యంగా ఉండేది ఈ ప్రాంతం ముళ్ళపొదలు, శీకాయి పొదలు, అడ్డం దుడ్డం అల్లుకొన్న తీగలు, విస్తృతమైన చెట్లు చేమలతో మానవ సంచారానికి కష్టతరంగా ఉండేది అంతేగాక ఈ అరణ్య ప్రాంతంలో ఎలుగుబంట్లు, సింహాలు, ఏనుగులు, చిరుతలు, పులులవంటి క్రూర మృగాలుండేవి కంగుంది ప్రాంతం పరిస్థితి ఆ రోజుల్లో చాలా దయనీయంగా ఉండేది ఈ క్రింది వాక్యాలు ఆ విషయాన్ని తెలియజేస్తున్నాయి

"కంగుంది మహాగ్రామే ముండా బండా విశేషితః
అన్నం నాస్తి జలం నాస్తి నిత్యం పర్వత దర్శనం"[2]

1. కంగుంది సంస్థాన చరిత్ర - సాధు సుబ్రమణ్యము పుట - 56
2. కంగుంది సంస్థాన చరిత్ర - సాధు సుబ్రమణ్యము పుట - 56

కంగుంది సంస్థానం విధవలకు, బండలకు ప్రఖ్యాతి గాంచినది ఇచటి విశేషములివి అన్నమూ దొరకదు, నీరు దొరకదు సర్వకాలములందునూ కొండలు దర్శనమిస్తుంటాయి అని దీని భావం

> **"ముంగిట కల్పంబుండిన బంగారము చేతనున్న**
> **ఆ ప్రభుదయ యున్నన్ అంగజ వాడునకునైన**
> **కంగుంది కాపురము కడు కష్టమయా!"[1]**

ఇంటి ముందు కల్పవృక్షమున్ననూ, చేత బంగారమే యున్ననూ, భగవంతుని కరుణ యున్ననూ, మన్మధునకైననూ కంగుందిలో కాపురము చేయుట చాల కష్టమని దీనిభావం

బందిపోటు దొంగలు ఈ అడవిలో అక్కడక్కడ స్థావరాలను ఏర్పరచుకొని ప్రజలను దోచుకునే వారు దోపిడీ జీవనమే వారి ముఖ్య వృత్తి నేడు ఎరుకలు, యానాదులు, గిరిజనులు అని పిలువబడువారు నాడు ఇర్లవారు అని పిలువబడేవారు వీరికి కొండ చెరియలపై, గుండ్లపై, నున్నటి పర్వత శిఖరాలపైనున్న తేనె పట్టుల నుండి జుంటి తేనెను తీయుట వెన్నతో పెట్టిన విద్య ఈ దారి దోపిడి ముఠాలకు 'కంగడు' అనే వాడు నాయకుడై దారిదోపిడి చేసేవాడు అతని భార్య పేరు 'కంగి ' వీరి అధీనంలో కొన్ని గూడేలు ఉండేవి ఈ అరణ్య ప్రాంతంలో జరిగే దోపిడీలన్నిటికి 'కంగడే' నాయకుడు కంగి ఆ అరణ్యంలోని యానాది ప్రజలకందరికి పెద్ద దిక్కు ఆ గూడేల్లో ఏ శుభకార్యం జరగాలన్నా, ఏ పూజ చేయాలన్నా కంగి చేతుల మీదుగానే జరిగేది కంగడికి కంగి వెన్నెముక కంగడితో పాటు కంగికూడ ఆ అరణ్య ప్రాంతంలో గుట్టలెక్కడం, తీగల సాయంతో లోయలు దాటడం, కత్తి యుద్ధం చేయడం, కొండ చెరియల్లో తేనెను తీయడం లాంటి పనుల్లో ఆరితేరింది ఇలా కంగి – కంగడు ఆ ప్రాంతాన్ని మకుటం లేని మహారాజుల్లా తమ అధీనంలో ఉంచుకొన్నారు

దక్షిణ హిందూ దేశంలో కృష్ణానదికి దక్షిణ తీరంలో గుత్తికి సమీపాన 'ప్యాపిలి' అనే సంస్థానముండేది దీనికి సమీపంలోగల అరణ్య ప్రాంతంలో 'మల్లినాయడు' అనే బోయ వాడు కొంత మందిని కూడగట్టుకొని దారిదోపిడి చేసేవాడు వీరే దివిటీ దొంగలుగా ప్రసిద్ధికెక్కారు మల్లి నాయని కుమారుడు 'కంబినాయడు' కూడా దోపిడీ వృత్తినే చేపట్టి జీవించేవాడు ఇతని కుమారుడు రెండవ కంబినాయడు, అతని కుమారుడు మూడవ కంబినాయడు కూడా ఈ దోపిడీ వృత్తినే కులవృత్తిగా తీసుకుని జీవించారు 1066వ సంవత్సరంలో ఈ దారిదోపిడి ముఠాలో చీలిక లేర్పడి ఒకరి నొకరు చంపుకొనుచుండిరి మూడవ కంబినాయడు తన శత్రువులతో పోరాడలేక కొంతమంది అనుచరులను తీసుకొని భార్యాబిడ్డలతో దక్షిణ దిక్కుగా పారిపోయాడు అలా వచ్చిన కంబినాయడు కంగుంది సమీపంలోని 'మహారాజ్ పుర్' అను గుట్టను చేరాడు ఆ గుట్టవద్ద కొన్ని ఇండ్లను నిర్మించి

1 కంగుంది సంస్థాన చరిత్ర – సాధు సుబ్రమణ్యము పుట – 56

దానికి 'అంగనమల' అని పేరుపెట్టి నివాసమున్నాడు ఆ అరణ్యంలో దారి దోపిడిలు చేసి దనము సంపాదించాడు ఒకనాడు కంబినాయుడు ఆ అరణ్యంలో వేటకు పోగా అక్కడ మరొక గుట్టను చూశాడు అంగనమలకన్నా ఈ గుట్ట తన నివాసానికి చాలా బాగుంటుందని ఆలోచించి, ఆ గుట్ట మీద ఒక దేవాలయాన్ని కట్టించాడు అందులో బేతరాయస్వామిని ప్రతిష్ఠించి తన కులదైవంగా పూజించసాగాడు ఆ గుట్ట అడుగు భాగాన ఒక చిన్న కోటను నిర్మించుకొన్నాడు అందులో ఒక గ్రామాన్ని నిర్మించి 'గోనుగూరు' అని పేరుపెట్టి అక్కడికొచ్చి నివసించసాగాడు

ఈ విధంగా ఎవరో కంబినాయుడు స్థావరాన్ని ఏర్పరచుకొని దారిదోపిడిలు చేస్తున్నాడని కంగడు తెలుసుకొని తన బలగంతో కంబినాయుడి పైకి పోరాటానికి దిగాడు కంగడితో సంధి చేసుకొని కంబినాయుడు లొంగిపోయాడు అప్పటి నుండి కంగడితో స్నేహం చేసి కంగడింటికి వస్తూ పోతుండేవాడు శత్రువులు కూడా ప్రవేశించడానికి వీలు కాని ఆ అరణ్య ప్రాంతంలోని అనేక రహస్య మార్గాలను కంబినాయునికి కంగి, కంగడు చూపించారు వారితోపాటు కంబినాయుడు కూడ తీగలపై లోయలు దిగేవాడు, దాటేవాడు ఈ విధంగా పూర్తి రహస్యాలను తెలుసుకొన్న కంబినాయుడు 'మోసముతో కంగి, కంగడు తీగెలపై లోయలను దాటేటపుడా తీగెలను నరికించి వారు లోయలోబడి చనిపోయేటట్లు చేసెను '[1] గుండె ధైర్యంతోపాటు వ్యవహార దక్షత కలవాడు కంబినాయుడు ధనాశ, అధికార దాహం, సంస్థాన విస్తరణా కాంక్షకల కంబినాయుడు కంగి, కంగడు ప్రమాదవశాత్తు మరణించారని ప్రజలను నమ్మించి అక్కడొక దుర్గాన్ని కట్టాడు దీనికి 'కంగుంది' దుర్గమని పేరుపెట్టాడు ఈ కంగుంది దుర్గాన్ని తన రాజధానిగా చేసుకొన్నాడు అప్పటి నుండి తన సంస్థానమును విస్తరింపజేశాడు

కంగుంది అనే పేరు కంగడి పేరుతోనే వచ్చి ఉండవచ్చు కంగి, కంగడు దారిదోపిడీగాళ్ళు వాళ్ళు గొందులలో నివసిస్తూ ఉండేవారు కంగడు నివసించిన గొంది కంగొంది = కంగుందిగా మార్పు చెంది నేడు పిలవబడుతున్నట్లు ఊహించవచ్చు

ప్యాపిలి నుండి వలస వచ్చి కంబినాయుడు మహారజ్‌ఘర్ అను గుట్టను చేరి, ఆ చుట్టుపక్కలనున్న చెట్టు చేమలను కొట్టించి, అంగనమల అను గ్రామాన్ని నిర్మించినట్లు మనకు గ్రంధాధారములున్నవి నేడు ఆ సంస్థాన పాళేగాళ్ళ కుటుంబీకులు ఈ విషయాన్ని మరో విధంగా తెలియజేస్తున్నారు తమిళనాడు ఉత్తర ఆర్కాడు జిల్లాకు చెందిన జోలార్‌పేట దగ్గర 'జవ్వాజి' కొండలు గలవు ప్యాపిలి నుండి వచ్చిన కంబి నాయుడు మొట్టమొదట జవ్వాజి కొండలలో నివాసం ఏర్పరచుకుని తర్వాత మహారాజ్‌ఘర్ అను గుట్టను చేరి సంస్థాన విస్తరణ చేశాడని చెప్పుతున్నారు ☆ అందువల్లనే వీరి పేర్లకు ముందు 'కె జె'

1 కంగుంది సంస్థాన చరిత్ర – సాధు సుబ్రమణ్యము పుట – 3

☆ ముఖాముఖి – కె జె బాలాజి 36 సం॥లు – కుప్పం

అంటే 'కంబినాయని జవ్వాజి' అని ఇంటిపేరుగా పెట్టుకొన్నారు 'కంగుంది జమీందారీ చరిత్రము' అను గ్రంథాన్ని కంగుంది జమీన్‌దారు వారిచే 1917 సం॥న ప్రకటింపబడినప్పటికీ అందులో జవ్వాజి కొండల ప్రసక్తి తీసుకు రాకపోవడం గమనార్హం అయినప్పటికిన్నీ వారి పేర్లకు ముందు జవ్వాజిని చేర్చడంవల్ల మహారాజ్‌ఘర్ గుట్టను చేరకు ముందు కంబినాయుడు జవ్వాజి కొండలలో ప్రవేశించి ఉండవచ్చునని భావించవచ్చు దీనికి సంబంధించిన చారిత్రిక ఆధారాలు లభ్యం కాలేదు

## 5-3 కంగుంది ఆస్థానం

కంగుంది సంస్థానమునకు మూల పురుషుడైన 'కంబినాయుడు' 66 సంవత్సరాలు పాలించి 1132వ సంవత్సరాన మరణించాడు ఇతని పాలనలో సంస్థాన విస్తరణ, గ్రామాల నిర్మాణం, అడవులను కొట్టి వ్యవసాయ భూములుగా తీర్చిదిద్దడం ఎక్కువగా జరిగింది ఇతనికి పెద్ద వీరప్ప నాయుడు, తిరుమల నాయుడు, చిన్న వీరప్ప నాయుడు అనే ముగ్గురు కుమారులు కంబినాయని మరణం తర్వాత 1132వ సంవత్సరం పెద్ద వీరప్ప నాయుడు అధికారంలోకి వచ్చాడు ఇతను కూడా సంస్థానమును విస్తరింపజేశాడు వీరి మాతృభాష మరాఠి మహారాష్ట్రం నుండి బ్రాహ్మణులను, పండితులను రప్పించి, వారికి మాన్యాలను, ఇనాం భూములను, గ్రామాలనిచ్చి పరిపాలనను పటిష్ఠం చేశాడు

కొంత భూమిగల వారిని "నెలసువాన్‌దార్" అని, ఒక గ్రామానికి అధిపతిని "మొఖాసాదార్" అని, ఎక్కువ గ్రామాలు గల వారిని "జోడీదార్" అని వర్గీకరించి రెవిన్యూ వసూలు చేసేవారు పెద్ద వీరప్ప నాయుడు 53 సంవత్సరాలు పాలించి 1185వ సంవత్సరంలో మరణించాడు ఇతని మరణం తర్వాత ఇతని కుమారుడు "మోముర్ది చిన్న వీరప్ప నాయుడు" తన 46 సంవత్సరాల పాలనలో కృష్ణస్వామి ఆలయాన్ని, విరూపాక్ష ఆలయాన్ని కంగుందిలో కట్టించాడు ప్రజలలో ఆధ్యాత్మిక చింతన, దైవభక్తి కల్గించడానికి, అంతఃపుర స్త్రీలకు వినోదం కల్గించడానికి నాటక సమాజం స్థాపించినట్లు తెలియుచున్నది [1] జానపద కళలకు వీరి పాలనలో గుర్తింపు లభించింది ఈ విషయం తెలిసికొని విజయనగరం నుండి కూచిపూడి భాగవతులు విజయేంద్ర భట్టాచార్య తమ శిష్యబృందంతో కంగుంది సంస్థానమునకు వచ్చాడు ఈ విధంగా వలసవచ్చి తన జీవిత కాలమంతయు రాజాంతఃపురంలో వినోదాలకు కల్పించాడు అతని తర్వాత కూచిపూడి భాగవతం పూర్తిగా అంతరించి వీధినాటక రూపంలో ప్రచారంలోకి వచ్చింది అప్పటి నుండి ఈ కళ వారికి వంశపారంపర్యంగా వస్తున్నది ప్రస్తుతం కుప్పం మండలానికి చెందిన 'కొత్త ఇండ్లు' అను గ్రామంలో కంగుంది నాటకాలను ప్రదర్శించే గొప్ప కళాకారులు ఉన్నారు

1 కంగుంది సంస్థాన చరిత్ర – సాధు సుబ్రమణ్యము పుట – 7

## 5-4 కంగుంది పాళేగార్లు - ప్రజాహిత కార్యక్రమాలు

కంగుంది సంస్థానాన్ని 28 తరాల వాళ్ళు పరిపాలించారు వీరు క్రీ॥ శ॥ 1066 నుండి 1950 వరకు సంస్థానాధిపతులుగా ప్రసిద్ధికెక్కారు వీరి పాలనలో అనేక ప్రజాహిత కార్యక్రమాలను చేపట్టిన వారు అనేకులున్నారు [1] నాటి సాంఘిక రాజకీయ పరిస్థితులకు అనుగుణంగా పాలన సాగించారు వీరి పాలనాకాలంలో చేపట్టిన కొన్ని మంచి కార్యక్రమాల్ని ఇందు పొందుపరచబడింది

**1. కంబి నాయడు 1066-1132** పాళెం యొక్క మూల పురుషుడు అంగనమల, గోనుగూరు అను గ్రామాలను నిర్మించాడు బేతరాయస్వామిని ప్రతిష్ఠించాడు కంగుంది దుర్గాన్ని నిర్మించి సంస్థానాన్ని విస్తరింపజేశాడు మల్లేశ్వరం, బసవేశ్వర దేవాలయాలను నిర్మించాడు

**2 పెద్ద వీరప్ప నాయడు 1132-1185** కంబి నాయడి జ్యేష్ఠ పుత్రుడు అనేక కోటలు నిర్మించి బలగాన్ని పెంచాడు బ్రాహ్మణులకు, ఇతరులకు గ్రామాలు, మాన్యాలు ఇనాములిచ్చి చక్కని పరిపాలన అందించాడు

**3 మోముర్ది చిన్న వీరప్ప నాయడు 1185-1231** · కంగుందిలో కృష్ణస్వామి, విరూపాక్షేశ్వరుని దేవాలయాలు నిర్మించాడు బహుధైర్యశాలి ప్రజలను దైవభక్తపరులుగా చేశాడు కంగుంది సంస్థానంలో కళలను ప్రోత్సహించుటకు నాటక సమాజాలను స్థాపింప జేశాడు ఇతని సంస్థానంలో కళలకు ఆదరణ లభిస్తుందనే కూచిపూడి భాగవతులు వలస వచ్చారు

**4 పెద్ద వేంకటపతి నాయడు 1231-1241** పది సంవత్సరాలు సాధారణ పరిపాలన చేశాడు

**5 తాతా వీరప్ప నాయడు 1241-1265** బీట మంగళం తాలూకాకు చెందిన మషికం, మలుపల్లె, గౌండ్లపల్లె అను గ్రామాలను ఒక అగ్రహారంగా చేశాడు కంగుందికి చేరిన చెట్టుసీమలో ఒక పెద్ద గుంటను తవ్వించాడు

**6 వరమల నాయడు 1265-1299.** ఇతడు ప్రస్తుతం కుప్పం అను గ్రామం దగ్గర ఒక పెద్ద కాలవను తవ్వించాడు విరుఖలపురం అను గ్రామంలో గోపాలకృష్ణ స్వామి ఆలయాన్ని నిర్మించాడు

**7 వెంకటపతి నాయడు 1299-1361** ఇతడు బూసినాయని పాళెం గ్రామంలో ఒక దేవాలయం కట్టి రామభద్రస్వామిని ప్రతిష్ఠించాడు గోపాలకృష్ణస్వామి ఆలయానికి గాలిగోపురం కట్టించాడు బంగార్నత్తము అను గ్రామంలో ఒక పెద్ద గుంటను తవ్వించాడు శాంతియుతంగా పరిపాలించాడు

1 కంగుంది సమీన్‌దారి చరిత్రము - కంగుంది జమీన్ దారువారిచే ప్రకటింపబడినది - 1917

8 పెద్ద వేంకటపతి నాయుడు 1361-1429 ఉదార స్వభావుడు న్యాయపరిపాలన చేశాడు

9 వరమూర్తి నాయుడు 1429-1484 పెద్ద వేంకటపతి నాయుడి సోదరుడు మాన్యాలను ఎక్కువగా దానం చేశాడు

10 అచ్యుతనాయుడు 1484-1538 ఇతడూ ఉదార స్వభావుడు

11 రామభద్ర నాయుడు 1538-1591 ఇతని కాలంలో వెంకాజీ, శివాజీరావు అను ఇద్దరు మహారాష్ట్ర నాయకులు కంగుందికి వచ్చి పైకం అడుగగా చెల్లించలేని పరిస్థితుల్లో బీటమంగళం, తయిల్లూరు, బుడ్డికోట తాలూకాలను వారికిచ్చేశాడు

12. పెద్ద ఒమ్మప్ప నాయుడు 1591-1637 సాధారణ పరిపాలన చేశాడు

13 వెంకటపతి నాయుడు 1637-1696 పెద్ద ఒమ్మప్ప నాయడి సోదరుడు విలాస పురుషుడు

14 వెంకటగిరి నాయుడు 1696-1720 ఇతన్ని గురించి చారిత్రికులు విశేషాలేమీ చెప్పలేదు

15 రామభద్రనాయుడు 1720-1723 మూడేండ్లు మాత్రమే పాలన సాగించాడు

16 వరమూర్తి నాయుడు 1723-1741 శక్తి సామర్థ్యాలు గల వాడు చుట్టుపక్కల ప్రాంతాలపై దండెత్తి కొల్లగొట్టి అమితంగా ధనసేకరణ చేశాడు తన కాలంలో నౌకర్లకు, అనుచరులకు ఉన్నత స్థితిని కల్పించి మంచిపాలన అందించాడు

17 వెంకటపతి నాయుడు 1741-1759 ప్రజలు సుఖంగా ఉండేలా పాలించాడు శిస్తు వసూళ్ళు ప్రారంభించాడు యాంగోనపల్లి గ్రామంలో ఒక గుంటను తవ్వించాడు మంచి పాలకుడుగా పేరు గడించాడు

18 వరమల నాయుడు 1759-1767· ఇతను కూడ సాధారణ పరిపాలన చేశాడు

19 వీరప్ప నాయుడు 1767-1777 ఇతను వరమల నాయుడు సోదరుడు ఇతడు చిన్ననారాయణయ్య అను బ్రాహ్మణుని ప్రధానిగా నియమించుకొని సంస్థాన పాలనాధికారమును సర్వమూ అతనివశం చేశాడు

20 వెంకటగిరి నాయుడు 1777-1780· మూడేళ్ళు మాత్రమే పరిపాలివాడు

21 సీతప్ప నాయుడు 1780-1783 మూడేళ్ళు మాత్రమే పరిపాలించాడు

22 వెంకటపతి నాయుడు 1783-1823 ఇతను న్యాయానుసారంగా దయార్ద్ర హృదయంతో పాలించాడు పాలనా వ్యవహారాలను చక్కబెట్టాడు

23 రామప్ప నాయుడు 1823-1848 ఇతని పాలనలో కుటుంబ సమస్యలు, ఆస్తి తగాదాలు ఎదుర్కొన్నాడు

**24 సుబ్బరాజు నాయుదు 1848-1866** ఇతని పాలనంతా కోర్టు వ్యవహారాలు, ఆస్తి తగాదాలతోనే గడచిపోయింది

**25 వెంకటపతినాయుదు 1866-1883** ఇతను కూడా కోర్టు వ్యవహారాలు, ఆస్తి పంపకాల్లో తలమునకలయ్యాడు

**26 రామప్ప నాయుదు 1883-1891**. 1883 మొదలు 1890 వరకు సంస్థానము వారి ఆధిపత్యము క్రింద ఉండెను తర్వాత 10 నెలలు పాలించాడు

**27 సుబ్బరాజు నాయుదు 1891-1910** ఇతను శిస్తు వసూళ్ళలో మధ్యవర్తులు రైతులను ఇబ్బంది పెట్టే పద్ధతికి స్వస్తి పలికాడు రైతులతో ప్రత్యక్ష సంబంధాలు ఏర్పరచుకొని శిస్తు వసూళ్ళు చేశాడు భూమిశిస్తు శాశ్వతముగా నిర్ణయించి రైతులకు శాశ్వత పట్టాలిచ్చాడు సంస్థాన ఆదాయాన్ని పంచాడు ఇతని పూర్వీకులు పరాధీనం చేసిన గ్రామాలను తిరిగి కొని తన ఆస్తిని పెంపు చేశాడు ఇతనికి వాస్తు శాస్త్రమునందభిరుచి గనుక వాస్తు శాస్త్రరీత్యా అనేక కట్టడాలను, బాటలను ఏర్పరచెను కుప్పంలో ఆకర్షణీయమైన నగరును నిర్మించి 'పన్నగ శయన భవన'మని పేరు పెట్టాడు ఇతని కాలంలో ప్రజలకు రహదారి సౌకర్యాలేర్పడినవి పాలేరు నదిపై వంతెన కట్టించాడు పరిపాలనా సౌలభ్యం కొరకు తన సంస్థానంలో విదేశీయులను ఉద్యోగస్తులుగా నియమించాడు కంగుంది సమీపంలోని పాళేగాళ్ళ కుటుంబ స్మశానమందు సమాధుల కట్టడాలు కలవు వీటి భద్రతకై సమాధుల చుట్టూ ఒక ప్రహరీని కట్టించాడు అవి నేడు 'సమాధులుగా' ప్రసిద్ధి కెక్కాయి



పాళేగాళ్ళ సమాధులు (కంగుంది)

సుబ్బరాజు నాయుదు మరణానంతరం అతని కుమారుడు వెంకటపతి నాయుదు మైనరు కనుక కోర్టు ఆఫ్ వార్డ్సు వారి స్వాధీనంలో ఉండి మదరాసు నగరంలో విద్యనభ్యసించాడు మైనారిటీ తీరిన తర్వాత 10 12 1918 సంవత్సరంలో జమీందారుగా బాధ్యతలను

స్వీకరించాడు ఇతడు సాహిత్యప్రియుడు తెలుగు, తమిళం, ఇంగ్లీషు భాషలను అనర్గళంగా మాట్లాడేవాడు 'తిరుప్పావై' అను తమిళ గ్రంధాన్ని తెలుగులోకి అనువదించినట్లు తెలియు చున్నది 'కేటెల్ బ్రీడింగ్', 'బుక్ ఆన్ అగ్రికల్చర్ అనే రెండు గ్రంధాలను ఇంగ్లీషులో రాశాడు ☆ రాజా కె జె వెంకటపతినాయడు మంచి పరిపాలనా దక్షుడుగా గుర్తింపబడ్డాడు తన జమీందారీలోని 360 గ్రామాల పేర్లు, ఆ గ్రామాల్లోని ప్రముఖుల పేర్లు సునాయాసంగా చెప్పగలిగేవాడు అందువల్ల ప్రజలకు, జమీందారుకు మధ్య సన్నిహిత సంబంధాలు ఎక్కు వగా ఉండేవిగా స్పష్టమవుతుంది అందుకే కాబోలు ఇతను బ్రతికుండగనే ప్రజలు సుమారు 60 వేల రూపాయలు చందాలుగా వసూలుచేసి అతని కాంశ్య విగ్రహాన్ని కుప్పంలో ప్రతిష్ఠిం చారు ఇతని జీవిత కాలంలోనే ఆ విగ్రహ ప్రతిష్ఠ జరిగి 25 సంవత్సరాలు పూర్తిచేసుకొన్న సందర్భంగా ఘనంగా రజతోత్సవాలు నిర్వహించాడు జమీందారీ వ్యవస్థరద్దుపరచిన పిమ్మట వీరు కంగుంది దుర్గాన్ని వదలిపెట్టి కుప్పంలో తన తండ్రి నిర్మించిన పన్నగ శయన భవనానికి నివాసాన్ని మార్చాడు రాజా కె జె వెంకటపతి నాయడికి సుబ్బరాజుల నాయడు, రామప్ప నాయడు అను ఇద్దరు కుమారులు సుబ్బరాజుల నాయడికి కె జె నాగ భూషణరావు నాయడు అను కుమారుడు, జయలక్ష్మి అను కుమార్తె కలరు కె జె నాగ భూషణరావు నాయడికి కె జె బాలాజి, కె జె సుబ్బరాజుల నాయడు అను ఇద్దరు కుమారులు, కె జె పద్మావతి, కె జె అనూరాధ అను ఇద్దరు కుమార్తెలు కలరు సుబ్బరాజుల నాయడు తమ్ముడు రామప్ప నాయడికి కె జె మురళీధర్, కె జె విష్ణుకుమార్ అను ఇద్దరు కుమారులు కలరు వీరిద్దరూ నేటికీ అవివాహితులే

రాజా కె జె వెంకటపతి నాయడికి శకుంతలాదేవి, రుక్మిణీదేవి అను ఇద్దరు కుమార్తెలు కలరు శకుంతలా దేవికి యం ఎస్ ఎస్ మూర్తి, ఎం టి వి వెంకటపతి నాయడు అను ఇద్దరు కుమారులు కలరు ఈ వెంకటపతి నాయడు ప్రస్తుతం కుప్పంలో న్యాయవాది వృత్తి చేపట్టాడు యం ఎస్ ఎస్ మూర్తి బ్యాంకు ఉద్యోగిగా స్థిరపడ్డాడు రాజా కె జె వెంకటపతి నాయడి రెండవ కుమార్తె అయిన రుక్మిణీ దేవికి ఎన్ ఎన్ వి త్రినాథ్, ఎన్ ఎన్ వి వీరరాఘ వులు అను ఇద్దరు కుమారులు కలరు వీరిద్దరు నేడు వ్యవసాయం జీవనం సాగిస్తు న్నారు ఈ పాళేగాళ్ళ సంతతివారు నేడు ఎవరికి వారు వ్యాపార ఉద్యోగ వ్యవసాయాల్లో స్థిరపడి జీవనం సాగిస్తున్నారు

మొత్తం మీద కంగుంది సంస్థానాన్ని పాలించిన పాళేగాళ్ళ పరిపాలనలో ఎన్నో ప్రజాహిత కార్యక్రమాలు చేసినట్టు విశదమగుచున్నది ప్రజల సౌకర్యార్థం రహదార్లు, బాటసారులకు సత్రాలు నిర్మించినట్టు తెలుస్తున్నది విద్యాప్రమాణాలు పెంచటానికి పాఠశాలలను ఏర్పాటు చేశారు నీటి సౌకర్యార్థం అనేక చెరువులు తటాకాలు, రాగునీటి

☆ ముఖాముఖి – ఎం వెంకటపతి నాయుడు – 50 సం॥, ఎం సాయిబాబామూర్తి – 52 సం॥లు కుప్పం

బావులను తవ్వించినట్లు నిదర్శనాలున్నాయి [1] ప్రజలలో ఆధ్యాత్మిక చింతన పెంపొందించ డానికి అనేక దేవాలయాలను నిర్మించారు రైతులకు ఉపయోగపడే 'పశు శాస్త్రం' 'చెరకు' అనే గ్రంథాలను పాళెగాళ్ళు రచించారు చెరకు రసాన్ని కాచడనికి సింధివాహిని ఉపయోగిం చడం, వ్యవసాయ బావుల్లో ఊటదార్లు తెలుసుకోవడానికి చేతి రంధ్రాలు వేయడం, వరి నాట్లలో నూతన పద్ధతులను అనేక ప్రదర్శనల ద్వారా తెలియజేశారు ఈ ప్రదర్శనల్లో అధిక దిగుబడులను సాధించిన రైతులకు బహుమతులిచ్చి ప్రోత్సహించారు



కంగుంది దుర్గం కింది భాగంలో నిర్మించిన కాళికమ్మగుడి

## 5-5 కంగుంది వీధినాటకాలు:

కంగుంది సంస్థాన మూల పురుషుడు కంబినాయని మనుమడు మోముర్తి చిన్న వీరప్ప నాయడు 1185వ సం॥న సంస్థానాధిపత్యాన్ని పొందాడు ఇతడు కంగుంది పట్టణాన రెండు దేవాలయాలను కట్టించి, వానిలో కృష్ణస్వామిని, విరూపాక్షేశ్వరున్ని ప్రతిష్ఠ చేశాడు ఇతడు ధైర్యశాలేకాక కళాప్రియుడు కూడా ఇతని పరిపాలనా కాలంలో 'ప్రజలను దైవభక్తి పరు లుగా చేయడానికి, అంతఃపుర స్త్రీలను సంతోషింపజేయటానికి కంగుందిలోని కొంతమంది కళాకారులను చేరదీసి నాటక కళను ప్రోత్సహించటానికి నాటక సమాజాన్ని స్థాపించాడు [2]

పుణ్యక్షేత్రాలైన శ్రీశైలం, తిరుపతి, శ్రీకాళహస్తి, భద్రాచలం, సింహాచలం ప్రాంతాల్లో 'కురవలు' ఆటవిక జాతివారు నివసించేవారు ఆయా పుణ్యక్షేత్రాలను దర్శించటాని వచ్చిన భక్తులకు ఆ క్షేత్ర మహత్యాలను పాటల రూపంలో అడుగులు వేసుకొంటూ వివరించి, వారి వద్ద కొంత పైకం తీసుకొనే వారు ఈ కురవలు వేసే అడుగు కాబట్టి 'కురవంజి' లేదా 'కొర

1 శ్రీ రాజా కె జె వెంకటపతి నాయని పాలనా రజతోత్సవ సందర్భ ప్రచురణ - రజత జయంత్యుత్సవ కార్యనిర్వాహక సంఘం - 10 12 1943

2 కంగుంది సంస్థాన చరిత్ర - సాధు సుబ్రమణ్యము పుట - 7

వంజి' అనే పేరుతో ఒక నృత్య విశేషంగా ప్రసిద్ధికెక్కింది అది ఒక జానపద కళాఖండంగా కూడా స్థానాన్ని పదిలపరచుకొన్నది ఈ పాట – ఆటల రూపమే క్రమేణ నాటకంగా పరిణతి చెందింది కురవలు దైవపరంగా, రాజుల పరంగా ఉన్న కథలను నాటక రూపంలో ప్రదర్శి స్తారు వీరు వైష్ణవ దేవాలయాల్లో విష్ణు పురాణాలను ఆడ్తారు బృహదీశ్వరాలయంలో ఇప్పటికీ ఈ కురవంజి నాటకం ప్రదర్శిస్తున్నారు ఇది ఏక పాత్రాభినయంతో ప్రారంభమై తర్వాత సింగి, సింగడుగా ద్విపాత్రల నాశ్రయించింది హాస్యరస పరిపుష్టికోసం 'కోణంగి' పాత్ర ప్రవేశం చోటు కేసుకొంది నేటికినీ సజీవ పాత్రలుగా జానపదుల హృదయాల్లో ముద్రలు వేసుకొన్న తోలుబొమ్మలాటలోని 'జుట్టు పోలిగాడు' 'కేతిగాడు' 'బంగారక్క' కురవంజి నాటక సాంప్రదాయాల నుంచి వచ్చాయి ఇలా పాత్రలను పెంచుకొంటూ కురవంజి నాటకాలు అడవుల్లో ఆవిర్భవించినప్పటికి జన సామాన్యంలోకొచ్చి వీధుల్లో ప్రదర్శింపబడి వీధి నాటకాలుగా ప్రసిద్ధికెక్కాయి

కురవంజి నాటకాలను 'యక్షులు' అను జాతివారు అనుకరించి ప్రదర్శించారు గనుక 'యక్షగాన నాటకాల'ని పేరు వచ్చింది యక్షగానం క్రీ॥ శ॥ 15వ శతాబ్దిలో తెలుగులో ఒక సాహిత్య ప్రక్రియగా రూపొందినట్లు శ్రీనాథుడు పేర్కొన్నాడు

**"కీర్తింతు రెద్దాని కీర్తి గంధర్వులు**
**గాంధర్వమున యక్షగాన సరళి"**[1]

ఈ యక్షగానం వీధులలో ప్రదర్శించడం వల్ల వీటికి యక్షగాన వీధి నాటకాలని కూడా పేరు వచ్చింది ఈ విధంగా యక్షగానం వీధి నాటకాలతో కలిసి పోయింది కూచిపూడి భాగవతులు మొదట వీధి నాటకాలు ఆడేవారు ప్రజాదరణ యక్షగానాలకు ఉండటం వల్ల కూచిపూడి భాగవతులు యక్షగానాల్ని ప్రదర్శించడం ప్రారంభించారు కూచిపూడి నృత్యానికి ఆద్యుడైన సిద్ధేంద్రయోగి వీధి నాటక యక్షగానాలను సమ్మిళితం చేసి ఒక నూతన ప్రయోగం చేశాడు భామాకలాపం, పారిజాతాపహరణం, గిరిజా కళ్యాణం, కీచకవధ, హరిశ్చంద్ర, ఉషా పరిణయం మొదలగు నాటకాలను ప్రదర్శించారు కాలక్రమేణ యక్షగానాలకు ప్రజా దరణ తగ్గడంవల్ల ఈ యక్షగాన రూపాలను కొంతమార్చి వీధి నాటకాలుగా ప్రదర్శించారు

ప్రారంభ దశలో నాటక రూపంలో బహుళ ప్రజాదరణ పొందిన వీధి నాటకాలు యక్ష గానాలతో మిళితమై కొద్ది రోజులు అజ్ఞాతంగా తన ఉనికిని పోగొట్టుకున్నప్పటికిని తిరిగి యక్షగానాల ప్రాబల్యం తగ్గిపోవడంతో వీధినాటకాలు తమ పూర్వపు వైభవాన్ని, స్థిరత్వాన్ని నిలుపుకొన్నాయని చెప్పవచ్చు (నాటక కళలో చేరిన యక్షగానం ఉచ్ఛస్థితికి చేరి పతనా వస్థకు దిగినప్పటికీ నాటకాలు మాత్రం జనుల హృదయాల్లోనుండి తొలగిపోకుండా తన స్థిరత్వాన్ని ఔన్నత్యాన్ని నిలుపుకొని శాశ్వతంగా నేటికీ ప్రదర్శనలకు నోచుకొంటూనే ఉన్నాయి

1. శ్రీనాథుని భీమేశ్వర పురాణం – 3వ – అ 65 ప

కురవంజి, యక్షగానాలు నేడు అరుదుగా ప్రదర్శింపబడుతున్నాయి అలాకాక నాటకాలు మాత్రం అన్నిచోట్లా నేడు ప్రదర్శించడమేగాక ప్రజాదరణను పొందుతుండటంవల్ల వీధి నాటకాల ప్రాముఖ్యం అమితమని చెప్పకతప్పదు

కూచిపూడి భాగవతులు ప్రదర్శించే యక్షగానాలకు ప్రజాదరణ తగ్గిపోవడంతో ఆనాటి కళాకారుల జీవనం అస్తవ్యస్తమయింది ఎందుకంటే ఈ కళనే కులవృత్తిగా జీవించే వాళ్ళు కాబట్టి కాలే కడుపులతో కలాపోషకులను వెతుక్కుంటూ దేశాటన చేయసాగించారు ఈ సమయంలో కంగుంది సంస్థాన మూడో పాలకుడైన మోమూర్ది చిన్న వీరప్ప నాయడు నాటక సమాజాన్ని స్థాపించి కళాకారులకు ప్రోత్సాహమిస్తున్నాడని తెలుసుకొన్న కూచిపూడి భాగవతులు 'విజయేంద్ర భట్టాచార్య' అనునతడు విజయనగరం నుండి తమ శిష్య బృందంతో కంగుంది సంస్థానానికి వలసవచ్చాడు అతని జీవితకాలమంతయూ కంగుంది పాళేగాంద్రకు వినోదాలను కల్పించాడు అతని అనంతరం కూచిపూడి భాగవతం అంతరించి వీధి నాటక రూపంలో వెలసింది

కంగుంది జమీందారీలో శాస్త్రీయ సంగీతానికంటే జానపద కళలకే పోషణ కల్పించినట్లు కన్పిస్తున్నది కోలాటాలు, తోలుబొమ్మలాటలు, గొబ్బి పాటలు, వీధి నాటకాలు మొదలగు జానపద కళారూపాలకే ఆదరణ వీరి కాలంలో లభించింది కాలగమనంలో వీధి నాటకాలకే ఎక్కువ ప్రజాదరణ కలిగింది కాబట్టే నాటినుండి నేటి వరకు చిత్తూరు జిల్లాలో 'కంగుంది వీధి నాటకాల'కే విస్తృత ప్రచారం, విశిష్ఠ స్థానం ఏర్పడింది కళా కారులు కృష్ణా, గోదావరి ప్రాంతాల నుంచి కూచిపూడి భాగవతుల ధాటికి తట్టుకోలేక తమిళ నాడుకు వలసవచ్చి, అక్కడ కొద్ది రోజులుండి కంగుంది సంస్థానానికి వచ్చి స్థిరపడినట్లు చెబుతున్నారు * తోట, సముద్రాల, పోకల, మాదాల, పసుపులేటి, చల్లా మొదలగు ఇంటిపేర్లు కల వ్యక్తులు కంగుంది ప్రాంతాల్లో ఉండటమే అందుకు నిదర్శనం కంగుంది వీధినాటకాలాడేవారు 'గోపిత బలిజ', 'బలిజ నాయళ్ళు'గా చెప్పుకుంటారు ఈ కళా కారులు ప్రస్తుతం కొత్తఇండ్లు, అనిమిగానిపల్లి, గుండ్లపల్లి, యామగానిపల్లి, యామనూరు గ్రామాల్లో నివసిస్తున్నారు ఈ గ్రామాలన్నీ కుప్పానికి 10 కిలోమీటర్ల పరిధిలోనే ఉన్నాయి

కంగుంది వీధినాటకాలకు మూలపురుషుడు 'గాది మునెప్ప'గా తెలుస్తున్నది ఇతని వంశస్థుడు 'సీదా సుబ్బయ్య' నేటికీ వీధి నాటకాలను రచించి ప్రదర్శింపచేస్తున్నాడు గాది మునెప్పతో పాటు 'శీనప్ప' కూడా ఆనాడు వీధి నాటకాలను నేర్చి, నేర్పించి ప్రదర్శించేవాడు ఇక రెండవ తరానికి చెందిన వీధి నాటక కళాకారులు తోట చినగంగప్ప, అందే చిన వెంకటప్ప వీరు ఈ వీధి నాటకాలనే కులవృత్తిగా స్వీకరించి ఆ కళకంకితమై అనేక వీధి నాటక బృందాలను ఏర్పాటుచేసి వారికి శిక్షణ ఇచ్చారు వీరి తర్వాత చిత్తేరి మునస్వామి, గాది శీనప్ప, సీదా వెంకటేశు, సీదా అప్పోజీ, చల్లా చిన రంగప్ప, ముత్యాల మునిరత్నం,

☆ ముఖాముఖి – ఎ ఎస్ నాయుడు – కొత్త ఇండ్లు

చిత్తేరి చిన్నబ్బ మొదలగు వారు ప్రముఖ వీధినాటక కళాకారులు కంగుంది వీధి నాటకాలకు గత 30 సంవత్సరాలుగా ప్రజాబాహుళ్యంలో విస్తృత ప్రచారం రావడానికి, ప్రజాదరణ పొందడానికి బాటలు వేసినవాడు చిత్తేరి మునస్వామి చిత్తేరి మునస్వామి ఏ వేషమైనా వేయగలడు వేషం కట్టినపుడు కూడా కంటి అద్దాలు తీయకుండా ఎప్పుడూ వేసుకోవడం వల్ల చిత్తేరి మునస్వామికి 'అద్దాల మునస్వామి' అనే పేరు కూడా ఉంది [1] ఈ వీధి నాటకాలను సంస్కరించి క్రమబద్ధంగా నాటకీయ పద్ధతిని వీధి నాటకాల్లో ప్రవేశపెట్టింది చిత్తేరి మునస్వామి మొదట భాగవతంలోని ముఖ్యమైన ఘట్టాలను ఇతివృత్తంగా తీసుకుని 'రుక్మిణీ కళ్యాణం' 'అంబరీష' 'కృష్ణ లీలలు' 'భక్తప్రహ్లాద' మొదలైన నాటకాలను రచించాడు అట్లే చిత్తూరు జిల్లాలో మహాభారత ఇతివృత్తాన్ని కథగా తీసుకొని వీధి నాటకాలుగా ప్రదర్శించే పద్ధతికి శ్రీకారం చుట్టిన వాడు చిత్తేరి మునస్వామి ఏ కథనైనా, ఎన్ని రోజులకు కావలయునన్నా కుదించి, పెంచి వీధి నాటకాలుగా రచించే నేర్పరి, కళాకౌశలం కలవాడు

వీరి తర్వాత సీదా మునస్వామి, సీదా అప్పోజీ, తోట తిమ్మయ్య, తోట చిన వెంకటేశు, కోమటి రామచంద్రయ్య, నారాయణప్ప, మీసాల మునివెంకటప్ప, చల్లా మునివెంకటప్ప, అగ్గిపెట్టెల మునివెంకటప్ప, నారాయణప్ప మొదలగు వారు చెప్పుకోదగ్గ కళాకారులు వీరిలో చల్లా మునివెంకటప్ప అత్యద్భుతంగా నృత్యంచేసి ప్రేక్షక లోకాన్ని ఉగ్రూత లూగించే వాడని ప్రతీతి

కంగుంది వారి భారత నాటకాలకు బహుళ ప్రశస్తి ఉంది ఈ వీధి నాటకాలకు సంబంధించి పూర్వాపరాలు, చరిత్ర, కాలానుగుణంగా వచ్చిన మార్పులకు ఆధారాలు లేవు నిక్షిప్తమూ కాలేదు

## 5-6-ఆవిర్భావం - వికాసం:

కంగుంది కళాకారులకు సంబంధించినంతవరకు వీరు ఎప్పటి నుండి వీధినాటకాలు ప్రదర్శిస్తున్నారో ఖచ్చితంగా తెలియదు ఈ కళాకారులను సంప్రదించి అడుగుగా వారికి ముందు గల రెండు మూడు తరాల నుండి ఈ కళ వారికి సంక్రమించినట్లును, ఆ గతించిన రెండు మూడు తరాల వారికి కూడ ఇలాగే వారి పూర్వీకుల నుంచి ఈ కథ మౌఖికంగా సంక్రమించినట్లు చెబుతున్నారు ☆ దీన్ని బట్టి చూడగా ఈ వీధి నాటక కళ వీరికి ఎన్నో తరాల నుండి సంక్రమించి ఆనువంశకంగా వస్తున్నట్లు తెలుస్తున్నది కూచిపూడి కళాకారులకు సిద్ధేంద్రయోగి నాట్యం నేర్పించి అప్పటినుండి వారికి గురువుగా, మార్గదర్శకుడుగా ఏర్పడియున్న విషయం బహిర్గతం కాని కంగుంది కళాకారులకు ఆ విధంగా ఏ కాలంలోను

1 రాయలసీమలో రంగస్థలం డా॥ పోతుగుంట వెంకట సీతారామయ్య - పుట - 15

☆ ముఖాముఖి - ఎ ఎస్ నాయుడు - కొత్త ఇండ్లు

ఒక గురువుగానీ, ఒక మార్గదర్శకుడుగానీ ఉండినట్లు తెలియరాలేదు  అంటే ఎందరో గురువులు, ఎందరో మార్గదర్శకులు ఈ కంగుంది నాటకాలకున్నారు

కంగుంది కళాకారుల నాటకం ఈనాడు వీధినాటకమని పిలువబడుతున్నదే గాని మొదట నుంచి వారి నాటకాలకు ఈ పేరు లేదని తెలుస్తున్నది  వీరి నాటకాలను 'బయలాట'లనీ, 'భాగవతం' అనీ, 'కేళిక' అనీ పిలిచేవారు  తర్వాతి కాలంలో వీధి నాటకమనే పేరు స్థిర పడింది  వీధి నాటకమనే పేరుతో పాటు 'భారత నాటక'మని కూడా అంటారు  ఈ భారత నాటకమనే పేరు వీరు భారతాలు ప్రదర్శిస్తున్నప్పటి నుండి ఏర్పడింది

పూర్వపు పేర్లయిన బయలాట, భాగవతాట, కేళిక అనే వాటిలో ఇప్పటికి కూడా కొందరు పాతతరం వారు అక్కడక్కడా వీరి నాటకాలను 'కేళిక' అని వ్యవహరిస్తున్నారు  ఇప్పటికి 20 సంవత్సరాల మునుపు వీరి నాటకాలను కేళికలు అని అన్నిచోట్లా విరివిగా వ్యవహరిస్తుండే వారు  ఎవరైనా పరిచయస్తులు వీరి ఇండ్లకు పోయి ఫలనా వ్యక్తి ఎక్కడు న్నాడు? అని అడిగితే వీరి ఇండ్లలోని వారు 'ఆయన కేళికి పోయినాడు' అని సమాధాన మిచ్చేవారు  ఇప్పుడు 'నాటకాలకు పోయినారు' అని చెబుతారు  రానురాను ఈ కేళిక అనే పదము మరుగుపడుతూ వస్తున్నది

వీరు మొదట భాగవతం మాత్రమే ప్రదర్శించినట్లు తెలుస్తున్నది  భాగవత ఇతివృత్తాన్ని తీసుకుని క్రింది నాటకాలను రచించి, ప్రదర్శించే వారు

1 రుక్మిణీ కళ్యాణం
2 వామన చరిత్ర
3 శ్రీకృష్ణలీలలు
4 కంసవధ
5 నరకాసుర వధ
6 అంబరీష
7 భక్తప్రహ్లాద

ఇలా ప్రదర్శించే నాటకాలన్నింటినీ బాగా నేర్చుకొని, ఏ వేషమైనా సంకోచం లేకుండా వేయగల వారికి ఒక గౌరవనీయమైన స్థానం లభిస్తుంది  తక్కిన వారందరూ అతని ఆజ్ఞానుసారం నడుచుకొంటారు  శారీరక సౌష్టవాన్ని బట్టి మగ, ఆడవేషాలు వేస్తారు  ఈ మగ, ఆడ వేషాలు రెండింటిని ఒకరే వేసి ప్రతిభ కనబరచిన వారిని 'మొనగాడు' అంటారు  ఇతను జట్టుకు పెద్దగా వ్యవహరిస్తాడు

## 5-7 చిత్తూరు జిల్లాలో ప్రదర్శించే వీధి నాటకాలు- నాటక బృందాలు:

మానవుడు రోజంతా కష్టపడి అలసిసొలసి సొమ్మసిల్లినపుడు, తిరిగి అతన్ని పునరుజ్జీవిం

జేసి, నూతనోత్సాహాన్ని రేకెత్తించి, ఆనంద డోలికల్లో ఊగిసలాడేటట్లు చేసేవి కళలు అందు లోను ముఖ్యంగా సామాజిక పరిస్థితులకు, సాంప్రదాయాలకు దర్పణం పట్టేవి కూడా కళలే జానపదుల రసికత్వానికి రసగుళికలుగా నిలబడేవి జానపద కళలు చిత్తూరు జిల్లాలో చెక్క భజన, ఏల పాటలు, కోలాటం, పిల్లనగొట్లు, గొబ్బి పాటలు, పండరి భజన మొదలైనవి మనకు దర్శనమిస్తాయి ఈ కళలేగాక వీధినాటకాలు ప్రత్యేక స్థానాన్ని సంతరించు కున్నాయి ఈ వీధినాటకాలు జిల్లాలో అనేక ప్రాంతాల్లో వివిధ వీధి నాటక బృందాలచే వింతపోకడలతో ప్రదర్శింపబడుతున్నవి ఈ వీధినాటకాలకు గత చరిత్రమెండు

గ్రామాల్లో పండుగలు, తిరుణాళ్ళు, కార్యాలు, జాతరలు, ఉత్సవాలు జరుపుకునే సమ యాల్లో ప్రజల్లో భక్తి ప్రపత్తులను పెంచడానికి భగవంతుని గూర్చి తెలియజెప్పే సాధనాలుగా పూర్వం వీధినాటకాలుండేవి మత ప్రచారానికి కూడ ఇవి ఎంతగానో ఉపకరించేవి

చిత్తూరు జిల్లా వీధినాటకాలు అనగానే మనకు స్ఫురించేవి కంగుంది వీధినాటకాలు చిత్తూరు జిల్లాలో అనేక ప్రాంతాల్లో ఈ వీధినాటకాలను ప్రదర్శించే కళాకారులున్నారు చిత్తూరు జిల్లాను తూర్పు, పశ్చిమ మండలాలుగా విభజించి చూచినట్లయితే పశ్చిమ మండలాల్లో కుప్పం మండలానికి చెందిన 'కంగుంది' వీధినాటకాలకు ప్రసిద్ధి కెక్కినట్లే తూర్పు మండలాల్లో విజయపురం మండలానికి చెందిన 'సూరికాపురం' మరియు నింద్ర మండలానికి చెందిన 'ఆరూరు' ప్రసిద్ధి చెందాయి ☆ తూర్పు మండలాల్లో నాటికీ నేటికీ ప్రదర్శింపబడుతున్న వీధినాటకాలు

1 ద్రౌపదీ వస్త్రాపహరణం
2 శశిరేఖా పరిణయం
3 మైరావణ (మైతు రావణ)
4 శ్రీకృష్ణ లీలలు
5 గయోపాఖ్యానం
6 కచదేవయాని
7 మోహినీ రుక్మాంగద
8 నలదమయంతి
9 సత్యహరిశ్చంద్ర
10 సారంగధర
11 నలతంగ
12 బ్రహ్మంగారి జీవిత చరిత్ర
13 కురవంజి
14 అల్లి అర్జున

☆ ముఖాముఖీ - రాజు - 50 సం॥లు - ఆరూరు

## 5-7-1 - చిత్తూరు జిల్లా వీధి నాటక బృందాలు:

**కుప్పయ్య మందడి బృందం** విజయపురం మండలంలో ఉన్న సూరికాపురంలో కుప్పయ్య మందడి అనేక శిష్యుల్ని తయారుచేసి సొంత నాటక బృందాన్ని ఏర్పాటు చేసుకొన్నాడు పైన పేర్కొన్న నాటకాలన్నీ ఈ బృందం ప్రదర్శిస్తారు

**గంగుల మందడి బృందం** నింద్ర మండలానికి చెందిన ఆరూరు గ్రామంలో వీధి నాటకాల గురువుగా ప్రసిద్ధి కెక్కిన కుప్పయ్య మందడి అనేక వీధినాటక కళాకారులను తయారు చేశాడు అతని శిష్యులలో ఒకడైన గంగుల మందడి బృందం ప్రసిద్ధి చెందింది ఈ బృందంలో దాదాపు వంద మందికి పైగా కళాకారులున్నారు

**నరశింహ మందడి బృందం** నగరి మండలంలోని గంద్రాజుకుప్పం గ్రామంలో నరశింహ మందడి బృందం వీధినాటకాలు ప్రదర్శిస్తారు,

**ఈశప్ప రెడ్డి బృందం:** నగరి మండలానికి చెందిన కృష్ణా రామాపురంలో ఈశప్పరెడ్డి బృందంలో 20 మంది వరకు కళాకారులున్నారు వీరు వన్నియరెడ్డి కులస్తులు ధర్మరాజు తిరుణాళ్ళు, బంధువుల కార్యాల్లో నాటక ప్రదర్శన కయ్యే ఖర్చును మాత్రం తీసుకొని ఉచితంగా ప్రదర్శనలిస్తారు

**శివలింగారెడ్డి బృందం** పిచ్చాటూరు మండలం కారూరు గ్రామంలో శివలింగారెడ్డి బృందంలో దాదాపు 25 మంది కళాకారులున్నారు వీరు ఎక్కువగా మైతురావణ (మైరావణ) హరిశ్చంద్ర, నలతంగ, కురవంజి మొదలగు నాటకాలను తమిళభాషలో ఆధునిక పరికరాలతో రక్తికట్టే విధంగా ప్రదర్శిస్తారు

**వెంకటరెడ్డి బృందం** పూతలపట్టు మండలం పోలవరం గ్రామంలో వెంకటరెడ్డి బృందం మహాభారతంలోని 18 పర్వాలను వీధినాటకాలుగా ప్రదర్శిస్తారు ఈ వెంకటరెడ్డి 45 గ్రామాల్లో వీధినాటక బృందాలను తయారు చేశాడు

**నాగులరెడ్డి బృందం** గంగాధర నెల్లూరు మండలం దేవళంపేట సమీపంలోని ఆల్మడుగు గ్రామంలో నాగులరెడ్డి వీధినాటకాలాడే శిష్యులను తయారుచేసి ఎక్కువగా నాటకాలు ప్రదర్శిస్తున్నారు

**రాఘవదాసు బృందం** నగరి మండలం తిరుమల నాయుడు కండ్రిగలో ఉన్న రాఘవదాసు వృద్ధ కళాకారుడు వీధినాటకాలేకాక హరికథ, బుర్రకథ అనర్గళంగా చెప్పగలిగే దిట్ట

కైలాసం బృందం బంగారు పాళ్యం మండలం తిమ్మోజిపల్లి గ్రామంలో కైలాసం గురువుగా 300 మంది శిష్యులను తయారుచేసి ఉన్నాడు ఒక్కొక్క బృందంలో 20 నుండి

25 మంది కళాకారులుంటారు వీరు తమిళంలో మహాభారతాన్ని పూర్తిగా పది రోజుల నుండి 22 రోజుల వరకు ప్రదర్శిస్తారు

**నారాయణ బృందం** చౌడేపల్లి మండలం గోసుల కురప్పల్లి గ్రామంలో నారాయణ బృందం 5 బృందాలు దాక తయారుచేసి గోసుల కురప్పల్లి టీమ్‌గా వీధినాటకాలు ప్రదర్శించి ప్రసిద్ధి కెక్కారు

**మదవలి చెంగప్ప బృందం** బైరెడ్డిపల్లి మండలం చప్పిడిపల్లె గ్రామంలో మదవలి చెంగప్ప వీధినాటక బృందాలను తయారు చేశాడు

**గాండ్ల రత్నం బృందం** బైరెడ్డిపల్లి మండలం విరూపాక్ష పురం మరియు మొరవ ఇండ్లు గ్రామాల్లో గాండ్ల రత్నం బృందాలున్నాయి

**ఎన్ గంగప్ప బృందం** బైరెడ్డిపల్లి మండలం నెల్లిపట్ల మాదిగూరు మరియు ఓటేరు పాళెంలో ఎన్ గంగప్ప వీధినాటక బృందాలున్నాయి వీరు నలతంగ, చిన్నమ్మ కథ, కామనాటకం, హరిశ్చంద్ర నాటకాలు మాత్రం ప్రదర్శించడం గమనార్హం

**ఎమ్ సుబ్రమణ్యం బృందం.** బైరెడ్డిపల్లి మండలం నెల్లిపట్ల మాలపల్లిలో బాలనాగమ్మ, నలతంగ, చిన్నమ్మ కథ, భక్తకుచేల నాటకాలు మాత్రం ఎం సుబ్రమణ్యం బృందం ప్రదర్శిస్తారు

**ఎం.చెంగల్రాయ బృందం** యాదమరి మండలం దాసరాపల్లె మాదిగ వాడలో చిన్నమ్మ కథను ప్రదర్శిస్తారు

**శ్రీకృష్ణ యువజన నాట్య మండలి** బైరెడ్డి పల్లి మండలం నెల్లిపట్లలో కీ॥ శే॥ క్రిష్ణారెడ్డి స్థాపించిన శ్రీకృష్ణ యువజన నాట్యమండలికి కొలమాసనపల్లి తిప్పన్న వీధి నాటక గురువు వీరు సారంగధర, కనకతార, విరాటపర్వం, వారణావతం, జయంతి జయపాల, ద్రౌపది వస్త్రాపహరణం, లంకాదహనం, కృష్ణలీల నాటకాలను ప్రదర్శిస్తారు

**సరసకృష్ణా నాట్య మండలి** పుంగనూరు మండలం కంగా నెల్లూరు గ్రామంలో వీధి నాటక గురువు కృష్ణమూర్తి సరస కృష్ణా నాట్యమండలి వ్యవస్థాపకుడు ఇతను ఎంతో మంది శిష్యులను తయారు చేశాడు తన నాట్యమండలి ద్వారా అనేక ప్రదర్శనలిచ్చాడు కొత్త కండ్రిగ, పెరుమాళ్ళ కండ్రిగ, సి ఆర్ కండ్రిగ, బాదూరు మొదలగు గ్రామాల్లో వీధి నాటక బృందాలను తయారు చేశాడు

**శ్రీకృష్ణ దేవరాయ నాటక సమాజం** కుప్పం మండలం కొత్త ఇండ్లు గ్రామంలో ముత్యాల మునిరత్నం అధ్యక్షుడుగా శ్రీకృష్ణ దేవరాయ నాటక సమాజం ఏర్పడింది ఈ గ్రామంలో చాలావరకు అందరూ కళాకారులే తమిళనాడు, కర్నాటక, ఆంధ్రప్రదేశ్, ఉత్తరప్రదేశ్, ఢిల్లీ మొదలగు రాష్ట్రాల్లో వీధి నాటకాలు ప్రదర్శించి ఎందరి మన్ననలకో పాత్రులయ్యారు

**సుబ్రమణ్యం బృందం** గుడిపాల మండలం పాప సముద్రంలో 15 మందితో బృందం ఏర్పడింది వీరు తమిళ నాటకాలనే ఆడ్తారు

**వడివేలు బృందం** బంగారుపాళ్యంమండలం మిట్టపల్లె గ్రామంలో వడివేలు బృందం తమిళ నాటకాన్ని ప్రదర్శిస్తారు 19 మంది కళాకారులున్నారు

**రాజేంద్ర మండడి బృందం** ఆదిగాని ఊరు గ్రామంలో 16 మంది కళాకారులున్న ఈ బృందం తమిళ నాటకాన్ని ప్రదర్శిస్తారు

**బాబు బృందం** చిత్తూరు మండలం కట్టమంచిలో 15 మంది కళాకారులున్న ఈ బృందం తమిళ నాటకాన్ని ప్రదర్శిస్తారు

## 5-8 కంగుంది వారి మహాభారత వీది నాటకాలు:

కంగుంది నాటకాల్లో మహాభారత నాటకాలను ప్రవేశపెట్టింది చిత్తేరి మనస్వామి 'చిత్తేరి మునస్వామి కంపెనీ' అని ప్రసిద్ధి కెక్కిన వీధి నాటక బృందంలో 60 మంది కళాకారులుండేవారు వారిలో -

1 చిత్తేరి మునస్వామి
2 చిత్తేరి చిన మునస్వామి
3 చిత్తేరి పెద్దబ్బ
4 చిత్తేరి చిన్నబ్బ
5 బుద్రంగప్ప
6 చిన్న రంగప్ప
7 నల్ల రంగప్ప
8 సీతా వెంకటేశు
9 సీతా అప్పోజీ
10 అగ్గిపెట్టెల ముని వెంకటప్ప
11 గంగయ్య
12 బెంగుళూరు మునసామి ఆచ్చారి
13 శీనప్ప
14 సముద్రాల వెంకటేశ్వర్లు

మొదలగు వారు ప్రముఖ వీధి నాటక కళాకారులు వీరు మహాభారతంలోని 18 పర్వాలను వీధి నాటకాలుగా ప్రదర్శిస్తారు ఇందలి కథను 'పగులు కథ'గా చెప్పించి, ఆ రాత్రి నాటక రూపంలో 18 పర్వాలను 18 రోజులు 'రెయ్యాట'☆గా ప్రదర్శించేవారు

☆ రెయ్యాట – పగలు కథ చెప్పి రాత్రి నాటకంగా ఆడ్తారు ఈ రాత్రి ఆటను వ్యావహారికంలో రెయ్యాట అంటారు

18 రోజులు ప్రదర్శించే మహాభారత నాటకాలు-

| | |
|---|---|
| ఒకటో రాత్రి | పాండు రాజు వేట |
| రెండో రాత్రి | వారణావతం |
| మూడో రాత్రి | బకాసుర వధ |
| నాలుగో రాత్రి | ద్రౌపదీ కళ్యాణం |
| ఐదోరాత్రి | అర్జునుని తీర్థయాత్ర |
| ఆరో రాత్రి | ద్రౌపదీ వస్త్రాపహరణం |
| ఏడో రాత్రి | అర్జునుని తపస్సు |
| ఎనిమిదో రాత్రి | శ్రీకృష్ణార్జున యుద్ధం |
| తొమ్మిదో రాత్రి | విషకౌలను |
| పదో రాత్రి | విరాటపర్వం |
| పదకొండో రాత్రి | ఉత్తర గోగ్రహణం |
| పన్నెండో రాత్రి | శ్రీకృష్ణ రాయబారం |
| పదమూడో రాత్రి | ఇలావంతుని కథ |
| పద్నాలుగో రాత్రి | భీష్మపర్వం |
| పదైదో రాత్రి | ద్రోణపర్వం |
| పదారోరాత్రి | కర్ణపర్వం |
| పదేడో రాత్రి | శల్యపర్వం |
| పద్దెనిమిదోరాత్రి | గదాపర్వం |

ఆ రోజుల్లో ఒక రాత్రికి నూరు నుండి నూట ఇరవై రూపాయల వరకు పారితోషికం తీసుకునే వారు దీనితోపాటు 'తట్టకాసులు' 'చదివింపులు' ప్రేక్షకుల నుండి విరివిగా వచ్చేవి ప్రేక్షకుల కోరికపై శ్రీకృష్ణార్జున యుద్ధం తర్వాత 'శశిరేఖా పరిణయం' అనే నాటకాన్ని ఉచితంగా ప్రదర్శిస్తారు అంతేగాక 18 రోజుల భారతకథ పూర్తయిన తర్వాత 'కొసరు నాటకం'గా కనకతార, జయంతి జయపాల, సారంగధర మొదలగు సాంఘిక చారిత్రిక నాటకాల్లో ఏదో ఒక నాటకాన్ని 'ఇనాం ఆట'గా ప్రదర్శిస్తారు



సారంగధరున్ని భటులు తీసుకెళ్ళే దృశ్యం

## 5-9 ప్రదర్శనా స్థలాలు

వీధి నాటకాలను గ్రామం బయట మైదానంలోగాని, నాలుగు వీధుల కూడలిలోగాని, భజన మందిరాల ముందుగాని ప్రదర్శించడం ఆనవాయితీ నాటకం చూడడానికొచ్చిన ప్రేక్షకులు సౌకర్యంగా కూర్చొనడానికి అనువైన స్థలాన్ని ఎంపిక చేసుకొంటారు అయితే మహాభారత వీధి నాటకాలను ప్రదర్శించడానికి ఊరి బయట ఎంచుకొన్న మైదానాన్ని 'భారతం మిట్ట' అంటారు చిత్తూరు జిల్లాలో ఈ నాటకాలను ప్రదర్శించడానికి ప్రత్యేకంగా ధర్మరాజుల గుళ్ళను, ద్రౌపదమ్మ గుళ్ళను ఊరికి దూరంగా నిర్మించడం ఒక విశేషం

ధర్మానికి ప్రతీకగా ధర్మరాజు, పాతివ్రత్యానికి ద్రౌపది పాత్రలు జానపదుల హృదయాల్లో నిలిచిపోయాయి అంతేగాక వీరు ఆంధ్రుల ఆరాధ్య దైవాలుగా నిలిచిపోయారు సాధారణంగా చైత్ర, వైశాఖ మాసాల్లో ఈ నాటకాలు ప్రదర్శిస్తారు వీటిని భారతోత్సవాలుగా, ధర్మరాజు తిరునాళ్ళుగా, ద్రౌపదమ్మ తిరునాళ్ళుగా ఎంతో వేడుకతో జరుపుకొంటారు

ఒక గ్రామం వారు కాని, కొన్ని గ్రామాల వారు కలిసి కాని విరాళాలు సేకరించి ఊరి బయట మైదానంలో ధర్మరాజు గుడిని నిర్మించుకొంటారు ఆ గుడిలో పంచపాండవులు, ద్రౌపది విగ్రహాలను ఉంచుతారు



ధర్మరాజుల గుడి (మిట్టపల్లె)

గుడిముందర దారు విగ్రహాలను తయారుచేసి రంగులువేసి ఉంచుతారు గుడి ముందు ఒక వైపు ఎత్తైన గుడిసెను వేస్తారు ఇందులో కళాకారులు అలంకరణ, వస్త్రధారణ చేయడానికి అనువుగా ఏర్పాట్లు చేసుకొని దాని ముందే నాటకాన్ని ప్రదర్శిస్తారు ఈ ఏర్పాట్లు ఉన్న దానికే 'భారతం మిట్ట' అని పేరు ఈ భారతాన్ని ప్రదర్శించే రోజుల్లో కొన్ని అతి ముఖ్యమైన ఘట్టాలను ప్రజలు కూడా ఆనందోత్సాహంతో నిర్వహించుకొంటారు అటువంటి ఘట్టాలు –

1 బకాసురుని బండి కుంభం
2 ద్రౌపదీ కళ్యాణం
3 అర్జునుని తవుసు (తపస్సు)
4 ఉత్తర గో(గ్రహణం
5 దుర్యోధనుని వధ
6 అగ్నిగుండం ప్రవేశం

మొదలగునవి



ధర్మరాజు విగ్రహం (మూలవిరాట్)



భీమార్జున నకుల సహదేవులతో ద్రౌపదమ్మ విగ్రహాలు

వీటిని నిర్వహించేముందు భారతం ఆడే చోట కొడి ఎక్కించడం ప్రప్రథమ కార్యక్రమం ఈ కార్యక్రమం తర్వాతనే భారతకథ ప్రారంభం అవుతుంది ధర్మరాజుల గుడికి నాలుగు మూలల రక్షాబంధం* చేస్తారు తర్వాత కొడి ఎక్కిస్తారు 20 నుండి 25 అడుగుల పొడవు

* రక్షాబంధం – ఎలాంటి ఆటంకము లేకుండా భారతోత్సవాలు జరగటానికి ఇటుకలను నిలువుగా పెట్టి పసుపు కుంకుమలతో పూజలు నిర్వహించడం

ఉండే వెదురు కొయ్యకు పసుపు నీళ్ళలో అద్దిన గాడాగుడ్డను చుట్టి, చివరన జెండాలాగా రెపరెపలాడేంత గుడ్డను వదిలి, అందులో ఆంజనేయ స్వామి బొమ్మను పసుపుతోనే వేసి, గంటలు కట్టి నిటారుగా నాటడాన్ని కొడి ఎక్కించడం అంటారు ఈ కొడిని ఎక్కించే వారు 22 రోజులు నిష్ఠతో ధర్మరాజుల గుడిలోనే ఉండాలి కొడి ఎక్కించే రోజుకు ముందు రాత్రి ఒక బ్రాహ్మణుడు శాస్త్రయుక్తంగా ఈ తంతు చేస్తాడు 101 మట్టి దుత్తలకు గెరిగె కట్టి కలశంలా చేస్తాడు హోమాన్ని నిర్వహిస్తాడు ఎక్కించిన కొడిని ధర్మరాజుల పట్టాభిషేకం జరిగేంత వరకు అలాగే ఉంచుతారు తర్వాత దించుతారు ఈ కొడికి కట్టిన పసుపు గుడ్డను (చీర) ఎవరైతే కట్టుకుంటారో వాళ్ళకు సంతానం కలుగుతుందని విశ్వాసం కాబట్టి ఈ చీరకోసం చాలామంది పోటీపడతారు చీరను పొందిన వారు మరుసటి సంవత్సరం ఈ కొడి ఎక్కించే దానికి అయ్యే ఖర్చులను తప్పనిసరిగా భరించాలి ఇలా కొడి ఎక్కించే మొదటి ఉత్సవానికి భారతకథ జరిగే అన్ని చోటుల కన్న మిట్టపల్లి గ్రామానికి ఒక విశిష్టత ఉంది

మిట్టపల్లి గ్రామంలోని ధర్మరాజుల గుడికి సుమారు 3 ఫర్లాంగుల దూరంలో ఒక బండ ఉంది కొడి ఎక్కించే ముందురోజు రాత్రి ఆ బండపై ఇసుక పోస్తారు 101 గెరిగె కలశాల్లో ఒక కలశాన్ని ఆ ఇసుకపై పెట్టి, కొడాపు* మూసివస్తారు మరుసటి రోజు ఉదయం 3 గంటలకు బేరిపల్లి, మిట్టపల్లి గ్రామస్తులు రెండు మేకపోతులను తీసుకొని కొడాపు మూసిన కలశాన్ని తేవడానికి వెళ్తారు అప్పుడు ఆ ఇసుకలో ఒక 'పాదం' గుర్తు ఏర్పడి ఉంటుంది అది 'ద్రౌపదమ్మ పాదం' అని విశ్వసించి మేకపోతులను బలిచ్చి ఆ గెరిగెను తీసుకొని ధర్మరాజుల గుడి దగ్గరికొచ్చి హోమం నిర్వహించి కొడి ఎక్కిస్తారు ద్రౌపదమ్మ పాదం ఇసుకపై ఏర్పడ్డంవల్ల ఆ బండను 'ద్రౌపదమ్మ బండ' అని నేటికీ వ్యవహరిస్తున్నారు

## 5-9-1. బకాసురుని బండి కుంభం:

బకాసురునికి భీముడు ఆహారం తీసుకుపోయే ఘట్టం బకాసురుని బండి కుంభం ఇది చాలా రసవత్తరంగా జరుగుతుంది 'బకాసుర వధ' ఘట్టం నాటక ప్రదర్శన రోజు సుమారు 5 ఎడ్లబండ్లను ఉదయం పది గంటలకు రంగు కాగితాలతో అలంకరిస్తారు తప్పెట్లతో హంగామా చేస్తూ ఆ బండ్లు గ్రామాల్లోకి వస్తాయి భీముని పాత్రధారి వేషం ధరించి ముందు బండిలో గద తిప్పుతూ, మీసాలు మెలివేస్తూ, తొడలు, భుజాలు తడుతూ ఊరేగి వస్తాడు ఆరోజు చుట్టుపక్కల గ్రామస్తులందరూ పండగలాగా ఇండ్లు అలికి, ముగ్గులుపెట్టి, అన్నం, వడలు, దోసెలు, ఇడ్లీలు, రకరకాల కూరలుచేసి ఆ ఎడ్లబండ్ల రాకకపోసం ఎదురు చూస్తుంటారు బండ్లు రాగానే బండ్ల మక్కెర*లో ఆహార పదార్థాలను పోస్తారు ఆ పోసిన

---

☆ కొడాపు – ఊడగ పుల్లలు లేదా వెదురు దబ్బలతో గంటాకారంలా తయారు చేయబడినది దీన్ని ఎక్కువగా గొర్రె, మేక పిల్లలను మూసి పెట్టడానికి ఉపయోగిస్తారు

☆ మక్కెర – పొలాలనుండి ధాన్యాన్ని ఎడ్లబండి మీదవేసుకొని ఇంటికి తీసుకురావడానికి ఉపయోగించే వెదురు దబ్బలతో అల్లిన పరికరం దీన్ని 'జల్ల' అని కూడ అంటారు

పదార్థాలను భీమ పాత్రధారి తనకు ఇష్టం వచ్చిన దాన్ని కొంత తిని ముఖానికి పూసుకొని ఆర్భాటం చేస్తుంటాడు ఆ బండికి కట్టిన ఎడ్లను కూడ కొంతమంది పూజిస్తారు వాటి కొమ్ములకు, శరీర భాగాలకు అలంకరణ చేసి ఉంటారు ఒక్కోసారి బండ్లన్నీ ఒకే గ్రామానికి కాకుండా వేరేవేరే గ్రామాలకు వెళ్ళి రావడం ఉంది అలాంటప్పుడు ప్రతి గ్రామానికి వెళ్ళే బండిలో ఒక భీమ పాత్రధారి ఉంటాడు ఇలా ఎడ్లబండ్లు అన్ని గ్రామాలు తిరిగి వచ్చిన పిమ్మట పగలు కథ ప్రారంభమవుతుంది బకాసురునికి భీమునికి యుద్ధం జరిగి బకాసురుడు మరణించిన పిమ్మట ఆ పిండివంటలన్నింటినీ అందరికీ పంచిపెట్టి మిగిలిన దాన్ని భారత కథకు తోడ్పడే పనిపాట్లు చేసే చాకలి, మంగలి, పంబల పూజార్లకు భాగం పంచుతారు

ఇంత ఘనంగా, కోలాహలంగా, అమితానందోత్సాహాలతో బకాసురుని బండి కుంభం ఘట్టం జరుగుతుందనటానికి, బంగారు పాళ్యం మండలం మిట్టపల్లి గ్రామంలో నేటికీ 'భీముని గుండు'గా పిలువబడుతున్న గుండు నిదర్శనం ఈ భీముని గుండు మిట్టపల్లి ధర్మరాజుల గుడికి పర్లాంగు దూరంలో ఉంది బకాసురుడు ఆ గుండువద్ద నుండి ఆహారం కోసం అరుపులు, హాహాకారాలు చేసేవాడట భీముడు సరాసరి ఆ గుండు దగ్గరికి ఆహారం తీసుకెళ్ళి బకాసురునితో యుద్ధం చేసి చంపేవాడట అందువల్ల ఆ గుండుకు 'భీముని గుండు' అనే పేరు వచ్చింది ☆

## 5-9-2. ద్రౌపదీ కళ్యాణం

మహాభారత వీధి నాటకాల ప్రదర్శనల్లో ముఖ్యమైన ఘట్టం ద్రౌపదీ కళ్యాణం ద్రౌపది కళ్యాణం పగులు కథాగా చెప్పి రాత్రి వీధి నాటకంగా ప్రదర్శిస్తారు రాత్రి నాటకంలో ద్రౌపది కళ్యాణం జరిగే సమయాన గుడిలోని ద్రౌపదమ్మ విగ్రహానికి, పంచపాండవులకు కళ్యాణోత్సవం జరుపుతారు చుట్టు పక్కల గ్రామాల నుండి ప్రజలు ద్రౌపదమ్మకు చీర, రవిక, పండ్లు, తాంబూలాలతో పాటు డబ్బున్న వాళ్ళు బంగారు మంగళ సూత్రాన్ని, లేని వాళ్ళు పసుపుకొమ్ము కట్టిన దారాన్ని భక్తితో సమర్పించుకొంటారు పెళ్ళి కాని ఆడపిల్లలు ద్రౌపదమ్మకు ఒడిబాలు☆ సమర్పించి, ద్రౌపదికి కళ్యాణం అయిన తర్వాత ఆ ఒడిబాలును తిరిగి తీసుకొంటారు దీనివల్ల వాళ్ళకు త్వరగా పెళ్ళిళ్ళు అవుతాయని విశ్వాసం

## 5-9-3. అర్జునుని తవుసు (తపస్సు):

భారతంలో అర్జునుని తవుసు (తపస్సు) అనే ఘట్టం చాలా విశిష్టమైనది ఒక పెద్ద తాటి చెట్టుని గాని, అశోక చెట్టును గాని నేరుగా, చాలా పొడవుగా సుమారు 50 అడుగులు ఉండే దాన్ని ఎంపికచేసి కొట్టి తెస్తారు ఆ చెట్టుకు పూజచేసి రెండు వైపులా కింది నుంచి

☆ ముఖాముఖి - కె గోవిందమండడి - 45 సం॥ మిట్టపల్లె

☆ ఒడిబాలు - ఒడి(బాలు

పైకి ఎక్కడానికి వీలుగా ఒక అడుగు కొలతగల మేకులను బిగించి, చెట్టు పైభాగంలో ఒక గడ్డపార నాటి, దానికి చెక్కపలక బిగిస్తారు ఆ పలకపై అర్థచంద్రాకారంగా వెదురు దబ్బలను వంచి కట్టి, దానిపై పసుపు గుడ్డ కప్పుతారు అలా సిద్ధం చేసిన 'తపస్ మాను'ను నిటారుగా నాట్తారు అర్జునుడు తపస్సు చేయడానికి

**దయానిదే దయరాదే॥ శివ దయానిదే దయరాదే ॥ద॥**
**భయవిరహిత నిశ్చయముగ నేనిను జయము గోరి నీ శరణము వేడెద ॥ద॥**
**పరమ పురుష నరమర చేయక నా మొర విని గోరిన వరము లొసగరా ॥ద॥**
**శూలి నిన్ను పాశుపదమునకు బతిమాలికొనెద నిన్నేలుట కిట రారా ॥ద.**
**శంభులింగ మోదంబునగాను వరంబులివ్వు వేగంబున రారా ॥ద॥**
**శరణంటిని పలుమారు భుజంగగిరి మందిర సోదరి నాయక రారా ॥ద॥**

అని పాట పాడుకుంటూ ఆ తపోవృక్షాన్ని ఎక్కుతాడు అర్జునినితోపాటు మరో వ్యక్తి పండ్లు, పూలు ఒక జోలెలో నింపుకొని అర్జునున్ని వెంబడిస్తాడు అర్జునుడు తపస్ మాను ఎక్కుతూ మధ్యమధ్యలో జోలెలో ఉన్న పూలు, పండ్లను విసిరేస్తాడు బిడ్డలు లేనివారు వాటికోసం కొంగులు చాచి, గొడుగులు తిప్పి పట్టుకొని నిలబడతారు లభించిన వారికి సంతానం కలుగుతుందని విశ్వాసం

## 5-9-4. ఉత్తర గోగ్రహణం:

అజ్ఞాత వాసంలో ఉన్న పాండవులు విరాట రాజు కొలువులో ఉండవచ్చునన్న సందేహంతో, వారి అజ్ఞాతవాసం భంగపరచదలచి, కౌరవులు విరాటరాజు గోవులను మళ్ళించడం ఉత్తర గోగ్రహణ ఘట్టం ఇది పగలు జరుగుతుంది ఈ ఉత్సవానికి చుట్టుపక్కల ఉన్న గ్రామాల్లోని గోవులన్నింటిని భారత కథ జరిగే చోటికి తోలుకొస్తారు అక్కడ జమ్మిచెట్టు నాటి, దాని నుండి అర్జునుడు ఆయుధాలు తీసుకొచ్చే ప్రదర్శన చేస్తారు కౌరవసేన తరలించుకొని పోతున్న గోవులను అర్జునుడు మళ్ళిస్తాడు



బండికుంభం తీసుకెళ్తున్న భీముడు



తపస్మాన్ ఎక్కుతున్న అర్జునుడు

## 5–9–5. ఇలావంతుని కథ.

అర్జునుడికి నాగకన్యకి పుట్టిన వాడు ఇలావంతుడు ఇతను పుట్టుకతోనే ఎదురు రోమాలు కల్గి ఉంటాడు మహాబలశాలి వీరుడు కురుక్షేత్ర యుద్ధం ప్రారంభానికి ముందు దుర్యోధనుడు సహదేవుని దగ్గరికెళ్ళి విజయం పొందాలంటే ఏం చేయాలని శాస్త్రం అడుగుతాడు ఎదురు రోమాలు కల్గిన క్షత్రియుడ్ని అమావాస్య రోజు బలి ఇస్తే జయం కల్గుతుందని, అలా ఎదురు రోమాలతో పుట్టిన క్షత్రియ వీరుడు ఇలావంతుడని సహదేవుడు చెప్తాడు వెంటనే దుర్యోధనుడు ఇలావంతుని దగ్గరికి పోతాడు నీ రాకకు కారణం ఏమి పెదనాన్నా అని ఇలావంతుడు అడుగగా మాట ఇస్తే చెబుతానని ఇలావంతుని దగ్గర మాట తీసుకొంటాడు దుర్యోధనుడు కురుక్షేత్ర యుద్ధంలో జయం పొందాలంటే ఎదురు రోమాలతో పుట్టిన నిన్ను బలి ఇవ్వాలి అందుకే నీ దగ్గరి కొచ్చాను అని చెప్పిన దుర్యోధనునికి అలాగే చేయండి అని ఇలా..ంతుడు మాట ఇస్తాడు

ఈ విషయం తెలిసిన కృష్ణుడు పాండవుల విజయంకోసం ధర్మరాజుని ఇలావంతుని దగ్గరికి వెళ్ళి అడగమంటాడు ము౦దుగా దుర్యోధనుడికి మాట ఇచ్చి ఉన్నందున ఇలావంతుడు ధర్మరాజుకు సహాయం చేయలేని పరిస్థితిలో సతమతమవుతాడు అప్పుడు కృష్ణుడు తన మాయచేత ఒక రోజు ముందుగా అమావాస్య వచ్చేటట్లు చేస్తాడు పాండవులు ఇలావంతుని బలి ఇస్తారు కురుక్షేత్ర యుద్ధం చివరి వరకు తన కళ్ళారా చూసి, తన తండ్రులైన పాండవులు జయం పొందారని తెలిసిన తర్వాత కన్నుమూయాలి అంతవరకు తను ఊపిరితో ఉండే వరం కృష్ణుడు ప్రసాదించడం వల్ల బలికాబడిన ఇలావంతుని తల ఊపిరితోనే ఉంటుంది

ఈ ఇలావంతుని కద ఒక రాత్రి వీధినాటకంగా ప్రదర్శిస్తారు ఈ ఇలావంతుడ్ని ఎలబలి రాముదు, కడబలి రాముదు అని కూడా పిలుస్తారు తమిళ భారత వీధి నాటకాల్లో అరవన్ అంటారు భారతం ఆడే చోట ఇలావంతుని బొమ్మను మొండెం వరకు మట్టితో చేసి, ధర్మరాజుల గుడిలో కొయ్యతో తయారుచేసి ఉంచిన ఇలావంతుని తలను తెచ్చి దానిపై పెడ్తారు భారతం ముగిసిన తర్వాత ఆ తలను తీసి మళ్ళీ గుళ్ళో పెట్టేస్తారు మళ్ళీ భారతం ఆదేంతవరకు ఆ తలను ఎట్టి పరిస్థితుల్లోను గుడినుంచి బయటకు తీయరు కొన్నిచోట్ల ఈ ఇలావంతుని బొమ్మను అప్పటికప్పుడు మట్టితో కాకుండా శాశ్వతంగా ఉండేటట్లు కూడా మొండెం వరకు చేసి రంగులు పూసి ఆకర్షణీయంగా ఉంచుతారు ఈ ఇలావంతుని కథ తమిళ భారతంలో ఎక్కువ ప్రాధాన్యత సంతరించుకుంది ఈ కథలో కృష్ణుడు మామూలుగా రావాల్సిన అమావాస్యకంటే ఒక రోజు ముందుగా అమావాస్యను సృష్టించడంవల్ల అప్పటి నుండి అమావాస్య ఘడియలు ఒక రోజుతో ముగియక రెండో రోజు కూడా ఉండటానికి ఇది కారణమంటారు ☆



తలతో ఇలావంతుని విగ్రహం (పానాటూరు)

## 5-9-6- దుర్యోధనుని వధ:

ఈ భారతోత్సవాలలో ఇది చివరి ఘట్టం దుర్యోధన వధ సాధారణంగా ఆదివారం వచ్చేటట్లు ఏర్పాటు చేసుకుంటారు ఈ కార్యక్రమం సూర్యోదయం అయిన తర్వాత నిర్వహిస్తారు నేలపైన ఇసుకతో దుర్యోధనుని బొమ్మను పెద్దదిగా తీర్చి, దానిపై ఒక వరుస బంకమట్టితో నున్నగా తయారు చేస్తారు కంకుమ లేదా ఎర్రరంగు కలిపిన నీటిని ఒక కడవలో పోసి దుర్యోధనుని తొడలో పైభాగాన పూడ్చిపెడ్తారు ఉదయం సుమారు 10

☆ ముఖాముఖి - వి లోకనాదరెడ్డి - 52 సం॥ గొల్లమడుగు



తలలేని ఇలావంతుని విగ్రహం (పానాటూరు)

గంటల సమయంలో భీమ, దుర్యోధనులిద్దరూ ఆ బొమ్మ దగ్గరికొచ్చి యుద్ధ సంవాదం జరిపి యుద్ధం చేస్తారు ఎంతసేపటికి దుర్యోధనుడు చావకపోగా, దుర్యోధనుని తొడమీద గదతో కొట్టమని భీమునికి శ్రీకృష్ణుడు సైగచేసి చెప్తాడు భీముడు గదతో మట్టిలో పూడ్చిన కడవపై కొట్టగానే అది పగిలి రక్తంలాగా ప్రవహిస్తుంది ఈ సంఘటన ప్రేక్షకులనెంతో పులకరింపజేస్తుంది ఆవేశ పూరితమైన భీమ, దుర్యోధనుల గదాయుద్ధం ఎంతో రసవత్తరంగా నడుస్తుంది తన శపథం నెరవేర్చుకున్నానని భీముడు సగర్వంతో ఊగిపోతాడు దుర్యోధనుడు స్పృహ కోల్పోయి కిందపడిపోతాడు ఈ దృశ్యాన్ని చూడ్డానికి తండోప తండాలుగా ప్రజలు తరలివస్తారు దుర్యోధనుడు చనిపోయిన తర్వాత జనాలు బొమ్మపై బడి ఆ కంబమట్టిని ఎవరికి దొరికినంత వాళ్ళు తీసుకొని ఇళ్ళల్లో దాచుకొంటారు ఆ బంకమట్టికోసం తొక్కిసలాట కూడా జరుగుతుంది దీనివల్ల బ్రతికినన్నాళ్లు రారాజులాగా అష్టైశ్వర్యాలను అనుభవిస్తామని ప్రజల విశ్వాసం

## 5-9-7. అగ్నిగుండం:

ఆదివారం సాయంకాలం ధర్మరాజుల గుడిముందు అగ్నిగుండం ఏర్పాటు చేస్తారు

అందులో నిగనిగలాడే నిప్పులను పరుస్తారు గుడి నుండి ద్రౌపది ఉత్సవ విగ్రహాన్ని తెచ్చి అగ్నిగుండం దగ్గర పెడ్తారు ఆ విగ్రహానికి పసుపు చీరకట్టి 'ఒడిబాలు' కడ్తారు అగ్నిగుండం నుండి నిప్పులను తెచ్చి 'ఒడిబాలు'లో వేస్తారు అయినా ఆ చీరకాలదు ఈ ఉత్సవాన్ని చూడ్డానికొచ్చిన గ్రామస్తులు తడిబట్టలతో అగ్నిగుండం తొక్కిపోతారు ఇలా రెండుమూడు సార్లు నిప్పులు తొక్కినా పాదాలు కాలవు ఇది ద్రౌపదమ్మ మహిమ అనే విశ్వాసం ప్రజల్లో బాగా ఉంది కొందరు స్త్రీలు గ్రహ దోషమున్నా, గాలి, భూత దోషాలున్నా

ద్రౌపదమ్మ దగ్గర 'వరపడతారు'* దీనివల్ల వారి దోషాలు తొలగిపోతాయని, పెళ్ళి కాని వారికి పెళ్ళవుతుందని, సంతానంలేని వారికి సంతానం కలుగుతుందని గట్టి నమ్మకం

ధర్మరాజుల గుళ్ళ ముందర ఇంత మహోన్నతంగా జరిగే భారతోత్సవాలు ప్రతి సంవత్సరం ఒక పండుగలాగా జరుపుకుంటారు చిత్తూరు జిల్లాలో ఉన్న ఈ ధర్మరాజుల గుళ్ళకు చాలా మహాత్మ్యాలున్నాయి ఈ ధర్మరాజుల గుడిని 21 రోజులు ప్రదక్షిణ చేసిన వారి కోరికలు నెరవేరుతాయని విశ్వాసం మూగ వారికి మాటలొస్తాయి సంతానం లేని వారికి సంతానం కలుగుతుంది రోగపీడితులకు రోగవిముక్తి కలుగుతుంది ఉదాహరణకు మంగారుపాళ్యం మండలంలోని మిట్టపల్లె గ్రామంలోని ధర్మరాజుల గుడి సుమారు 150 సంవత్సరాలకు పూర్వం మిట్టపల్లె వాస్తవ్యుడు కరిపిరెడ్డి తమిళనాడు ఉత్తర ఆర్కాడు జిల్లా మాలిపట్టు గ్రామంలో భారతం ఆడడాన్ని చూశాడట అక్కడి ధర్మరాజుల గుడి మహాత్యాన్ని కనుగొని, గుర్రాల మీద అక్కడి మట్టిని తెచ్చి మిట్టపల్లెలో ధర్మరాజును ప్రతిష్ఠించి, గుడిని నిర్మించాడు అందువల్ల ఈ గుడికి మహాత్యం ఉంది ప్రతి సోమవారం పూజచేయడం ముఖ్యం ఈ గుడిని చుట్టి, సేవించిన వారికి సంతానం కలిగితే, పుట్టిన బిడ్డ బరువు తూకం వేసి, సరిపోవు చిల్లరను, పూలు పండ్లను సమర్పించుకోవడం ఇక్కడ అనాదిగా జరుగుతోంది నేటికీ చాలా వైభవంగా ఈ గుడి ముందర భారతం ఆడ్తారు ఈ గుడి వ్యవస్థాపకుడైన కరిపిరెడ్డి పేరుతో మిట్టపల్లె సమీపాన 'కరిపిరెడ్డి పల్లె' అను గ్రామం వెలసింది *



ధర్మరాజుల గుడిముందు పగలు కథ చెప్పే స్థలం (మిట్టపల్లె)

## 5-10. కంగుంది వీధి నాటకాల ప్రత్యేక శైలి:

చిత్తూరు జిల్లాలో వీధి నాటకాలు పలు గ్రామాల్లో విరివిగా ప్రదర్శింపబడుతున్నవి

☆ వరపడతారు – తడిబట్టలతో దేవుడి ముందు సాష్టాంగపడి వేడుకోవడం

☆ ముఖాముఖి – కె గోవింద మందడి – 45 సం॥ మిట్టపల్లె

సాధారణంగా వీధి నాటకాల్లోని ఇతివృత్తం ఇంచుమించు ఒకటిగా ఉన్నప్పటికినీ ప్రదర్శనా పద్ధతుల్లో, నాటక గమనంలో భాషాపరంగా మనకు కొన్ని తేడాలు కన్పిస్తున్నాయి చిత్తూరు జిల్లా వైశాల్యంలో పెద్దది దీనికి తమిళ, కర్ణాటక రాష్ట్రాలు సరిహద్దుల్లో ఉండటంవల్ల ఆయా రాష్ట్రాల భాషా ప్రభావం, సాంప్రదాయ పద్ధతులు వీధి నాటకాలపై కూడా కన్పిస్తున్నవి జిల్లాల్లో ఇతర ప్రాంతాల్లో ప్రదర్శించే వీధి నాటకాలకంటే కంగుంది వీధినాటకాల్లో ఒక ప్రత్యేకమైన శైలిని సంతరించుకొంది కంగుంది వీధి నాటకాలకు, ఇతర ప్రాంతాల వీధి నాటకాలకు భేద సాదృశ్యాలను పరిశీలించి చూస్తే ఇది స్పష్టమవుతుంది

ఇతర ప్రాంతాల్లో ఒక్కొక్క గ్రామంలోని గురువులందరూ కలసి వారి వారి దగ్గర శిక్షణ పొందిన వారితో బృందాన్ని తయారుచేస్తారు వీధినాటకం ప్రదర్శించాల్సిన గ్రామస్తుల దగ్గర ఒక ఒప్పందం కుదుర్చుకుని డబ్బులు తీసుకొని వీధినాటకం ఆడ్తారు ప్రత్యేకమైన గురువును నియమించుకొని ప్రదర్శనలిచ్చే బృందాలు తక్కువ

కంగుందిలో ఒక్కొక్క గురువు దగ్గర కనీసం 20 నుండి 25 మంది శిక్షణ పొంది ఒక బృందంగా ఏర్పడి వీధి నాటక ప్రదర్శనలకు ఒప్పందం కుదుర్చుకుంటారు

కథకు సంబంధించిన సారాంశాన్ని సూటిగా చెప్పకుండా మధ్యమధ్యలో సినిమా పాటలు జోడించి, కథకు సంబంధంలేని విషయాలను కల్పించి వీధినాటకాలు ఆడటం ఇతర ప్రాంతాల వారికి అలవాటు

కంగుంది వారు కథకే ఎక్కువ ప్రాధాన్యతనిస్తారు ప్రేక్షకుల నాడీని పరిశీలించి సందర్భానుసారంగా అవసరమైతే తప్ప సినిమా పాటలు, అసంబంధ విషయాలు ప్రస్తావనకు తీసుకురారు

ఇతర ప్రాంతాల్లో వీధినాటకం ఆడే సమయంలో అన్ని పాత్రలు అన్ని వేళలా దూకుడుతో అడుగులు వేస్తూ ఆర్భాటంగా ప్రదర్శిస్తారు

కంగుంది వారి నాటకాల్లో మాత్రం దూకుడు అడుగులు అన్ని వేళలా వేయరు శృతిలయలకు ప్రమాదం వాటిల్లుతుందేమోనని తక్కువ దూకుడుతో కంగుంది వారి నాటక ప్రదర్శన మృదువుగా సాగుతుంది పాత్ర 'రాకట'లో దైవ ప్రార్థనతో కూడిన గీతాలాపన చేయడం, 'పోకట'లో గీతాలాపనతో ముగించడం ఉంటుంది

పాత్రధారులందరు ఒక పాత్ర పాడిన పాటకు వెనుక పాట పాడడం (వంతపాట) ఇతర ప్రాంతాల్లో ప్రదర్శించే నాటకాల ఆచారంగా ఉంది

నాటక ప్రదర్శనకు ముందు 'మేళంకట్టు' నిర్వహించి నాటక ప్రదర్శన సూచనను తెలియజేస్తారు వెనుకపాట వీరు కూడా పాడ్తారు ఒక్కో సందర్భంలో ఈ వెనుకపాటను వంతగాళ్ళతో కాకుండా వాద్యాల్లో వినిపిస్తారు

ఇతర ప్రాంతాల్లో వీధినాటకాలు నేర్చుకొన్న వారు గురువు చెప్పిన మాటలనే చిలక పలుకులుగా పలుకుతారు

కంగుంది వారు ఎప్పటికప్పుడు పాత్రోచిత సంభాషణలను సందర్భానుసారంగా సమకూర్చుకొని ధారావాహికంగా చెప్తారు

ఇతర ప్రాంతాల్లో ప్రదర్శించే వీధినాటకాలు శృతిలయబద్ధం కాదనే అభిప్రాయం కొందరు వ్యక్తం చేస్తారు

కంగుంది వారు ప్రదర్శించే వీధినాటకాలు శృతిలయబద్ధం

వీధినాటకాల్లోని స్త్రీ పాత్రలను పురుషులే ధరించడం ఇతర ప్రాంతాల్లో కన్పిస్తుంది

కంగుందిలో కూడ స్త్రీ పాత్రలను పురుషులే ధరిస్తారు అయితే స్త్రీ పాత్రదారుణ్ని 'భృకుంశుడు' అని పిలుస్తారు

ఇతర ప్రాంతాల్లో వీధి నాటకాలకు రంగస్థలం ఉండదు వీధిలో చతురస్రాకారంలో నాలుగు వెదురుగుంజలు నాటి, వాటికి పచ్చి టెంకాయ పట్టలు చుట్టి, మామిడి ఆకు తోరణాలతో అలంకరిస్తారు ఆ పందిరి కింద బిసపలకను వేసి, దానిపై వాద్యబృందం, గాయక బృందం కూర్చుంటారు పందిరికి ముందు వైపు దివిటీలుగాని, పెట్రొమాక్స్ లైట్లుగాని పెడ్తారు నటకులు ఆ పందిరికింద గాక ముందువైపు ఉన్న బయలులో నాటకాన్ని ఆడ్తారు

కంగుంది వారి నాటక ప్రదర్శన శైలి మరోవిధంగా ఉంటుంది వీరుకూడా పైన తెల్పిన విధంగానే పందిరి వేస్తారు అయితే పందిరికి వెనుకవైపున తెరకడ్తారు అందుకే ఈ వీధి నాటకాలకు 'తెరనాటకల'ని కూడా పేరు వచ్చింది నటకులు ఆ పదంరి లోపలే పాడి ఆడ్తారు పందిరి వదలి బయటకు రారు

కంగుంది వారి వీధి నాటక ప్రదర్శనల్లో మరో విశేషం కన్పట్టుచున్నది కాలానుగుణంగా ప్రేక్షకుల మనస్తత్వాన్ని గ్రహించి వీధినాటకాలను ఆధునీకరించారు జనరంజకంగా నాటక ప్రయోగానికి ఇది ఎంతో ఉపయోగపడుతుంది

## 5-11. ఇతర బాషా ప్రబావం:

తెలుగులో 'వీధి నాటకాల'ని, తమిళంలో 'తెరుక్కూత్తు' అని, కన్నడంలో 'బయలాట' అని వీధి నాటకాలు ప్రసిద్ధి చెందాయి వీధుల్లో ఆడుతూ పాడుతూ ప్రదర్శిస్తారు కనుక తెలుగులో వీధి నాటకాలన్నారు తమిళంలో 'తెరు' అంటే వీధి, 'కూత్తు' అంటే చిందు (అడుగు) అని అర్థం అంటే వీధిలో వేసే చిందు అర్థంతో తెరుక్కూత్తు అని పిలువబడుతోంది అదే విధంగా కన్నడంలో బయలు ప్రదేశంలో ఆడే ఆట బయలాటగా వ్యవహరింపబడుతున్నది

పొరుగు రాష్ట్రమైన తమిళనాడు ప్రభావం ఈ వీది నాటకాలపైన కనబడుతూంది తెలుగు వీధినాటకంలో విదూషక పాత్రధారున్ని 'కట్టియ కారన్' అని తమిళంలో వ్యవహరిస్తారు అదే పదాన్ని తెలుగు వీధి నాటకాల్లో కూడా 'కటికారన్' అనంటారు అలాగే విల్లర్లు,* వేడర్ వేషం* తమిళ ప్రభావ పదాలు కూడా చోటుచేసుకున్నాయి

అట్లే కన్నడ భాషా ప్రభావంవల్ల వీధి నాటకంలో అక్కడక్కడ కన్నడ పదాలు చోటు చేసుకున్నాయి,

ఉదాహరణకు 'పాండురాజు వేట' నాటకంలో మాద్రి ప్రసవ వేదన పడుతూ సుఖప్రసవంకోరి చెలికత్తెలను శుశ్రూష చేయమను సందర్భంలో –

'బిసరు హోషిరో వేగ ప్రసవించునట్లుగా
ఘణత యంత్రము వ్రాసి కట్టరమ్మ "[1]

అను సీస పద్యంలో బిసరు హోసిరో అన్న కన్నడ పదాలను నాటకకర్త ప్రయోగించడం గమనార్హం అలాగే 'కీచకవధ' నాటకంలో వలలుడు, జెట్టివాడు సంవాదంలో 'మండిగె', 'సండిగె' 'హోళిగెలు' 'దొడ్డ కాగవలె' అనే కన్నడ తినుబండార పదాలు కూడా చోటు చేసుకొన్నాయి

తమిళనాడులో 'తెరుక్కూత్తు'లకు విశేషంగా ప్రజాదరణ ఉండేది ఈ విషయాన్ని గ్రహించి తమిళనాడుకు చెందిన 'చిత్తేరి' గ్రామవాసి మునస్వామి ఈ నాటకాలను ఆంధ్ర రాష్ట్రంలో ప్రదర్శించి ప్రచారంలోకి తేవాలని కంగుందికి వచ్చి స్థిరపడినాడు చిత్తేరి నుండి వచ్చినాడు గనుక 'చిత్తేరి మునస్వామి'గా పిలువబడ్డాడు తమిళభాషా ప్రభావం వల్లనే చిత్తూరు జిల్లాకు దక్షిణ, పశ్చిమ దిక్కులలో తమిళంలో వీధి నాటకాలను నేర్చి ప్రదర్శించడం జరిగింది పిచ్చాటూరు మండలం 'కారూరు' గ్రామంలో శివలింగారెడ్డి అనుగురువు 25 మంది శిష్యబృందంతో తమిళ నాటకాలను ప్రదర్శిస్తున్నాడు అట్లే బంగారుపాళ్యం మండలం 'తిమ్మోజిపల్లి' గ్రామంలో కైలాసం అను గురువు సుమారు 300 మంది శిష్యులను తయారు చేసి తమిళ భాషలో మహాభారతాన్ని పది రోజుల నుండి 22 రోజుల వరకు ప్రదర్శిస్తున్నాడు కామనాటకం నాటకాన్ని బంగారుపాళ్యం మండలం 'నలసిద్దనపల్లె' గ్రామంలో జి వెంకటేశన్ బృందం తమిళ భాషలో ఆడ్తారు

అనేక తమిళ బృందాలు చిత్తూరు జిల్లాలో భారత కథలను వీధినాటకాలుగా ప్రదర్శించడం కూడా తమిళభాషా ప్రభావం అని చెప్పవచ్చు తెలుగు మహాభారత కథకు సంబంధం లేని కొన్ని కదలను మలచుకొని తమిళభాషా వీధినాటకాలను ప్రదర్శిస్తున్నారు అందులో ముఖ్యగా 'కురవంజి' 'కర్ణమోక్షం' అనే వీధినాటకాలు ఎక్కువ ప్రజాదరణ పొందాయి

---

☆ విల్లర్లు – బలవంతులు (వేడర్ వేషం – ఐర్ల వేషం)

1. పాండురాజువేట' నాటకం – నాటకకర్త క్రిష్ణమూర్తి

## 5-12. బాషా విశేషాలు:

వీధి నాటకంలో వ్యావహారిక భాషా ప్రభావం బాగా కన్పిస్తుంది కవిత్రయ భారతాన్ని ఆదర్శంగా తీసుకుని ఆ భాషలోనే సంవాదాత్మక రచన చేశాడు నాటకకర్త కాని అక్కడక్కడ వ్యావహారిక పదాలు, విసంధి రూపాలు, సూత్రాలకు లొంగని రూపాలు, అన్యదేశ్యాలు, వింతప్రయోగాలు కన్పిస్తున్నాయి పదేపదే నాటకాన్ని ఎత్తి వ్రాసుకొనడం వల్ల రానురాను కొన్ని తప్పులు దొర్లి ఉండవచ్చు కాని చాలా పదాలలో వ్యావహారిక ప్రభావం ప్రస్ఫుటంగా కన్పిస్తుంది మహాప్రాణాల స్థానంలో అల్పప్రాణాలు, శ ష స లను తారుమారుగా ప్రయోగించడం, యకార వకారాలను పద ప్రారంభంలో వాడడం, హకార లోపం మొదలగునవి వ్యావహారిక భాషా ప్రభావం కాబట్టి ప్రస్తుతం లభిస్తున్న ఈ కీచకవధ (విరాటపర్వం) నాటకం ఆధారంగా భాషా విశేషాలను పరిశీలిద్దాం

ఇందులో కందార్థాలు, గీతాలు మొదలగునవి ఛందోభంగంగా కొన్ని ఉన్నాయి మరికొన్ని ఛందస్సుకు సరిపడి ఉన్నాయి పాట పాడడానికి అనువుగా హ్రస్వాన్ని దీర్ఘం చేసుకోవడం సర్వసాధారణం ఉదాహరణకు

ఇమ్మహి - ఇమ్మాహి
కొలిచెదరో - కొలిచేదరో
కైవడి - కైవాడి

అందువల్ల పద్యాల్లోను, పాటల్లోను దీర్ఘాన్ని ఎక్కువగా వాడినారు రాగాన్ని నిలపడానికి, పెంచడానికి 'పుల్‌స్టాప్'తో సూచించారు ఇవన్నీ గురువు ముఖతః నటకులకు నేర్పేటప్పుడు చెప్పి సరిచేస్తాడు కాని భాషా విషయంలో వైవిధ్యం కన్పిస్తుంది

ఇ ఈ ఎ ఏలకు బదులు యి యీ యె యేలు, ఉ ఊ ఒ ఓలకు బదులు వు వూ వొ వోలు ప్రయోగించబడి ఉన్నాయి

ఇ - యిచట, యిందు
ఈ - యీ అర్జునుడు, యీ కష్టంబు
ఎ - యంత కష్టం, యెంత, యెపుడు
ఏ - యేజాతి
ఉ - వుడికి, వురగదరాదరం
ఊ - వూడదీయు
ఒ - వొదలంతయు, వొంటరిగా
ఓ - వోడినపుడు

ఉకారం వాడే సందర్భాలలో యడాగమం వాడడం

ఉల్లసము - యుల్లాసము

వంటి ప్రయోగాలున్నాయి

అకారానికి పద ప్రారంభంలో యకారం ఉపయోగించడం పలుచోట్ల కానవస్తుంది

అస్త్రం - యస్త్రం
ఆవల - యావల
ఋ - ఋలకు అభేదాన్ని పాటించడం సర్వసాధారణం
పితృసమానులు - పిత్రు సమానులు
శత్రువులు - శతృవులు
త్రుంచిన - తృంచిన

లాంటి ప్రయోగాలు ఉన్నాయి

ప్రారంభ సంయుక్తాక్షరంలో 'ర'కారం లోపించిన పదాలు -

ప్రాలు మాలిక - పాలుమాలిక మొదలైనవి

క- గల మధ్యగల ఉచ్చారణ భేదం పాటించక ప్రయోగింపబడిన పదాలు -

ప్రకటితం - ప్రగటితం
అట్లే త - దల భేదం పాటించని ప్రయోగాలు
ద్రౌపది - ద్రౌపది

లాంటి పదాలు ఇందు ప్రయోగింపబడ్డాయి

మహాప్రాణాలను - అల్పప్రాణాలుగా ఉచ్చరించడం సాధారణం ఆ విధంగానే నాటకకర్త వ్రాతలోనూ చూపించాడు

ఆఖండలుడు - ఆకండలుడు
ఘనత - గనత
పార్థివేంద్ర - పార్తివేంద్ర
సాధుగుణాఢ్య - సాదుగుణాడ్య
భార్య - బార్య
కలకంఠలు - కలకంటులు
పీఠంబు - పీటంబు

లాంటివి కోకొల్లలుగా ఉదాహరణలున్నాయి

ణ - నలకు అభేదం పాటించి వాడిన పదాలు

పుణ్య - పున్య
అణగి - అనగి
అణచి - అనసి

రాణింపు - రానింపు
ఘనత - గణత
పని - పణి

'ళ' కారానికి బదులు 'ల' కారం ప్రయోగించిన పదాలు అనేకం నాటకంలో ఉన్నాయి

రాళ్ళు - రాల్లు
కాళ్ళగోళ్ళు - కాల్లగోల్లు
వేళ - వేల
జనాళి - జనాలి
పచ్చళ్ళు - పచ్చల్లు
దళాక్షు - దలాక్షు
పెళ్ళాయెనా - పెల్లాయెనా మొదలైనవి

'స' వర్ణానికి బదులు 'శ' వర్ణం ప్రయోగించిన పదాలు

సూటిగా - శూటిగా
పడసి - పదశి

అట్లే 'శ' వర్ణానికి బదులు 'స' వర్ణం ప్రయోగించిన పదాలు -

మత్స్యాదీశు - మత్స్యాదీసు
మనుజేశ - మనుజేస మొదలైనవి

'ష'కు బదులు 'స' ప్రయోగించిన పదాలు -

అన్వేషింపుచు - అన్వేసింపుచు

'చ'కు బదులు 'స'కారం ప్రయోగించిన పదాలు-

చక్కదనం - సక్కదనం
తలచుచు - తలచుసు మొదలైనవి

'హ' కారం లోపింపజేసి ప్రయోగించిన పదాలు-

హెచ్చరిక - ఎచ్చరిక
హజారము - అజారము
హాజరై - ఆజరై
హిడింబ - ఇడింబ

కాని ఆనతి అనే పదానికి 'హ' కారం చేర్చి 'హానతి' అని ప్రయోగించాడు అట్లే హృదయం లోని 'హ'కారం లోపింపజేసి 'ృదయం' అని వాడడం వ్యావహారిక భాషా ప్రభావం వల్లనే అంతేగాక 'విందు' అనే పదంలో 'వ'కారాన్ని లోపింపజేసి 'యిందు' అని ప్రయోగించాడు

అచ్చు సంధులు వైకల్పిక పద్ధతిలో ఎక్కువగా ఉదాహరణలు కన్పిస్తున్నాయి

మీకు + ఐవురికి - మీకైవురికి

కంకుభట్లు+అను - కంకుభట్లను

ఉత్వసంధిలో యడాగమం ప్రయోగించిన రూపాలు కలవు

ప్రజలు + ఉన్నవారు – ప్రజలుయున్నవారు

అత్వ సంధిలో దీర్ఘం మీద యడాగమం చేయకుండా సంధిచేసిన రూపం కన్పిస్తుంది

చెల్లునా+అని - చెల్లునాని

ఇత్వ సంధిలో–

గోల+ ఇడబోకు – గోలిడబోకు అని ప్రయోగించారు అట్లే తాటాకులాంటి వింతధ్వని కల్గిన పదం–

భంగి+ఆకు - భంగాకు

'హ'కారం లోపింపగా వచ్చిన ఇత్వానికి సంధి చేసిన పదాలూ కలవు

కిమ్మీర + ఇడింబ (హిడింబ) – కిమ్మీరిడింబ

యడాగమానికి బదులు నుగాగమం చేసిన పదాలు–

ఏదియో + అడుగవమ్మా – ఏదియో నడుగవమ్మా

చేరి + అందు – చేరినందు మొదలైనవి

అంతేగాక,

హతాహతంబు

నష్టసత్తుల (నష్టశక్తుల)

కంఢ్రించి (ఖండించి)

నూటతలలు (నూరుతలలు - ఔపవిభక్తి ప్రయోగం) మొదలైన వింత ప్రయోగాలు ఇందు కలవు

అలాగే అన్యదేశ్యాల

బ్రాందీ

బ్రదర్

డ్రింకు మొదలైన ప్రయోగాలు కూడా చోటు చేసుకున్నాయి

## 5-12-1- రసోచిత భాష

భాషకు రసావిష్కరణ శక్తి ఉంటుంది

పాత్రోచిత భాష మాత్రమేగాక అది రసోచితం అయినప్పుడు ప్రేక్షకుల హృదయాల్లో ముద్రవేసుకుంటుంది కరుణరస ప్రాధాన్య ఘట్టంలోని దీర్ఘసమాసాలు ప్రయోగించినా, భయానక బీభత్సరస ప్రాధాన్య ఘట్టాల్లో అలతి అలతి పదాలు ప్రయోగించినా రసభంగమై నాటకం పేలవమవుతుంది కాబట్టి కవి రసానికి తగిన భాష ప్రయోగిస్తాడు

కీచకవధ (విరాట పర్వం) నాటకంలో కవి రసోచిత భాషను ప్రయోగించాడు

ద్రౌపది విరాటనగరం చేరు సందర్భంలో కాలినడకతో అలసిపోయి ఇకనడువలేనంటూ దుఃఖపూరితమైన కంఠంతో పాడే పాట కరుణ రసాత్మకం అట్టి సమయంలో కవి వాడిన భాష ఇది–

"నడువగా లేనూ ఈ మార్గమున ॥నడు॥
నడువలేనడుగూలు తడబడసాగేను
వొడలెల్లా చెమటాలు బొడమే యీ మార్గమున
రాల్లుతాకీ కాల్లగోల్లలో రక్తంబు వెల్లసాగెను
త్రావ నీళ్ళులేని త్రోవ ॥నడు॥"[1]

రౌద్రాకారుడైన భీముడు తన కోపాన్ని ప్రకటిస్తూ చెప్పిన సమాస జరిల రచన అలంకారిక శైలిలో సాగి ప్రేక్షకుల మన్నన పొందడానికి ఉద్దేశించింది

"దండి దండోపమాన గదాదండంబు
మద్భుజ దండంబునన్. నమర్చి మార్చి
పేర్చి నేను భండనంబునకు వెడలిన
ఈరేడు భువనంబులు వడవడ వడంకవా
భూమండలంబులు దిద్దరి తిరగవా.
దిగ్గజంబులు మ్రగ్గవా కులపర్వతంబులు
త్రగ్గవా కౌరవులు నన్నెదిరించి నిలతురా
నన్ను గెలతురా ఇదిగో దుష్టకష్టనికృ
ష్టాత్ముండగు దుర్యోధనాది దుష్టచతుష్ట
యంబును నష్టసత్తుల గావించి ఈ నవ
కండ భూమండలంబునకు నిన్ను. దిట్టం
బుగా పట్టంబుగట్టి ఈ దుష్ట చతుష్టం
బెల్లను నికృష్టంబు గావించెదన నాకు
సెలవిమ్ము అగ్రజా "[2]

---

1 చూడు అధ్యాయం నాలుగు – పుట 181

2 చూడు అధ్యాయం నాలుగు – పుట 185

భయానక రూపాన్ని కల్గిన రాక్షసుని నోటినుండి వెలువడే మాటలను నాటకకర్త పాట రూపంలో రాసిన తీరు–

> "రక్కాసుడదుదెంచె దయమూనా కీచకు
> బెదిరించి సైరంధ్రి విడపింపతాగోరీ ॥కీచ॥
> గొప్ప నిప్పులు కన్ను రెప్పాలు తప్పాక
> గుప్పుగుప్పున రాల బెబ్బిరింపుచు వేగ ॥ర॥"[1]

ఎట్టి రచన ఐనా అలంకార రహితంగా ఉండదు అందులోనూ నాటకంలోని భాష అలంకారాలతో ఉంటే ఎదుటి ప్రేక్షకులను ఎంతగానో ఆకట్టుకొంటాయి అందుచే ఉపమ, ఉత్ప్రేక్షాది అలంకారాలే గాక వృత్యానుప్రాస, ముక్తపదగ్రస్తాలంకారాలు ఉపయోగించ బడ్డాయి

ఇంతవరకు చిత్తూరు జిల్లాలో ప్రదర్శించే వీధి నాటకాలతో పాటు భారత ఇతివృత్తం కల వీధి నాటకాల స్వరూప స్వభావాలను పరిశీలించడం జరిగింది తమిళభాషా ప్రభావం వల్ల జిల్లాలో తమిళ వీధినాటకాలను కూడా ప్రదర్శిస్తారు కాబట్టి వాటిని గురించి కొంత వరకు ప్రస్తావించడమైంది, కేవలం తమిళ భాషా వీధినాటకాలను మాత్రమే ప్రదర్శించే బృందాలు చిత్తూరు జిల్లాలో ఉన్నాయి వాటిలో సంతపేట బాబు బృందం, ఆదిగాని వూరు రాజేంద్ర మందడి బృందం, మిట్టపల్లి వడివేలు బృందం, పాప సముద్రం సుబ్రమణ్యం గౌండర్ బృందం, ఎడ్లోళ్ళూరు చెంగల్రాయలు బృందం, సర్వేరెడ్డిపల్లె కృష్ణారెడ్డి బృందం, తుమ్మిందపాళ్యం సుబ్రమణ్యం మడవలి బృందం మొదలైనవి ప్రసిద్ధి చెందినవి

తెలుగుభారత వీధినాటకాల్లో లేని 'కురవంజి' అనే వీధి నాటకాన్ని ప్రదర్శించడం వీరి ప్రత్యేకత ఈ 'కురవంజి' నాటకాన్ని చూడటానికి అధిక సంఖ్యలో ప్రేక్షకులు రావడం విశేషం. కరుణ హాస్య రసాల సమ్మిళతమై సాగే ఈ నాటకం కథ క్లుప్తంగా ఇది

పాండవులు ఎక్కడుంటే అక్కడ పచ్చగా సస్యశ్యామలంగా ఉంటుందని భీష్ముడు దుర్యోధనునికి శాస్త్రం చెప్తాడు పాండవులున్న చోట సుభిక్షంగా ఉంటుందని దాని పరమార్థం అందుకు దుర్యోధనుడు ఎవరూ ధాన్యం దానం చేయకూడదని, ఉడికిన అన్నమే దానం చేయాలని శాసిస్తాడు అప్పుడు ద్రౌపది ఎరుకలసాని వేషం వేసుకొని దుర్యోధనుని భార్యకు సోదె చెప్తుంది యుద్ధ పరిణామం గురించి దుర్యోధనునికి వెళ్ళి చెప్పమని, అట్లే గాంధారికి కూడా చెప్తుంది ఎరుకలసాని వేషంలో ఉన్న ద్రౌపదికి వాళ్ళు ధాన్యంవేసి పంపుతారు ఈ విషయం తెలుసుకున్న దుర్యోధనుడు ద్రౌపదిని కట్టేసి ఆరాతీస్తూ ఉండగా అంతలో అర్జునుడు ఎరుకలవాని వేషంలో వచ్చి దుర్యోధనునితో యుద్ధంచేసి ద్రౌపదిని విడిపించుకొని పోతాడు

1. చూడు అధ్యాయం నాలుగు – పుట 283

ఈ కథలో ద్రౌపది ప్రవేశం కరుణరస పూరితం ఉదాహరణకు –

"పాంచాలా కురవంజీ వందేన్
ఎన్ భర్తాయాగా బాలానా నేందేన్
అంద మూదరోడా.. వాసలుక్కు
మాదూ పోగా కాలా మాచ్చే "☆

అని శోక గీతాన్ని ఆలపిస్తూ ప్రవేశించడం

'నా భర్త అయిన సహదేవుణ్ణి చిన్నబిడ్డగా చేసి ఒడిలో పెట్టుకొని ఆ మూర్ఖుని గడపతొక్కి నేను పోవలసిన కాలం వచ్చిందే' అని దీని అర్థం ఈ ఘట్టం ప్రదర్శించేటప్పుడు ద్రౌపది తన కొచ్చిన కష్టాన్ని బాధతో చెప్పడం చూస్తున్న ప్రేక్షకులకు తమకు తెలియకుండానే కన్నీరు రావడం గమనార్హం

తెలుగు భారత కథల్లో కర్ణపర్వం ఒక ఘట్టంగా ప్రదర్శిస్తే దాన్ని 'కర్ణమోక్షం' పేరుతో ఒక రాత్రి పూర్తిగా ఆడే వీధినాటకంగా తమిళంలో ప్రదర్శిస్తారు విధి వంచితుడైన కర్ణుని దయనీయ స్థితి ఈ కథలో విపులంగా వివరించబడింది

సూతపుత్రుడని తన భార్యతో సహా అందరూ కర్ణుని చులకన చేస్తే కర్ణుడి బాధ వర్ణనా తీతం అలాంటి సమయంలో కుంతి కర్ణుణ్ణి ఏకాంతంగా కలసి అతని జన్మవృత్తాంతాన్ని తెలియజేస్తుంది తను సూతపుత్రుడు కాదన్న సంతోషంతో ఆ విషయాన్ని తన భార్యకు తెలియజెప్పే ఘట్టం చాలా రసవత్తరంగా నడుస్తుంది

ఉదాహరణకు –

"పెణ్ణే ఉన్నై అలైత్తేన్ ఎన్నా మధురం సొల్వేన్ పెణ్ణరసే॥
తేర్పగమన్నానెండ్రు ఎన్నైనీ చిన్నమాగవే పేసి పెణ్ణరసే॥
సిన్నికులత్తానెండ్రు ఎన్నై విగశ్చయమాగే పేసి పెణ్ణే॥
అరుణన్ ఉదయమున్నే నాన్ అమరుక్కు పోగవేన్ పెణ్ణే॥
నీకైప్పద తాంబూలం తందాల్ పోదుం నాన్‌యుద్ధ కళత్తుక్కు సెండ్రువరువేన్"☆

అంటే, భామా నిన్ను పలిచాను ఈ తీపి వార్త ఎలా చెప్పాలి సూతపుత్రుడని నన్ను చులకనగా మాట్లాడావు రాకుమారీ! సూర్యోదయానికి ముందు నేను పోరుకు పోతాను నీ చేతులనిండా తాంబూలం ఇస్తే చాలు నేను యుద్ధానికి వెళ్ళి వస్తాను అని అర్థం

ఈ మాటలు అర్థంకాని కర్ణుని భార్య ఈ క్రింది మాటల్లో అడిగిన రీతి చాలా అద్భుతం

"పసుం పొలుకరందు, కాచ్చి, అదులే

☆ ముఖాముఖి – గోవిందమండడి – 45 సం॥ మిట్టపల్లె
☆ ముఖాముఖి – గోవిందమండడి – 45 సం॥ మిట్టపల్లె

మొరహొట్టి, తైరుక్కుల్ మత్తువిట్టు,
చిలిపి, మోరాక్కి అదులే వెణ్ణె ఎడుత్తు,
కాచ్చిముగత్తె పార్తాల్ ముగం తెరియుం"☆

ఆవు పాలు పితికి, కాచి, దానికి మజ్జిగ తోడుపెట్టి, పేరుకొన్న పెరుగులో కవ్వమేసి, చిలికి, మజ్జిగచేసి, అందులో వెన్నతీసి, కాచి నెయ్యిచేసి, అందులో చూస్తే ముఖం తెలుస్తుంది అని దీని భావం చెప్పదలచిన విషయాన్ని వివరంగా చెప్తే అర్థమవుతుందన్న భావాన్ని తార్కికంగా గ్రామీణ ప్రజల దైనందిన కార్యకలాపాన్ని తార్కాణంగా తీసుకొని చెప్పడం వీధినాటక కర్తల వైదుష్యానికి నిదర్శనం

ఈ విధంగా వీధినాటకాలను ఏ భాషలో ఎవరు ఏ విధంగా ప్రదర్శించినా ప్రేక్షక లోకానికి ఎంతో రసానుభూతి కల్గుతుంది నాటి నుండి నేటికీ మన సంస్కృతీ సాంప్రదాయాలకు దర్పణం పడుతూ, సామాజిక రుగ్మతలను ఎప్పటికప్పుడు తెలియజేస్తూ, నైతిక విలువలను వదలి పెట్టక ఎంతో వైశిష్ట్యాన్ని సంతరించుకొన్నవి ఈ వీధినాటకాలు

## 5-13. ముగింపు:

చిత్తూరు జిల్లా వీధి నాటకాల పుట్టుపూర్వోత్తరాలను క్రమ పరిణామ వికాసాన్ని పరిశోధించి 5 అధ్యాయాల్లో వివిధ అంశాలను వివరించడం జరిగింది నా క్షేత్ర పర్యటనల ద్వారా, నాటక కళకు సంబంధించిన ప్రముఖ వ్యక్తుల ముఖాముఖి చర్చల ద్వారా, నాకు లభ్యమైన గ్రంధాల ఆధారంగా, విషయ సేకరణల ద్వారా వీధినాటకాలను విపులీకరించడం జరిగింది ఈ నాటక ప్రపంచంలో ఎందరో కళాకారులుద్భవించి కాలగమనంలో మరుగైనారు పోటీపడి పరుగులు తీస్తున్న నేటి సినిమా, టీ వీ యుగంలో సంస్కృతీ, సాంప్రదాయాలకు ప్రతీకలైన వీధినాటకాలకు ఆదరణ కరువై అజ్ఞాతమవుతున్నాయి కాబట్టే ఇదివరలో ఎందరో విమర్శకులు, పరిశోధకులు వీధినాటకాల గూర్చి కృషిచేసి, ఎన్నో అద్భుత విషయాలను సిద్ధాంతీకరించియున్నారు అట్లే ప్రత్యేకంగా చిత్తూరు జిల్లా వీధి నాటకాల పరిణామ పరిస్థితులను, నాటక కళామతల్లి ముద్దుబిడ్డల జీవిత విశేషాలను, ప్రదర్శనాపరంగా ఎదుర్కొంటున్న సాధక బాధకాలను గ్రంథస్తం చేసి, పదిల పరచి భావితరాల వారికి చిత్తూరు జిల్లా వీధినాటకాల గూర్చి పరిచయం చేయడం జరిగింది ఇంకను వీటిని గూర్చి తెలియని అనేక విషయాలను భావి పరిశోధకులు శోధించి పాఠక లోకానికి తెలియచేయవలసిన అవసరం ఎంతైనా ఉంది

చిత్తూరు జిల్లా వీధినాటకాల పరిశీలనలో జిల్లాలో ఇతర ప్రాంతాల్లో ప్రదర్శిస్తున్న వీధి నాటకాల కంటె కంగుంది వీధి నాటకాలే ప్రాచీనమైనవిగా, ప్రసిద్ధి కెక్కినవిగా తెలుస్తున్నవి

☆ ముఖాముఖి – గోవిందముందడి – 45 మిట్టపల్లె

చిత్తూరు జిల్లాలో ఏ ప్రాంతంలో వీధి నాటకాలను ఎవరు ప్రదర్శించినా, ఏదో రకంగా 'కంగుంది' వారి వీధి భాగవతులతో సంబంధం కలిగి ఉంటారు నాటక సమాజాలను ఏర్పరచి, వాటిద్వారా వందలాది శిష్యగణాల్ని తయారుచేసి వంశపారంపర్యంగా ఈ కళనే వృత్తిగా స్వీకరించి జీవించే కళాకారులెందరో గలరు వారిలో వెంకటస్వామి, అణ్ణామలై, యం బత్తల్‌రెడ్డి, పణతల చిన్నబ్బ, పందిరి మునస్వామి, ఎన్ వెంకట్రామయ్య, ఎస్ ఖాదర్ సాహెబ్ మొదలగు వారు ప్రముఖులుగా చెప్పవచ్చు కంగుంది వీధినాటకాలకు విశిష్ట సేవలు చేసి, వీధినాటక వికాసానికి తన జీవితాన్నే అర్పించిన కళా తపస్వి చిత్తేరి మునస్వామిగా తెలుస్తోంది ఇతని తర్వాత ఇతని వంశస్థులు, శిష్యులు అందరూ కలిసి "శ్రీకృష్ణ దేవరాయ నాటక సమాజం" అనే నాటక సమాజాన్ని స్థాపించి, అందులో కొత్త ఇండ్లు, అనిమిగానిపల్లి, గుండ్లపల్లి, యామగానిపల్లి మొదలగు గ్రామాలకు సంబంధించిన కళాకారులను సభ్యులుగా చేర్చుకొని నేటికీ వీధినాటకాల ఉనికికి జీవం పోస్తున్నారు కంగుంది సంస్థానాన్ని పరిపాలించిన పాళేగాళ్ళలో చివరి వాడైన శ్రీ కె జె వెంకటపతిరాజు చిత్తేరి మునస్వామి ప్రదర్శించిన వీధి నాటకానికి ముగ్ధుడై అప్పట్లోనే 12 తులాల బంగారు పతాకాన్ని, 40 తులాల వెండి పతకాన్ని బహూకరించారట వీరు ఇతర రాష్ట్రాల వారి ఆహ్వానం మేరకు ఢిల్లీ, బీహార్, పంజాబ్, ఒరిస్సా, తమిళనాడు, కర్ణాటక, రాజస్థాన్ మొదలైన రాష్ట్రాల్లో వీధినాటకాలను ప్రదర్శించి తెలుగువారి సంస్కృతీ సాంప్రదాయాలతో పాటు జానపద కళా విశిష్టతను తెలియజేశారు అంతేగాక మాజీ భారత ప్రధానులైన శ్రీమతి ఇందిరాగాంధీ, శ్రీ పి వి నరసింహారావు గార్ల ఆదరాభిమానాలను కూడ చూర గొన్నారు శ్రీకృష్ణదేవరాయ నాటక సమాజం ఆధ్వర్యంలో నేటికీ ఆకాశవాణి, దూరదర్శన్ లలో ప్రదర్శనలిస్తున్నారు ఇంతగొప్ప ప్రాముఖ్యాన్ని సంతరించుకొన్న ఈ వీధి నాటకాలు అనేక ప్రాంతాల్లో విజయ ఢంకాలు మోగించాయి

రాజులు పోషించి, ప్రజలు ఆదరించి, పొరుగు రాష్ట్రాలు హర్షించి అత్యున్నత జానపద కళాశిఖరాలను చేరుకొన్న ఈ వీధినాటకాలు నేడు దయనీయ స్థితిలో కొట్టుమిట్టాడు తున్నాయి ఈ కళనే కులవృత్తిగా నమ్ముకొని జీవితాన్ని గడుపుతున్న ఎందరో కళాకారులు వీధినాటకాలకు ఆదరణ తగ్గి నేడు వీధుల్లో యాచించుకునే స్థితికి దిగజారారు జానపద కళ ఒక సామాజిక కళ సమాజంలో చైతన్యం రానిదే సమాజాభివృద్ధి లేదు చైతన్యం రావాలంటే సరైన పద్ధతిలో, సకాలంలో, సంబంధిత ప్రజలకు సందేశం అందాలి ఇలాంటి సందేశాలను ప్రజలకు అందివ్వడంలో వీధినాటకాలు ఉత్తమ సాధనాలుగా చెప్పవచ్చు ఇంతటి బాధ్యత, ప్రాధాన్యం, ప్రావీణ్యాలను కలిగి ఉన్న ఈ వీధినాటకాలు కనుమరుగయ్యే ప్రమాదాలు పొడచూపుతున్నాయి ఈ ప్రమాదం తప్పించాలంటే ప్రజల పరంగా, ప్రభుత్వ పరంగా తగిన ప్రోత్సాహాన్ని చూపించాల్సిన అవసరం ఎంతో ఉంది

ఈ వీధినాటకాల పట్ల ఉత్సాహం కనబరుస్తున్న గ్రామీణ యువతకు తగిన ప్రోత్సాహమివ్వడానికి యువకళా బృందాలను ఏర్పాటుచేసి శిక్షణ ఇస్తే బాగుంటుంది

సాంస్కృతిక వ్యవహారాల శాఖ, నాటక కళాపరిషత్తు, నెహ్రూయువ కేంద్ర, జిల్లా పౌర సంబంధాల శాఖల ద్వారా లేక సాంస్కృతిక కార్యక్రమాల పట్ల ఆసక్తి కలిగిన ఏ సంస్థ ద్వారానైనా, ప్రతి జిల్లాలోను ఈ వీధినాటకాలను ప్రదర్శింపజేసి, వారికి తగిన ఆర్థిక సహాయ మిచ్చి ప్రోత్సహించినట్లయితే వీధినాటకాలకు పూర్వపు స్థితిని తేగలిగిన వారమౌతాం

గుర్తింపు పొంది కళాసేవ చేస్తున్న నాటక బృందాలకు వస్తుసామగ్రి, వేష, భూషణాలకు నామమాత్రంగా కాక రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు ఉదారంగా ఆర్థిక సహాయాన్ని అందిస్తే వీధినాటక బృందాల సంఖ్య పెరగగలదు

వీధినాటక పోటీలను నిర్వహించి ప్రతిభ కనబరచిన నటకులకు, నాటక సమాజాలకు జిల్లాల వారీగా బహుమతుల నివ్వడమే గాక ధన రూపేణ పారితోషికాలను ప్రకటిస్తే బాగుంటుంది

వీధినాటక కళకు గుర్తింపు తెచ్చిన కళాకారుల, కళాభిమానుల పేర్లతో స్మారక నిధులను ఏర్పాటుచేసి అర్హులైన కళాకారులను ఆదుకొంటే ఎందరో కళాకారులను వెలికి తెచ్చిన వారమౌతాం

వీధినాటక రచయితలకు, పరిశోధకులకు ఆర్థిక సహాయాన్ని అందించి ప్రోత్సహిస్తే వీధి నాటకాలకు సంబంధించిన అనేక కొత్త విషయాలు వెల్లడి కాగలవు

వీధినాటకాలే జీవనోపాధిగా గడిపి చితికిపోయిన కుటుంబాలను అదుకోవడానికి ప్రత్యేక ఆర్థిక సహాయం, వృద్ధ కళాకారులకు వృద్ధాప్య పించన్లు మంజూరు చేసి కళాకారులను ఆదుకొంటే, ఈ కళ అణగారి పోకుండా యువ కళాకారులు వీధినాటకాల పట్ల ఉత్సుకత చూపగలరు

ప్రసార సాధనాలలో వీధినాటకాలకు ఇప్పటికంటే ఎక్కువ ప్రాధాన్యత కల్పిస్తే ప్రజాదరణకు నోచుకోగలవు

మన సంస్కృతీ పరిరక్షణలో భాగంగా ఈ నాటక కళలను వీడియోల ద్వారా భద్రపరచడమేగాక, దుస్తులు, ఆభరణాలు మొదలైన వాటిని నమూనాలుగా సేకరించి వీధి నాటక వస్తు ప్రదర్శన శాలను ఏర్పాటు చేయడంవల్ల భావితరాల వారికి మన కళావైభవాన్ని అందించిన వారమౌతాం

వీధినాటక కళలను ప్రోత్సహిస్తున్న గురువుల, కళాకారుల, నాటక సమాజాల చరిత్రలను గ్రంథస్థం చేయడంద్వారా రాగల తరాలకు ఈ సంస్కృతీ వారసత్వాన్ని అందించిన వారమవుతాం

మరుగున పడిపోతున్న వీధినాటక కథల వ్రాతప్రతులను సేకరించి, సంస్కరించి, ముద్రించి భద్రపరచవలసిన అవసరాన్ని గుర్తించి తెలుగు విశ్వవిద్యాలయం లాంటి సంస్థలు కృషి చేయడం వల్ల వీధినాటక ప్రక్రియ పదికాలాలపాటు తన స్థిరత్వాన్ని పొందగలదు

వీధినాటకాలకు సంబంధించిన పాఠ్యాంశాన్ని ఉన్నత విద్యాస్థాయిలో విద్యార్థుల పాఠ్యాంశాల్లో చేర్చి ఈ కళపట్ల అవగాహన, ఆసక్తిని పెంపొందిస్తే బాగుంటుంది

అసలు సిసలైన గ్రామీణ ప్రాంతపు వీధినాటక బృందాలను ప్రవాస భారతీయులున్న విదేశాలకు పంపి, మన వీధినాటక కళావైభవాన్ని ప్రపంచ దేశాల దృష్టికి తెస్తే మన కళావైభవాన్ని విదేశాలలో చాటిచెప్పిన వారమౌతాం ఇది కళాకారులకు మంచి అంతర్జాతీయ గుర్తింపు తేగలదు తద్వారా కళాకారులకు నూతనోత్సాహం రాగలదు

ధర్మరాజు గుడులున్న గ్రామాలు

1 కట్టమంచి
2 తేనెబండ
3 సంతపేట
4 మురకం బట్టు
5 కాణిపాక పట్నం
6 తవణంపల్లి
7 దిగువమాఘం
8 కాణిపాకం
9 మిట్టపల్లె
10 కల్లుపల్లె
11 పానాటూరు
12 దేవళంపేట
13 గంగమ్మగుడి
14 ఉగ్రాణపల్లె
15 తరిగొండ
16 వావిల్‌తోట
17 పాకాల
18 తాళంబేడు
19 అర్థల కృష్ణాపురం
20 అర్థల బనవేడు
21 కుర్చివేడు

22 శెట్టిగారిపల్లె
23 గంగాధర నెల్లూరు
24 నెల్లేపల్లి మిట్ట
25 తయ్యూరు
26 కొత్తపల్లె మిట్ట
27 వెదురుకుప్పం
28 పెనుమూరు జక్కదనం
29 శ్రీకాళహస్తి
30 కార్వేటి నగరం
31 కుక్కలపల్లె
32 ఎద్దులవారిపల్లె
33 కరిడివారిపల్లె
34 తడకర
35 బంగారెడ్డిపల్లె
36 తాటిమాకులపల్లె
37 చీలాపల్లె
38 కమ్మతిమ్మేపల్లె
39 బొమ్మసముద్రం ఆది ఆంధ్రవాడ
40 నరసింగరాయని పేట
41 మూర్తినాయుడు పల్లె
42 ముళ్ళపూడి
43 చెర్లోపల్లి
44 పాపానాయుడుపేట
45 పుత్తూరు
46 చంద్రగిరి
47 చిన్నగొట్టిగల్లు
48 దాసరాపల్లి
49 చెన్నారెడ్డి ఊరు

## మహాభారత వీధినాటకాలు ప్రదర్శించే గ్రామాలు

1 కొత్త ఇండ్లు
2 గుండ్లపల్లి

3 అనివిగానిపల్లి
4 అంకిరెడ్లపల్లి
5 ఆనిగానూరు
6 పెద్దుగానూరు
7 బూదుగూరు
8 తుమ్మి
9 వెంకటంపల్లి
10 దండికుప్పం
11 విజలాపురం
12 సింగసంద్రం
13 కంగానెల్లూరు
14 మొరుంపల్లి
15 కృష్ణమరెడ్డిపల్లి
16 బోడినాయనిపల్లి
17 సింపరపల్లి
18 అరికల
19 గౌనువారిపల్లి
20 గోసువారిపల్లి
21 నాగనపల్లి
22 తుమికిచెట్ల గొల్లపల్లి
23 మానువారిపల్లి
24 చిన్నప్పళ్ళి
25 దాసిరెడ్లపల్లి
26 యల్లంపల్లి
27 భీముగానిపల్లి
28 మట్లువారిపల్లి
29 తిరుమరెడ్లపల్లి
30 పెద్దకురప్పల్లి
31 ఆర్ నడుంపల్లి
32 గుంతలపేట
33 దిగువపల్లి

34 అజ్జమరెడ్డిపల్లి
35 పాసిమారుపల్లి
36 బందార్లపల్లి
37 పెంచుపేట
38 ఎగువ చింతవారిపల్లి
39. దిగువ చింతవారిపల్లి
40 నేతి గుండ్లపల్లి
41 యఱ్ఱగుండ్లపల్లి
43 కమ్మవారిపల్లి
43 కొండమిందపల్లి
44 కోటబురుజు
45 అప్పినపల్లి
46 శివాడి
47 సామనేరు
48 అమరాజుపల్లి
49 ముత్తుకూరు
50 మంచినీళ్ళపల్లి
51 గెడ్డూరు
52 చింతమాకులపల్లె
53 ఇటుక నెల్లూరు
54 కాటిపేరి
55 చెదళ్ళ
56 కురవూరు
57 అప్పినే
58 యనమ జామనపల్లి
59 గంగవరం
60 మారేదుపల్లి
61 టి ఎస్ అగ్రహారం
62 నాగిరెడ్డిపల్లి
63 కడతట్లపల్లి
64 పొన్నమాకుల పల్లి

65 చిన్నపురం
66 తిమ్మోజిపల్లి
67 సి ఆర్ కండిగ
68 గొల్లపల్లి
69 కలికిరి వాండ్లపల్లి
70 సాతంబాకం
71 వడ్డిగుడిసెలు
72 గారంపల్లె
73 కలిజివేడు
74 నార్శంపల్లె
75 వెంకటాపురం
76 ఎగువ కాలువ
77 గంగుపల్లి
78 కుప్పనపల్లి
79 పోలవరం
80 గొడుగుచింత
81 ఆలమడుగు
82 గంగమ్మగుడి
83 పెనుమూరు
84 చెర్లోపల్లి
85 కట్టకిందపల్లి
86 కారూరు
87 గోనులకురప్పల్లి
88 జగ్రావారిపల్లి
89 చప్పిడిపల్లి
90 కొలమాసినపల్లె
91 నెల్లిపట్ల
92 మాదిగూరు
93 మోట్లపల్లి
94 బాపనత్తం
95 మరవ ఇండ్లు

96 రఘునాయకుల దిన్నె
97 విరూపాక్షపురం
98 కురవూరు
99 రాయల్‌పేట
100 మాలేనత్తం
101 బాదూరు
102 ముదికుప్పం
103 ఆరూరు
104 జంగాలపల్లి
105 చూరికాపురం
106 నల్లాటూరు
107 గుండ్రాజుకుప్పం
108 కృష్ణారామాపురం
109 తలపుల
110 యర్రావారిపాళెం
111 భాకరాపేట
112 బండకాడపల్లె
113 కక్కలమిట్ట
114 బోడేవాండ్లపల్లె
115 తవణంపల్లె
116 జక్కదనం
117 మిట్టపల్లె

## తెలుగు గ్రంథాలు


1 అనంతకృష్ణవర్మ, రాళ్లపల్లి నృత్తరత్నావళి జాయపసేనాని (అనువాదం) - ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ ప్రచురణ

2 ఆంధ్రపత్రిక ముద్రాలయం ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము

3 ఎల్లోరా మనప్రాచీన కళలు పుట్టుపూర్వోత్తరాలు - 1960

4 కంగుంది జమీన్‌దారి వారి ప్రచురణ కంగుంది జమీన్‌దారీ చరిత్రము - 1917

5 డా॥ కృష్ణకుమారి నాయని జానపద గేయాలు - సాంఘిక చరిత్ర - 1974 తెలుగు జానపద గేయ కతలు - 1977

6 డా॥ కృష్ణారెడ్డి, చిగిచర్ల ధర్మవరం తాలూకా జానపద గేయాలు - 1984
జానపద నృత్యకళ - 1989
జానపద కళారూపం - చెక్కభజన - 1989
7 డా॥ గంగప్ప, ఎస్ తెలుగునాటకం - 1985
8 తిక్కనామాత్యుడు శ్రీమదాంధ్ర మహాభారతము
9 డా॥ దొణప్ప తూమాటి ఆంధ్ర సంస్థానములు - సాహిత్య పోషణము-1969
జానపద కళాసంపద-1975
10 నన్నయ ఆంధ్ర మహాభారతం (ఆదిపర్వం)
11 డా॥ నారాయణరెడ్డి సి ఆధునికాంధ్ర కవిత్వం - సంప్రదాయములు - ప్రయోగములు-1977
12 నాట్యకళ ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ - 1964
13 నాట్యకళ ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ - 1968
14 నాట్యకళ ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ - 1973
15 నాట్యకళ ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ - 1977
16 ప్రతాపరెడ్డి సురవరం రామాయణ విశేషములు - 1957
17 డా॥ ప్రేమలత రావి తెలుగుజానపద సాహిత్యము - పురాగాధలు-1983
18 డా॥ రామరాజు బి తెలుగుజానపద గేయ సాహిత్యము - 1958
19 రామకృష్ణ నటరాజ ఆంధ్రనాట్యం - 1984
20 రామకృష్ణపంతులు వి నాటక ప్రయోగం- 1964
21 డా॥ రాధాకృష్ణమూర్తి మిక్కిలినేని నటరత్నాలు-1980 తెలుగువారి జనపద కళారూపాలు - 1992
22 డా॥ రామనాథం చింతా కూచిపూడి నాట్య విశిష్టత-1994
23 వాత్సాయన్ కపిల భారతీయ జానపద నృత్యాలు - 1960
24 వెంకట సీతారామయ్య పోతుగుంట రాయలసీమలో రంగస్థలం - 1993
25 డా॥ వెంకటావధాని దివాకర్ల, డా॥ యశోదారెడ్డి పి , కోదండరామరెడ్డి మరుపూరు తెలుగు సామెతలు - తెలుగు విశ్వవిద్యాలయం - హైదరాబాద్ - 1986
27 శేషాచలం ఎం అండ్ కంపెనీ క్రీడాభిరామము - వినుకొండ వల్లభరాయకృతము - 1972
28 శ్రీకృష్ణ దేవరాయలు ఆముక్తమాల్యద
29 శ్రీనాధుడు కాశీఖండము
30 శ్రీరామ అప్పారావు పోణంగి నాట్యశాస్త్రము (గుప్తభావ ప్రకాశికా సహితము) 1959 తెలుగు నాటక వికాసము-1967

31 డా॥ సుందరం ఆర్వీయస్ జానపద సాహిత్య స్వరూపం - 1976
32 సుబ్రమణ్యం సాధు కంగుంది సంస్థాన చరిత్ర - 1981
33 సోమనాధుడు పాల్కుర్కి బసవపురాణం - పండితారాధ్య చరిత్ర

సంచికలు - పత్రికలు

1 కళలకు కలికాలం - కళాకారులకు కష్ట జీవితం ఈనాడు దినపత్రిక 19-11-92
2 తెలంగాణాలో యక్షగానం రచన - ప్రయోగం జాతీయ సాహిత్య పరిషత్ పాలమూరు శాఖ - ఆంధ్రప్రదేశ్ 1994
3 పాళేగార్ల వెయ్యేళ్ళ వంశవృక్షం తాల్చిన జ్ఞాపకాలు ఆంధ్రజ్యోతి దినపత్రిక 31-7-92
4 తమిళనాడులో తెలుగు జానపదాలు అమరజీవి పొట్టిశ్రీరాములు నైస్టియత్ జయంతి సావనీర్
5 నాటి వైభవానికి ప్రతీక కంగుంది సంస్థానం ఈనాడు
6 వెంకటపతినాయుడు గారి పాలనా రజతోత్సవ సావనీర్ 10-12-1943

నిఘంటువులు

1 బ్రౌన్ సి పి తెలుగు ఇంగ్లీషు నిఘంటువు ఏషియన్ ఎడ్యుకేషనల్ సొసైటీ, ఢిల్లీ
2 సీతారామాచార్యులు బహుజనపల్లి శబ్ద రత్నాకరం, ఏషియన్ ఎడ్యుకేషనల్ సొసైటీ, ఢిల్లీ
3 శ్రీసూర్యారాయాంధ్ర నిఘంటువు (సం) కాకినాడ సాహిత్య పరిషత్ - 1942
4 విలియమ్స్ ఎం ఎం ఎ సాంస్క్రిట్ ఇంగ్లీష్ డిక్షనరీ

## ఆంగ్ల గ్రంధాలు

1 MARY CLARKE AND CLEMENT CRIP THE HISTORY OF DANCE
2 NAGA BHUSHANA SARMA M FOLK PERFORMING ARTS OF ANDHRA PRADESH
3 DR RAMARAJU B FOLK TALES OF ANDHRA PRADESH - 1974
4 SPEEL, HILDE GARD L FOLK DANCES OF SOUTH INDIA - 1945
5 SHYAM PARMAR TRADITIONAL FOLK MEDIA IN INDIA - 1975
6 VASTSYAYAN KAPILA TRADITIONAL INDIAN THEATRE

## తమిళ గ్రంథం

1 పెరుమాళ్ ఎ ఎన్ తమిళగత్తిల్ తెరుక్కూత్తు



కంగుంది దుర్గం ముఖద్వారం



ఆనాటి కంగుంది కళావేదిక (దుర్గంలో)



పాళేగాళ్ళ భవనము



వేణుగోపాలస్వామి - విఝులాపురం



కంగుంది దుర్గంలో సీతారామలక్ష్మణ ఆంజనేయ శిల్పాలు



వీరాంజనేయ, విఘ్నేశ్వర శిల్పాలు



వివిధరకాల దుస్తులు,కిరీటాలు,ఆయుధాలకు పూజా నిర్వహణ



నడుంపట్టీ



దుష్టపాత్రలు ధరించే దుస్తులు



గిరదా టోపన్లు



వేషాలంకరణకు ముందు గురువు ఆశీర్వాదం



వేషాలంకరణకు ముందు పూజా కార్యక్రమం



పాత్రధారుల వేషాలంకరణ





వివిధరకాల దుస్తులు



'ద్రౌపదీ వస్త్రాపహరణ'లో ఒక దృశ్యం



దర్బారు ప్రవేశ ద్వారం



ప్రక్క పరదాలు



ద్రౌపదివస్త్రాపహరణం నాటక కళాకారులను అభినందిస్తున్న రచయిత



వీధినాటక రచయిత శ్రీ కె.క్రిష్ణమూర్తిని (మొరుంపల్లె)
సన్మానిస్తున్న రచయిత డా॥ వి. గోవిందరెడ్డి





సారంగధర నాటక దృశ్యాలు



చిత్రాంగి పాత్రధారి - కె. నారాయణ (మొరుంపల్లె)



సారంగధర వీధినాటక కళాకారులతో రచయిత
డాక్టర్ వి. గోవిందరెడ్డి



వీధినాటక కళాకారులతో పొ శ్రీ తె వి మాజీ వైస్ ఛాన్సలర్ డా॥ నాయని కృష్ణకుమారి,
రచయిత డా॥ వి గోవిందరెడ్డి, పర్యవేక్షకులు డా॥ చిగిచర్ల కృష్ణారెడ్డి,
తె.వి వరంగల్ ప్రొఫెసర్ ఎన్ భక్తవత్సలరెడ్డి (కొత్తఇండ్లు)



హిడింబాసురుడు



హిడింబి



హిడింబి హిడింబాసుర సంవాదం



'హిడింబాసుర వధ' నాటకంలో పాండవులు



ద్రౌపదమ్మ శ్రీకృష్ణుడు



భీమ బకాసురుల యుద్ధం



బకాసురున్ని చంపుతున్న భీముడు





తపస్మాన్ ఎక్కేముందు అర్జున పాత్రధారి నిర్వహిస్తున్న గురుపూజ

తపస్మాన్



జమీన్‌దారు వంశస్థుడైన ఎన్ ఎన్.వి.త్రినాథ్‌తో (విజలాపురం) రచయిత గోవిందరెడ్డి ముఖాముఖి



జమీన్‌దారు వంశస్థులైన ఎం వెంకటపతినాయుడు, ఎం సాయిబాబా మూర్తితో (కుప్పం) రచయిత డా॥ గోవిందరెడ్డి ముఖాముఖి




రచయితను సన్మానిస్తున్న కళాకారులు, డా॥ చిగిచెర్ల కృష్ణారెడ్డి.



# చిత్తూరు జిల్లా
# వీధినాటకాలు - ఒకపరిశీలన



M A Ph d  B Ed  D Y W

చిత్తూరు జిల్లా, బంగారు పాళెం తాలుకాలో చెఱకు పంటలు, వరిమళ్ళతో సిరులొలికే చిఱుగ్రామం ఉన్నవి నలుబది ఇళ్ళయినా నలుగురూ కలసి జీవించే నల్ల సిద్దన పల్లె గ్రామంలో 1944వ సంవత్సరం ఏప్రియల్ నెల 10వ తేది ఈ లోకంలోకి వచ్చాను ఊరికి ఉపకారి ఊట్ల చెంగారెడ్డి, పోలమ్మల ద్వితీయ సంతానం

ప్రాథమిక పాఠశాల విద్య బొమ్మసముద్రంలో - చిత్తూరులో ఉన్నత పాఠశాల విద్య - తిరుపతి శ్రీ వెంకటేశ్వర కళాశాలలో బి ఏ, డిగ్రీ, తిరుపతిలో శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయంలో 1968లో తెలుగు యం ఏ.లో ప్రథమ శ్రేణి - హైదరాబాద్ పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం నుండి 'చిత్తూరు జిల్లా వీధినాటకాలు - ఒకపరిశీలన' అనే అంశం మీద పరిశోధనాత్మక గ్రంధానికి పిహెచ్‌డి డిగ్రీ -తమిళనాడు, అన్నామలై విశ్వవిద్యాలయంలో బి ఇడి, చండీగర్‌లో కామన్ వెల్త్ వారి నిర్వహణలో డిప్లమో ఇన్ యూత్ వర్కు

1968లో కళాశాల అధ్యాపక వృత్తి చేపట్టినప్పటి నుండి అనంతపురం, చిత్తూరు, శ్రీ కాళహస్తి పట్టణాల్లో ప్రభుత్వ డిగ్రీ కళాశాలల్లో తెలుగు ఉపన్యాసకుడిగా- 1981 నుండి కడప నెహ్రూ యువ కేంద్రంలో యువజన సమన్వయ కర్తగా 1992 వరకు, 1993 నుండి చిత్తూరు నెహ్రూ యువ కేంద్రంలో యూత్ కో- ఆర్డినేటర్‌గా నేటి వరకూ-

వీలున్నప్పడు చిన్న చిన్న కవితలు వ్రాయడం - కథానికలు - నాటికలు వ్రాయడం - విమర్శనాత్మక వ్యాసాలు వ్రాయడం - సంఘసేవా కార్యక్రమాలు చేపట్టడం - కళాశాలలో లెక్చరర్‌గా ఉన్నప్పటి నుండి (1968 నుండి 1980 వరకు) గ్రామాల్లో యువజన సంఘాల స్థాపన - వాటి ద్వారా గ్రామాభివృద్ధి కొరకు పాటుపడుట - కళాకారున్ని కాకపోయినా కళాభిరుచి, కళాకారులంటే అభిమానం (ముఖ్యంగా జానపద కళాకారులు) గౌరవం - కళాపోషణకు పూర్తి చేయూత నివ్వడం - మదర్ థెరీసా సేవాభావంలో కొంతైనా అలవర్చు కోవాలనుకోవడం - యువతను ఉత్తమ పౌరులుగా తీర్చిదిద్దాలనే తపన - దేశ రక్షణకు యువతను సిద్ధం చేయాలనే ఆరాటం

కళాకారుల్ని ప్రోత్సహించడానికి, కళల ద్వారా జాతీయ సమైక్యతాభావాల్ని యువతలో పెంపొందించడానికి, సామాజిక స్పృహ తీసుకురావడానికి అణువుగా రాజరాజేశ్వరి ఆర్ట్స్ అకాడమీ స్థాపన

సంభవం నాటిక ( అముద్రితం), చైతన్య గేయాలు, విమర్శనాత్మక సాహిత్య వ్యాసాలు, డా॥ అంబేత్కర్ ( అముద్రితం)

వివిధ అంశాలపై అనేక రేడియో ప్రసంగాలు- వివిధ సాహితీ సదస్సులలో వివిధ అంశాలపై పత్రసమర్పణలు - చర్చా కార్యక్రమాల్లో పాల్గొనడం